ప్రచురణ 7.

# కర్మభూమి

## 2వ భాగము.

పోడూరి రామచంద్రరావుగారు



వాణీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము.

2-0-0

# అభిమానులు

| | |
|---|---|
| శ్రీ రాజా వెంకటమురళీమనోహరరావు & బ్రదర్సువారు, | మంచిరాల |
| శ్రీ G. గంగారెడ్డిగారు | ” |
| శ్రీ కొత్త పుల్లయ్యలింగం & బ్రదర్సువారు | ” |
| శ్రీ పెండ్యాల చిన్నయ్యగారు | ” |
| శ్రీ నాగుబంటి చినకృష్ణయ్యగారు | వరంగల్ |
| శ్రీ రాజా వెంకట ముత్యమరావుగారు | పెదపల్లి |
| శ్రీ జవ్వాది సత్యనారాయణగారు | ” |
| శ్రీ జవ్వాది లక్ష్మయ్యనాయుడుగారు | పెనుగొండ |
| శ్రీ నూలి లక్ష్మినారాయణ జమీందారువారు | ” |
| శ్రీ తడవర్తి వెంకటస్వామి & బ్రదర్సువారు | రాజమండ్రి |
| శ్రీ జూపూడి వెంకటేశ్వరరావుగారు | ” |
| శ్రీ కారుమూరి సర్వేశలింగంగారు | ” |
| శ్రీ ,, సత్యంగారు | ” |
| శ్రీ పెత్సా వెంకటరత్నంగారు | ” |
| శ్రీ శీమకుర్తి సుబ్బారావుగారు | ” |
| శ్రీ అన్నం వెంకట్రాజుగారు | ” |
| శ్రీ ఆలమూరి సీతారామస్వామిగారు | ” |
| శ్రీ బచ్చు సత్యానందంగారు | ” |
| శ్రీ జి. వరదారావుగారు | ” |
| శ్రీ జిల్లా సుబ్బారావుగారు | ” |
| శ్రీ నూలి నాగేశ్వరరావుగారు | ” |
| శ్రీ యడవల్లి రామారావుగారు | ” |
| శ్రీ పచ్చిగోళ్ళ వెంకటభోగేశ్వరరావుగారు | ” |
| శ్రీ బచ్చు శ్రీరామ గోపాలకృష్ణమూర్తి బ్రదర్సువారు | ” |
| శ్రీ వుడత్తు నారాయణమూర్తిగారు | ” |

| | |
|---|---|
| శ్రీ గుండు వెంకటేశ్వరరావుగారు | రాజమండ్రి |
| శ్రీ యిన్నమూరి చెంచయ్యగారు | ,, |
| శ్రీ సుగ్గుల అక్షయ్యలింగం గుప్తగారు | కంభంమెట్టు |
| శ్రీ పసుమర్తి వీరభద్రస్వామిగారు | విజయనగరం |
| శ్రీ వెత్సా శ్రీరామమూర్తిగారు | ,, |
| శ్రీ వుసిరికల సోమసత్యనారాయణగారు | ,, |
| శ్రీ పోట్నూరి స్వామిబాబుగారు | నరసన్నపేట |
| శ్రీ కొండా శంకరయ్యగారు | సికింద్రాబాదు |
| శ్రీ బెల్లు జగదీశ్వరయ్యగారు | ,, |
| శ్రీ కైలాసం శరభయ్యగారు | ,, |
| శ్రీ పైండా వెంకటనారాయణగారు | కాకినాడ |
| శ్రీ ఉప్పల శ్రీరామమూర్తిగారు | అనకాపల్లి |
| శ్రీ గ్రంధి కన్నయపంతులుగారు | ,, |
| శ్రీ అన్నవరపు సుబ్బారావుగుప్తగారు | బెజవాడ |
| శ్రీ కాకరపర్తి భావనారాయణశ్రేష్టిగారు | ,, |
| శ్రీ పచ్చిపులుసు వెంకటసుబ్బారావుగారు | ,, |
| శ్రీ డాక్టర్ ఉరిటి సూర్యనారాయణమోహన్‌గారు | ,, |
| శ్రీ చుండూరి శ్రీరాములుగారు | ఏలూరు |
| శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తిగారు | పిప్పర |
| శ్రీ పులవర్తి వెంకటసుబ్బారావుగారు | ఆకివీడు |
| శ్రీ పాదర్తి కృష్ణమూర్తి & బ్రదర్సువారు | రాజమండ్రి |
| శ్రీ ఫువ్వాడ నరసింహామూర్తిగారు | రాజమండ్రి |
| శ్రీ వైశ్యరాజు కేదార్‌నాద్‌రాజుగారు | బరంపురం |
| ,, కాశీరాజుగారు | ,, |
| శ్రీ మిరియాల వెంకటరత్నం & బ్రదర్సువారు | రాజమండ్రి |
| శ్రీ ద్వాడ వీరాస్వామిరెడ్డిగారు | రాజమండ్రి |

# కర్మభూమి

## 2వ భాగము

★

### 1వ ప్రకరణము

★

ఉత్తర పర్వతశ్రేణిమధ్య రమణీయమగు నొక కుగ్రామము కలదు. ఆపల్లెకెదుట నొక యపూర్వ లావణ్యమయియగు బాలిక వడువున, గంగాస్రవంతిహసించుచు, మఱొంగుచు, గానమొనర్చుచు, నాట్యముసల్పుచు, పఱుగువాఱుచుండును. ఆ జనపదము పిఱుంద నున్నత పర్వతమొండు, శ్యామలము. గభీరము, విచారమగ్నమునై, యా గ్రామ మర్దాని వినోదామోదరంజిత బాల్యస్మృతియో, లేక, యువావస్థయందలి సౌవర్ణ్య మధురస్వప్నమో యనుమాడ్కి, నొకా నొక వికృత జటావిభూషితుడగు వృద్ధయోగి చందమున, నిలచి యుండును.

ఈ పల్లెటూరునం దిరువది ముప్పది కుటీరము లుండును. ఆ గుడిసెలు గండశిలల కుడ్యములపై, పలకలు పఱచియుండును. వాటి ద్వారములయందు వెదురుతడకల తలుపులుండును. ఆ చిన్న గుడిసెల యందాయూరి ప్రజలు తమ తమ గోమహిషాదిపశు సముదాయము పెట్టుకొని, యనంతమునుండి విశ్రాంతి వడయుచుందురు.

ఒకనాటి సంధ్యాసమయమున నొక చామనచాయగల, బక్క పలుచని, యువకుడు, మురికచొక్కా, మురికకండువా, వీపునమూట, ప్రక్కనొక సంచీ, గలిగి, యా గ్రామమును ప్రవేశించి, యొక వృద్ధ స్త్రీని "ఏమి తల్లీ! ఒక పరదేశికిచట నీ రాత్రికి తలదాచుకొనుట కొక్కింత తావు దొరుకునా?" యని పృచ్ఛించెను.

ఆ ముక్కాలి ముదుసలి, నెత్తినొక కట్టెలమోపు పెట్టుకొని, పచ్చికబయలునుండి యొకముసలియావును దోలుకొని వచ్చుచుండెను. ఆమె వానినా పాదమస్తకము పరిశీలింప దొడగెను. ఒడలు స్వేదజల సించితమై మోము ధూళిధూసరితమై, కన్నులొకటి బాధచే నకనక లాడుచున్నవై, జీవితమున నాతడెద్దియేని యాశ్రయాన్వేషణార్థియై చనుదెంచినవాడని తోపజేయుచుండెను. హృదయము కరుణార్ద్రమగుట నా వృద్ధురాలు "ఇచ్చట నెల్లరు రైతుదాసులు నివసించుచుందురని" చెప్పెను.

అమరకాంతుడీరీతిగ పల్లెలవెంట తిరుగుచు వచ్చుచుండెను. చిన్నవి, పెద్దవి, యేబది గ్రామములవరకు నతడు చూచియుండెను. వానికి పలువురి పరిచయము లభించెను. పెక్కండ్రాతనికి సాయము నర్చిరి. చాలమంది యతనిభక్తులునయిరి. నగరవాసియగు నా సుకుమార యువకుడొకింత శుష్కించినను, శీతోష్ణములు, అతివృష్టి యనావృష్టులు, ఆకలిదప్పులు, సహించుశక్తి వానికి నిశితమగుచుండెను. వాని భవిష్యజ్జీవనమున కిదియే శిక్ష. ఇదే తపస్సు. అతడు గ్రామీణుల సరళత్వము, సహృదయత, ప్రేమ, ప్రమోదములను గాంచి ముగ్ధుడైపోయెను. అట్టి యకుటిల, యమాయక ప్రజలపై జరుగు నత్యాచారములను గాంచి వానిరక్తము ముడికిపోవుచుండును. జనపద సీమల లభ్యమగునని వాని నీస్సుకొనివచ్చిన యాపేక్షితమగు నా శాంతి యిచ్చట నామమాత్రమైన నగపడలేదు. ఘోరమగు నన్యాయమే యిచ్చట రాజ్యము సేయుచుండెను. అమరుని హృదయ మీయన్యాయమును విరోధించుచు పతాక మెగురవైచుచు వానిని ద్రిప్పుచుండెను.

సవినయముగ నతడు "మాతా! నేను జాతిమత విభేదములను పాటింపను. సచ్ఛీలుడగు మాదిగవాడైనను మాన్యుడు. కపటి,

యనృతవాది, లంపటుడు నగు బ్రాహ్మణుడును మన్నన కనర్హుడు. తెమ్మొ! కట్టెలమోపు నేను మోచుకొనివత్తు” నని పల్కెను.

వృద్ధురాలు వాని నాశీర్వదించుచు “ఎచటికి పోవలెను నాయనా!” యడిగెను.

“ఊరకే యాచించుచు తిరుగుచుందును. పోవుటకు వచ్చుటకు నేదీలేదు. రేయి పండుకొనుటకు చోటు దొరుకునా?”

“చోటు కేమి లోటు నాయనా! దేవళపు టరుగుపై పడుకో వచ్చును. ఏసాధువుల మాయలలో నైనను పడిపోలేదుకదా? నాకొడుకొకడు వారి జాలములలో చిక్కుకొనెను. మఱి వానిజాడ లేదు. ఈసరికి పిల్లలతండ్రియై యుండవలసినవాడు.”

ఇరువురును పల్లెకు చేరిరి. అవ్వ తనగుడిసెతడకనొత్తిగించుచు “తెమ్మొ! ఆపుల్లమోపిచట పడవెయ్యి. అలిసిపోయినావు. కొంచెము పాలున్నాయి. త్రాగు. తక్కిన పాడిపశువులన్నీ చచ్చిపోయినాయి తండ్రీ. ఈగొడ్డొక్కటే మిగిలింది ఒక పావుసేరు పాలు మట్టుకిస్తుంది. తినినంత మేత లేదు. పాలెచటనుండి వస్తాయి?” అనెను.

అమరకాంతుడట్టి పరళస్నేహముచే నొసగబడిన యివి నిరాకరింపనేరడయ్యెను. గుడిసెలో ప్రవేశింపగనే వానిహృదయము కంపింపజొచ్చెను. దారిద్ర్యమచ్చట గుండెలుబాదుకొని ఏడ్చుచున్నట్లుండెను.

ఇక మన యీ యనంతసమాజము విలాసమగ్నమై యున్నది. దానికి వసించుటకు రమ్యహర్మ్యములు వలయును. పయనించుటకు మోటార్లు కావలెను. ఈ యకటా వికటపు సంసారవిధ్వంస మేటికి జరుగదు?

వృద్ధురాలు పాలొక యిత్తడిగిన్నెలో తిరుగబోసి, కుండనెత్తుకొని, నీరు తెచ్చుటకు బయలుదేరెను. అమరుడు “నేను తోడుకొని వచ్చెదను తల్లీ! చేద, త్రాడు నూతివద్దనే యుండునా” యనడిగెను.

"వద్దు నాయనా! నీరు తెచ్చుట కెక్కడికని పోతావు. ఒక్క రాత్రికి వచ్చినావు. నీచేత నీళ్లు తెప్పింపనా?" అనెను.

వృద్ధురాలా ఆ ఆ' యనుచునే యుండెను. మఱరుడు కడవ తీసుకొని బావికి సమీపించెను. ముసలిది యూరకుండలేకపోయెను. ఆమెయు వాని వెనుకనే వచ్చి చేరెను.

బావియొద్ద పలువురు వనితలు నీరు చేదుచుండిరి. అమరకాంతుని గాంచి యొక యువతి "సలోనీపిన్నీ! అల్లుడు కాడుగదా?"యని ప్రశ్నించెను.

అవ్వ నవ్వుచు "అల్లుడు కాకుంటే నీరుకోడుట కెందుకువచ్చునమ్మా? మీ యింటికికూడా యిలాంటిఅల్లుళ్ళు వస్తారా" అనెను.

ఆ యువతి వాలుకన్నులతో నమరకాంతునివంక చూచుచు,

"మాఅల్లుళ్లు మా చేతినీరైనా త్రాగరు పిన్నీ! ఇటువంటి అమాయకపు అల్లుణ్ణి మాయింటికి తీసుకుపోతాను" అనెను.

అమరునిగుండె కొట్టుకొనసాగెను. ఆ యువతి హత్యానేరము నుండి విముక్తిగాంచిన మున్నియే! ఆమె యిప్పుడంత సుకితా చింతా వివశయై లేదు. రూపమున మాధుర్యము గలదు. అంగములయందు వికాసమును, మోమున హాసముయొక్క మధురచ్ఛవియు గలవు. ఆనందమే జీవితతత్వము! ఆమెకు గతించినదానికి లక్ష్యములేదు. అతనిని మున్నిప్రాయశః పోల్చుకొనలేదు. అతనియాకారము పూర్తిగా మారిపోయినది. పట్టణముల వసించు సుకుమార యువకుడు. పల్లెలయందు కష్టించు కూలివాడుగ మారిపోయెను.

అమరకాంతుడు సిగ్గుపడుచు "నేనల్లుణ్ణికాను దేవీ! పరదేసిని. నేడీపల్లె చేరినాను. ఈబంధువు గ్రామమంతటికిని అతిథి" అనెను.

ఆయువతి మందస్మితయై మొనరించుచు "అయితే ఒకటిరెండు కడవలతో ముగియదు. రెండువందల కుండలు నింపవలె. లేనిచో కుండ నిటులిమ్ము. అబద్ధములాడుటలేదుకదా పిన్నీ?"యని పలికెను.

ఆమె యమరకాంతుని చేతినుండి కడవలాగుకొని, యురిత్రాటిని తగిలించి, నూతవైచి, మాటమాటల్లోనే కుండను తోడి, లాగి, బయట దించెను.

అమరుడు ఘటము నెత్తుకొనిపోయెను. మున్నీ "ఎవరో కులీనుడులాగున్నాడు పిన్నీ! చూచినావా? ఎంతసిగ్గుపడ్డాడో? మా యింటికోనుంచి పచ్చడి తీసుకొనివెళ్లు. పిండి, గిండి ఉన్నవా?" యనెను.

సలోనీ "జొన్నపిండికలదు. గోధుమపిండి ఎక్కడినుంచి తేను?"

"అయితే నేను గోధుమపిండి తెస్తాను. లేకుంటే నాతోరా. ఇస్తాను. అక్కడ పనిపాటలలో నిఱుకున్నంటే జ్ఞాపకముండదు"

మున్నీని మూడేండ్లక్రిత మాయూరి నాయకుని కుమారుడు హరద్వారమునుండి తీసుకొనివచ్చెను. అప్పటికి వారముదినములనుండి యు నామె యొకసత్రిముముంగిట జీర్ణదశలో పడియుండెను. గొప్ప గొప్ప వారాసత్రమునకు వచ్చుచుండిరి. దానధర్మములు సేయుచుండిరి. కాని యేరికినీ పేదరాలిపై దయ గలుగదయ్యెను. ఆ మాదిగ యువకుడు చెప్పులజోళ్లమ్ముకొనబోయి యుండెను ఈమెపై వానికిజాలి పుట్టెను బండిమీద వైచుకొని యిచ్చటికి దీసుకొని వచ్చెను. మందు మాకు లొసగిరి. చౌదరీ! యీశవము నేటికి తెచ్చితివని కోపించెను. కాని యువకుడుమాత్రము తంటాలుపడుచునే యుండెను. అచట డాక్టరులు వైద్యులు నెట్లు వత్తురు? విభూతి, యాశీర్వచనములు నే యాశ్రయములు. చనిపోయినవారిని కూడ పునర్జీవితుల నొనర్పజాలిన యొకానొక మంత్రవేత్తనుగూర్చి యీ యువకుడు వినియుండెను. ఆ నిశీధమం దాతనిని బిలుచుకొని రాబోయెను. 'తెల్లవారనిమ్ము. పోదువు గాని' యనెను చౌదరీ. తనయుడు వినిపించుకొనలేదు. రేయి యందే బయలుదేరెను. గంగనిండుగ పొంగియుండెను. దానిని దాటి పోవలసియుండెను. 'ఏమంత వెడల్పు పాయ? ఈదుకొని పోదును. ఎన్నివందల పర్యాయములీరీతిని వచ్చుచు పోవుచు నుండలేదు.' అని

తలంచెను. నిశ్శంకగ నీటజొచ్చెను. కెరటములు విసురుగనుండెను. కాళ్లు తేలిపోయెను. సంబాళించుకొన యత్నించెను. కాని లాభం లేక. పోయెను. మఱునటిదినమున నచటికిరెండుక్రోశముల దూరమున వాని శవము దొరికెను. అది యొక గండశిలకు దగులుకొని యుండెను. అతడు మరణించుటతోనే మున్నీ బ్రతికి లేచెను. అప్పటినుండియు నిచటనే యుండెను. ఈయిల్లే మున్నీకి యిల్లయ్యెను. ఇచ్చోట నామె కాదరణ కలదు. మర్యాద కలదు. ఆమె తన జాతి, పంక్తి, యాచార విచారములు, విస్మరించెను. అగ్రజాతికి చెందిన క్షత్రియాంగన. అస్పృశ్యులతోపాటస్పృశ్యయై సంతోషపూర్వకముగ నివసింప జొచ్చెను. ఆమెయింటికి పెత్తనము వహించెను. బయట పనులెల్ల నీమె చేయుచుండును. ఇంట వంట చేయుట, నీరు తెచ్చుట, దంచుట, మొదలగు పనులింటి కోడండ్రుసేతురు.

సలోనీని తనవెంట గొనిపోయి మున్నీ యొకపళ్లెములోగోధుమపిండి, యూరగాయపెట్టి యొకగిన్నెలో పెఱుగునైచి యిచ్చెను, కాని సలోనీ యా పళ్లెరమును దీసికొని పోవుటకు బిడియపడుచుండెను. అతిథి గుమ్మములోకూర్చుని యుండును. చూచి తన యింట గోధుమపిండియైన లేదనుకొనుచు కొంచెము చీకటిపడిన తరువాత వెళ్లెదనను కొనుచుండెను.

మున్నీ 'ఏమిటాలోచిస్తున్నావు పిన్నీ?' యని యడిగెను. 'కొంచెము చీకటిపడ్డాక పోవాలను కొంటున్నాను. అతడుచూస్తే యేమనుకుంటాడు?'

'నడుపు నేను నప్పగించి వస్తాను. ఏమౌతుంది. ఏమను కుంటున్నాడు. ఇక్కడెవరేనా ధనికులగు సాహుకార్లున్నారనుకుంటున్నాడా? ఇదే చెప్పుతున్నా చూడు. జొన్నరొట్టెలే తింటాడు. గోధుమ రొట్టెలు ముట్టుకొనే ముట్టుకోడు'

వారిరువురు గుడిసె సమీపించునప్పటికి అమరకాంతుడు చీపురు తీసికొని, గుమ్మముముందు తుడుచుచుండెను. నేలలనుండి చీపురు వేయలేదు. అతని తుడుపు చిందర వందరగా చిక్కువడినజుట్టు దువ్వెనతో దువ్వినట్లున్నది.

సలోనీ పాత్రలుపట్టుకొని వడివడి లోనికి వెళ్ళెను. మున్నీ ఇట్టి యాతిథ్యమభిలషిస్తే యిచటినుండి యెన్నటికి వెళ్ళిపోవుటే తటస్థించదు. అని నవ్వుచు నమరకాంతుని సమీపించి, చేతిలోని చీపురుకట్ట లాగి వేసికొనెను. అమరుడు కసవు కాలితో నొకమూల ప్రోగుచేసి 'శుభ్రపడినది. వాకిలి యెంతచక్కగ నున్నది' అనెను.

'రేపు వెళ్ళిపోతే నీమాటే జ్ఞాపకము వస్తూంటుంది. పరదేశులకు విశ్వాస మేముంటుంది? తిరిగి యిచటి కెందుకు వస్తారు?'

మున్నీ వదనమున సౌదసీనిచ్ఛాయ లలముకొనెను.

'ఇక్కడికి తిరిగి యెన్నడైన రావడము తటస్థిస్తే తప్పక నీదర్శనము చేసుకొంటాను. ఇంతి చక్కనియూరు నా కెచ్చటా కనబడలేదు. నది. పర్వతములు. అరణ్యము, నీటిశోభ విలక్షణమై యున్నది. ఇచటనే ఉండిపోవాలనీ, యెక్కడికీనా పోవడంమాట యెత్తకుందామనీ బుద్ధి పుట్టుతోంది.

మున్నీ యుత్సుకతతో "అయితే యిక్కడనే ఉండిపోరాదూ? 'అనెను కాని తిరుగ కొంచెమాలోచించి మీయింటిలో మీవారుంటారు. వారు మిమ్ముసిచట నేటికుండనిత్తురు?' అనెను.

"నేను చచ్చినా బ్రతికినా విచారించేవారు లేరు. నేనీ ప్రపంచములో నేకాకిని'' అనెను అమరుడు.

మున్నీ యనురోధ పూర్వకముగ 'అయితే ఇచట నేయుండుడు మీరెవరి సంతానము? అని ప్రశ్నించెను.

'అది మఱచిపోయాను. ఎవరుపిలిచి ప్రేమతో నొక కబళమిడురురో వారి వాడనేనేను'

'అయితే రేపునన్ను రానియ్యండి. అంతవఱకు చెప్పకుండా పారిపోవద్దు సుమండీ'

అమరుడులోనికేగిచూడగాముసలిది ప్రొయ్యి నూదుచుండెను. తడికట్టెలగుటచే నంటుకొనుట లేదు. ఆమె బోసినోటితో నూదుట కూపిరికూడా లేదు. అతనినిచూచి 'ఈ పొగలో కెందుకొస్తావు నాయనా? బయట కూర్చుండు. ఈచాప తీసుకువెళ్ళు' అనెను సలోని.

అమరుడు ప్రొయ్యిదగ్గరకేగి 'నీవాగుము. నేనుమంటచేసి వేస్తాను' అనెను.

సలోనీస్నేహముతోడి కటికముతో 'బయటికేల వెళ్ళవు? మగవారికి వంటయింట్లోకి వచ్చుట బాగుండదు. అమరుడు రెండురకముల పిండి చూచునేమో యని ముసలిదాని భయము. తానుకూడగోధుమరొట్టెలే తినుచుందునని వానికి చూపవలెనని దలచియుండ బోలును, అతడీరహస్య మేమి యెఱుగును?

'అయితే సరే! పిండి నిటు తే! నీట తడిపి మర్దించెద' ననెను.

సలోనీ వ్యాకులపడి 'ఏం పిల్లాడవు? బయటికిపోయి కూర్చోవెందుకు?' అనెను.

ఆమెకు తన తన యుడీరీతినే 'అమ్మా! యని సంబోధించుచు ముట్టడించుచుండుట, వానినామె యీాకరణినే యదలించుచుండుటయు జ్ఞాపకము వచ్చెను. పాడువడినట్లున్న యాకుటీరమున నేడొక దీపిక వెలుగుచుండెను. కాని మరునాడిది తిరుగ నంధకారమైపోవును. అదియే సబూత! ఈయువకునిపై తన కేటికింత మమత కలుగుచున్నది? ఎచటి నుండి వచ్చెనో, ఎచటి కేగునో యెవ్వడెఱుగును? అమరుని బాలకుల కుచితమగు సరళ ప్రవర్తన, మాటిమాటికి వంటయిల్లు చొచ్చుట, అన్ని పనులయందు జోక్యము కలుగచేసికొనుటకు దలపడుట, యాది గాగల నామెకు తన తనయుని ప్రతిధ్వని. యెందుండియో, దవ్వులః

నుండి, తన కర్ణకుహరముల జొచ్చుచున్నట్లు తోచి, యామెకు మాత్రు భావన నీవు నరార్ద్రము గావించుచున్నట్లు తోచెను.

ఒకబాలకుడొక లాంతరును చేతగొని, యొక జంబుకాణమును మోచుకొనివచ్చి, వాని సన్నిధి నుంచి కూర్చుండెను.

అమరుడు 'జంబుకానా నెచటినుండి తెచ్చినా' వనిప్రశ్నించెను.

బాలుడు 'పిన్ని మీకోసము పంపింది. ఇప్పుడు వచ్చినదే ఆ పిన్ని' అని చెప్పెను.

అమరుడు నెయ్యముతో వానిశిరముపై చేయి నిడి నిము రించుచు 'సరే! నీవామె అప్పకొడుకువా? మీపిన్ని నిన్నెన్నడైనా కొట్టుతుంటుందా లేదా?' అనిప్రశ్నించెను.

బాలుడు తలయూచుచు 'ఉహుం ఎన్నడూ కొట్టదు. ఆవిడ మమ్మాడిస్తుంది. దుర్జనుణ్ణి ఆడించదు. వాడు చాలచెడ్డవాడు' అనెను

అమరుడు మందస్మితము సేయుచు 'ఎక్కడ చదువుకుంటు న్నావు?' అని యడిగెను.

బాలుడు క్రిందిపెదవి చేతితో లాగుకొనుచు 'ఎక్కడి కెళ్ళను? మా కెవరు చెబుతారు? బడికెవరినీ పంపరు. ఒకనాడు మాతాత మా యిరువురనీ బడికి తీసుకెళ్ళాడు. పంతులు పేరు వేసుకున్నారు, కాని మమ్మల్ని దూరంగా కూచోబెట్టారు, పిల్లలంతా మమ్మలి చూచి 'మాదిగలు మాదిగలని' ఎగతాళి చేశారు. అంత తాత మాపేర్లు తీయించివేశాడు' అని చెప్పెను.

అమరునకు చౌదరీని కలుసుకొనవలెనని కోర్కె పుట్టెను. ఆత డెవ్వడో చాల యభిమానము గలవానివలె నున్నాడు. ఆ బాలుని 'మీ తాత యేమి చేస్తుంటాడ' ని యడిగెను.

బాలకుడు లాంతరుతో నాడుకొనుచు 'సీసా పెట్టుకు కూచు న్నాడు. సాతాళింపు సెనగలు దగ్గర పెట్టుకున్నాడు. సరి. ఇక వాగు

తాడు. కేకలేస్తాడు. ఒకర్ని కొడతాడు. ఒకర్ని తిడతాడు. పగలంతా యేమీ అనడు. సీసా యెత్తితే సరి ప్రేలాపన మొదలెడతాడు' అని చెప్పెను.

అమరు డిట్టి సమయములో వానిని కలసికొనుట యుచితము కాదని గ్రహించెను.

సలోనీనుండి 'రొట్టెలు కాలినాయి. వేడి వేడివి తిందువుగాని లోనికి రా!' యని వినవచ్చెను.

అమరకాంతుడు ముఖము, కాళ్లు, కడుగుకొని లోనికివచ్చెను. ఆమె యిత్తడిపళ్ళెములో రొట్టెలు, రాతిచిప్పలో పెరుగు, ఆకులో నూరుగాయ, గ్లాసుతో మంచితీర్థము పెట్టి యుంచినది. విస్తరిముందు కూర్చుండి యమరుడు 'నీ వెందుకు తిన' వని యడిగెను.

'నువ్వు తిను, నాయనా! తరువాత నేను తింటాను' అనెనుసలోనీ.

'అట్లు కాదు. నే నొప్పుకోను. నాతోకూడా తినాలి.'

'వంట యుచ్ఛిష్టమైపోవదా?'

'పోతే పోనీ! తినేవాణ్ణి నేనుకదా?'

"అన్నము పరబ్రహ్మస్వరూపము" అందులో దేవుడుండును. పదార్థము లుచ్ఛిష్టము చేయరాదు.

"అయితే నేనూ తినక కూర్చుంటాను."

"అబ్బాయీ! నువ్వు చాలా చెడ్డవాడివిలా గున్నావు"

వంటయింట రెండవకంచ మెక్కడున్నది? సలోనీ యడచేత రొట్టెలు పట్టుకొని, వంటింటివెలుపటికి వచ్చెను. అమరుడు జొన్న రొట్టెలు చూచెను. "ఇది తగదుపిన్నీ! ఈ యపక్వపురొట్టెలు నాకు పెట్టి మంచివి నీ వెగురవేస్తున్నావా?" య నెను.

"జొన్నరొట్టెలు నీ వేమితింటావు నాయనా! ఒక్కపూటకు మా యింటికి వచ్చావు. జొన్నరొట్టెలు పెట్టనా?"

"నేను అతిథినికాను. పోయిన నీ పిల్లవాడే వచ్చినాడనుకో!"

"తొలుత వానికికూడా ఆతిధ్యము చేయబడును. నీకు నేనేమి సత్కారము చేయను నాయనా! మాడినరొట్టెలు కూడా సత్కార మేనా? మద్యమూ లేదు, మాంసమూ లేదు" అనెను సలోనీ.

"మద్యమాంసములు నేను ముట్టను పిన్నీ!"

అమరుడు జొన్నరొట్టెలు కొఱకు విశేషము నిర్బంధము చేయ లేదు. ముసలిదానికి కించగలుగును. ఇరువురు తినదొడగిరి. వృద్ధు రాలతని మాట విని "ఈవయసులో మాంసము తినకుండుట మంచిది కాదు. తిని త్రాగవలసినరోజులు. భక్తికియు క్తవయసు వృద్ధాప్యము' అనెను.

'వైరాగ్యము కాదుపిన్నీ! కాని నాకు మాంసము హితవుకాదు'

'తలిదండ్రులు భక్తులే కాబోలు"

"అవును. వారు వైష్ణవులే"

'ఇద్దరూ బాగున్నారా?'

'లేదు. తల్లి మరణించినది. తండ్రి యున్నాడు. వానికీ నాకూ పడదు.'

'అయితే నింట్లో నలిగి వచ్చినావా?'

'ఒకవిషయంలో వారికీ నాకూ మాటామాటావచ్చింది. నేను వచ్చివేశాను,'

'ఇల్లా లున్నదా?'

'ఆవిడా వున్నది'

'పాపము బెంగపెట్టుకొని యేకుస్తున్నది కాబోలు! ఎన్నడైన జాబులు వ్రాస్తూంటావా?'

'ఆవిడకు నా లక్ష్యములేదు పిన్నీ! గొప్పయింటి ఆడబడుచు, తన భోగవిలాసాలలో మునిగి ఉంటుంది. పద! ఏదైనా పల్లెలో

పొలమూ బుట్ట దున్నుకొందమంటూాను. ఆమెకు పట్టణ జీవనమే కాని రుచింపదు.'

అమరుడు భోజనము ముగించి, కంచము బయటికి పట్టుకొని పోయి తోమసాగెను. సలోనీ వాని వెనుకనే వచ్చి, 'ఈకంచము నేను కడిగినంత మాత్రాన్ని తక్కువదాన్నైపోతానా? అనెను'

అమరుడు నవ్వుచు, 'అయితే నాకంచము నేను కడుక్కుంటే తక్కువవాణ్ణైపోతానా?' అనెను.

'ఒక్కనాటికి వచ్చినవారు కంచము కడుక్కోడం బాగుండదు. ఈముష్టిదాని కిల్లెక్కడున్నదనుకుంటున్నావు కాబోలు?'

అమరకాంతుని హృదయమున నిది నాటలేదు. కనుక నతడు నవ్వెను. అమరుడు ముగ్ధుడై "ముష్టిదాని పవిత్ర సరళస్నేహమున లభించినసుఖము తల్లియొడిలో దక్క నెందును లభింపజాలదు పిన్నీ!' యనెను.

అతడు కంచము కడిగి, లోన నిడి, జంబుకానా పఱచుకొని నేలపై పరుండబోవుచుండగా పదిహేను, ఇరువదిమంది బాలురదళము వచ్చి యచ్చట నిలచెను. ఇద్దరు ముగ్గురు పిల్లలకుగాక, తతిమ్మా పిల్లలకొడళ్ళపై చాలినంత వసనమైన లేకుండెను. అమరుడేదో విచిత్ర ప్రదర్శనము చూడబోవుచున్నట్లు లేచి కూర్చుండెను.

జంబుకాణము కొనితెచ్చిన బాలకుడు ముందు కరుదెంచి, 'ఇంతమందిపిల్లలు మావూళ్ళో నున్నారు. ఇంకా ఇద్దరు ముగ్గురు రాలేదు. వాళ్లుమీరు చెవులుకోసివేస్తారని చెప్పకుభయపడుతున్నా' రని చెప్పెను.

అమరుడు లేచినిలిచి, వారినెల్లరనొక వరసలో నిలవబెట్టి యొక్కొక్కని నామధేయమడుగ జొచ్చెను. పిదప

'మీలో నెవరెవరు రోజూ ముఖమూ చేతులూ కడుగుకుంటూరో వారు చేతులెత్తండి' యనెను.

ఒక్కబాలుడైన చేయనెత్తలేదు. ఆప్రశ్న వారికెవ్వరికి నర్థము కాలేదు.

అమరు డాశ్చర్యముతో 'ఏమిటీ? మీలోనెవడూ కాళ్ళూ చేతులూ కడుగుకొనడా?' అని ప్రశ్నించెను.

వారెల్లరు నొకరివంక నొకరు చూచుకొనదొడగిరి. జంబు కాణము తెచ్చిన కుఱ్ఱవాడు తనచేతినెత్తెను? అది చూచుటతోడనే మిగిలినవారును చేతులెత్తిరి.

అమరుడు మరల 'మీలో నెవడు రోజూస్నానము చేస్తాడు? అట్టివారు చేతులెత్తు' డనెను.

మొదటినొక్కడును చేతినెత్తలేదు. పిదప నొకనివెనుక నొక డుగనెల్లరును చేతులెత్తిరి. వారందరు నిత్యముస్నానము సేయుదురని కాదు కాని,

యేయొక్కడును రెండవవానికి తీసిపోవ నిచ్చగింపమిచేత మాత్రమే.

సలోనీ నిలువబడియుండెను. 'నువ్వు నెలలతరబడి ఒళ్లు కడుకొక్కవు జంగిలియా! చేతులెందు కెత్తేవురా?' అని యడిగెను.

జంగలియా అవమానితుడై 'అయితే చినిగినగుడ్డలు రోజూ ఎవరు తడుపుతారు? భులాయా, పున్నా, ఘసీటా, ఎవ్వరూ ప్రతీ రోజూ స్నానము చేయరు' అనెను.

ఒకొక్కొక్కడును రెండవవానిసంగతి బయట పెట్టసాగిరి. అమ రుడు వారిని వారించి, 'చాలు! మీరు తగవులాడుకోవద్దు. నే నొకటి అడుగుతాను చెప్పండి! దినదినము చేతులు, ముఖము, కడుగుకొనుట మంచిదా? కాదా?' అని అనెను.

ఎల్లరు 'మంచిపని' అనిరి.

'మరి స్నానముచేయుట?'

అందరునైక్యకంఠమున 'మంచిదే' యనిరి.

'ఇది మనసులోనుండి చెప్పుతున్నారా లేక నాలుకచివర నుండియా?'

'మనస్సులో'

'సరే పొండి! నేను పది పదిహేనురోజుల్లో తిరిగి వస్తాను. ఎవడు నిజము చెప్పినాడో, ఎవడు అబద్ధము చెప్పినాడో అప్పుడు చూస్తాను.'

ఆ పిల్లలందరు వెళ్ళిపోయిరి. అమరుడు నడుము వాల్చెను' మూడు నెలలనుండి తిరిగి తిరిగి వానిప్రాణములు విసిగిపోయెను.

కొంచెము విశ్రాంతికై మనసు పరితపించు చుండెను. తానీయూర నేటికుండి పోరాదు? ఇచట తన్నెవరెఱుగుదురు? ఇదే వాని కుటీరమైపోయినది. సకీనా యిల్లు చేరెను, గొడ్లు, గోడలు...తుద కాతడు నిద్రావశుడై పోయెను.

---

## 2వ ప్రకరణము

★

అమరకాంతుడు తరువాతనే లేచి ముఖప్రక్షాళన మొనరించుకొని, గంగానదీసలిలముల గ్రుంకులిడి చౌదరీని సందర్శింప బయలు దేరిపోయెను. చౌదరీపేరు గూధడ్. ఈ గ్రామమున జమీందారు లెవ్వరు వసియించుటలేదు. చౌదరీయిల్లే రచ్చచావడి. వేపచెట్టునీడ నొక యాసనము, రెండు మూడు వెదురుకర్రల నులకమంచములు, రెండు మూడు గడ్డితలగడలు నుండుట వానికి గానవచ్చెను. గూధడ్ వయసు డెబ్బదియేండ్లుండును. కాని యింకను దార్ఢ్యముతో నుండెను. వానిసమీపమున నతని జ్యేష్ఠపుత్రుడు పయాగ్ కూర్చుండి చెప్పుల

జతనొకటి కుట్టుచుండెను. మున్నీ గోమయము తీసివేయుచుండెను. తేజా. దుర్జనులు బావినుండి వడివడిగ జలము తెచ్చుచుండిరి. అచ్చటికి కొంచెము తూర్పున నిరువురు యువతులు కుండలు కడుగుచుండిరి. వారు చౌదరీ కోడళ్లు,

అమరుడు చౌదరీ కభివందన మొనర్చి యొక ప్రక్కగద్దె[illegible] కూర్చుండెను. చౌదరీ వానికి పితృభావముతో స్వాగత మిచ్చెను.

"సుఖంగా మంచముమీద కూర్చో తమ్ముడా! మున్నీ రాత్రి చెప్పింది. నీవిప్పుడే పోవుటలేదుగదా? రెండు మూడు రోజులుండు. తరువాత వెళ్ళవచ్చు. నీ కేదేనా పనిదొరికితే ఇచటనే ఉండిపోవచ్చునంటుంది మున్నీ' అని చెప్పెను చౌదరీ.

అమరుడు సంకోచించుచు 'నిజమే! ఆఉద్దేశమూ ఉన్న' దనెను.

గూధడ్ కొబ్బరిబుఱ్ఱలోనుండి పొగపీల్చుచు "పని కేమికొఱత? గడ్డి కోసుకొంటే దినానికి రూపాయి కూలి గిట్టుతుంది. లేకుంటే చెప్పులుకుట్టుఉన్నది. జోళ్ళుకుట్టు, ఏతములకు బుంగకుట్టు, ఏపనిచేసినా కూడు లేకపోలేదు. రోజూ ఎట్లైనా అర్ధరూపాయి కళ్ళబడకమానదు. ఈపనులు రెండు వానికి నచ్చలేదని గ్రహించి. గూధడ్ వానికి మూడవ యుపాయము సూచింపసాగెను. 'వ్యవసాయముచేయ నిష్టముంటే అది చేయవచ్చు' సలోనీవదినెకు పొలముంది. అందాకా అదేనా కవులుకు దున్ను.

పయాగ్ కంఠానీతో కుట్టుసాగించుచునే 'వ్యవసాయపు జంజాటములు పడకు సోదరా! పొలంలో ఏదైనా పండనీ, పండకపోనీ. కష్టముమాత్రము చెల్లదనెను. ఒకప్పుడు ఎండు, ఒకప్పుడు మురుగు, ఒకప్పుడు ముంపు, ఒకమారు తడుపు. ఒక వేళ మంచు. ఏదో ఒకశని తలమీద పడుతూనేఉంటుంది. దానికితోడు యెడ్లు చావడమో, కళ్ళంటు నగ్గి తగులుటో తటస్థిస్తే అంతా స్వాహా! గడ్డిపనే అన్నిటి కంటె మంచిది. ఒకనికి నౌకరీ చాకిరీరాదు. ఒకరివ్వనక్కరా లేదు.

ఒకరినుండి పుచ్చుకోనక్కరా లేదు, ప్రొద్దుటే తపుగోల తీసుకు బైలు దేరితే మధ్యాహ్ననాటికిల్లు చేరుకోవచ్చు' అనెను.

కాశీయనెను. 'కూలిపని కూలినే. వ్యవసాయము వ్యవసాయమే. కూలి లక్షనొరికినా కూలే అందురు. గడ్డిమోపు నెత్తుకుపోతున్నప్పుడు ఒకడు పిలుస్తాడు. 'ఓగడ్డిఅబ్బీ!' అని. ఇంకొక డటునుండి కేక వేస్తాడు. ఎవరిగట్టునేనా గడ్డికోస్తుంటే చూస్తే తిట్లు తప్పవు. వ్యవసాయములో గౌరవమున్నది. పయాగ్ కంతాని నడకయాగిపోయెను. 'మర్యాద చూసుకుబ్రతుకు! ఇక్కడా అక్కడా ఆర్జించి పట్టుకు రా! వ్యవసాయంలో తగలబెట్టు' అనెను.

చౌదరీ తేల్చివైచెను. 'లాభనష్టాలు ప్రతీపనిలోనూ వుంటాయి. తమ్ముడూ! పెద్దపెద్ద సాహుకార్లే దివాళా తీస్తుంటారు. అదృష్టం బాగుంటే వ్యవసాయాన్ని పోలిన వృత్తిలేదు. మీ వేపునకూడ నజరు, నజరానాల స్థితి యిలాగే వుందా?'

అమరుడు 'ఔను తాతా! అన్నితావులా స్థితి యిట్లే ఉన్నది. కాని సుంత హెచ్చు. కొంత లొచ్చు, ఇదే తేడా. ఎచ్చోటా పేదల రక్తము పీల్చుటే జరుగుచున్నది' అని బదులుచెప్పెను.

చౌదరీశంక నూతగొని 'భగవంతుడు చిన్న, పెద్ద తారతమ్యమెందుకు పెట్టెనో, దీనిమర్మ మెవరికీ తెలియదు. ఆయనకంతా బిడ్డలే కదా? ఆయన ఎల్లరను ఒకేదృష్టితో నేందుకు చూడడు?' అనెను.

పయాగ్ సందేహనివృత్తి కావించెను. 'తొల్లిటిపుట్టువున నెవ డెట్టికర్మ చేసినాడో అందుకుతగిన ఫలమే పొందుచున్నాడు.' అనెను.

చౌదరీ దీనిని ఖండించెను. "అవన్నీ మనసును తృప్తిపఱచుకొనుటకు చెప్పే మాటలు. పేదవారికి తమదైవమునుగూర్చి అసంతృప్తి కలుగకుండునట్లు, ధనికులకు తమ రాగభోగములందెట్టి బాధ కలుగకుండునట్లును, ప్రజలు భగవంతుడు మనల నిట్లు పుట్టించినాడు.

దోసము మనదే యనుకొనుచుందురు. 'కాని, మన బాలబాలికలు సైతము పనిచేసినను కడుపునిండ కూడు దొరకకుండుట న్యాయముకాదు. పైగా ఒక్కొక్క అధికారికి పదివేలకుమించి వేతనము లభిస్తుంది. పది సంచుల రూపాయీలైంది. గాడిదకూడ మోయలేదు' అని.

అమరుడు సన్నసన్నగనవ్వుచు 'తాతా! నీవు నాస్తికు'డవనెను.

చౌదరీ దైన్యముతో 'అబ్బాయీ! నాస్తికుడనను. మూర్ఖుడనను కాని హృదయమున గాయముతగిలిన, నోట నిట్టూర్పు వెడలక మానదు. నీవు చదువను. వ్రాయను నేర్చుకొన్నావా?'

'ఆఁ! కొంచెము చదువుకున్నాను'

'ఇంగ్లీషు చదువుకో లేదు కాబోలునే?'

'అదీ కొంచెం చదివినాను'

చౌదరీ ప్రసన్నుడై 'అట్లయితే తమ్ముడూ! మేము నిన్ను పోనివ్వము. భార్యనూ. పిల్లలనూ పిలిపించుకొని ఇక్కడనే ఉండిపో. మాపిల్లలు జల్లలూ కాస్త చదువుకుంటారు. తరువాత పట్నానికిపంపవచ్చు. అచ్చట జాతి పంక్తు లెవ్వరడుగుతారు? వ్రాసిఉన్నది మేము క్షత్రియులమని.'

అమరుడునవ్వుచు 'అటుపిమ్మట రహస్యము బయలుపడితేనో' అనెను

చౌదరీ ప్రత్యుత్తరము సిద్ధముగనుండెను. 'అట్లుజరిగితే మేము చెప్పుతాము. మేమూ క్షత్రియులమే. కాని మేము క్షత్రియ వంశ్యులమని చెప్పుకొనుటకు లజ్జించుచున్నాము, మహమ్మదీయ పాదుషాలకు క్షత్రియకన్నెలనిచ్చి పెళ్ళిచేసిరట యని వినియున్నా'మని. ఇంతవఱకు చల్లి కుడువలేదు కాబోలు తమ్ముడా? తేజా! ఎచటికి వెళ్ళావు?. పోయి కోడలినడిగి ఫలహారము తీసుకురా! అబ్బాయీ! భగవన్నామము పఠిస్తూ ఇందే ఉండిపో. మూడునాల్గు బీగలు సరోనీకున్నాయి. రెండు

బీగలు మావి కవులుకుచేయవచ్చు, ఇవిచాలు. భగవంతుడిస్తే తిండికి లోపము రాదు'

కాని సలోనీని పిలిచి యడుగగా నామె భయపడిపోయెను. కటువుగ 'మీకోరిక నా పొల మీయనపేర వేయించవలెననా? నేను గాలి తినాలనా?' అని యడిగెను.

చౌదరీ నవ్వుచు 'కాదు కాదు. పిచ్చిదానా! భూమి నీపేరే ఉంటుంది. ఇతడూరికే కవులుకు దున్నుతాడు. అంటే వానికి పాలి కిస్తున్నావన్నమాట. తెలిసిందా?' అని యడిగెను.

సలోనీ చేతులతో తనచెవులు మూసికొనుచు 'తమ్ముడూ! నాభూమి ఎవరిపేరా రాయను. ఊరికే మనఅతిథిగా వచ్చాడు. రెండు మూడు దినములుండి పోతాడు. నా చేతనైనంతవరకు సేవ, సత్కార ములు చేస్తాను. నువ్వు కవులుకు తీసుకుంటే తీసుకో. అంతేనేగాని ఎవనిముఖమైనా ఇదివరకు చూచిఉండలేదు, ఎవరి యెఱుక, పరిచ యము లేదు అట్టివానికి నాభూమి కవులుకిస్తానా?' అనియడిగెను.

చౌధరీవంకతిరిగి పయాగ్ తిరస్కారభావముతో చూచుచు 'ఇప్పటికేనా నచ్చిందా, ఇంకా లేదా? ఆడవాళ్లు మూర్ఖు లంటూం టావు. ఈవిడ కావాలంటే నిన్నూ నన్నూకూడా అమ్మేసిరాగలదు. సలోనీపిన్ని మాటలుమాత్రమే తీపి' అనెను.

సలోనీ 'ఔను నాయనా! నీవు చెప్పినంతమాత్రాన్ని మా పూర్వుల పొలం వదిలివేయనా? నాకడుపున పుట్టినవాడు నన్నిల్లా గడ్డితినిపించటానికే పోయాడు' అనెను.

కాశీ మున్నీపక్షమువహించి వాదించెను. 'నిజంచెప్పావమ్మా! కనీ వినీ యెఱుగనివానికి నీభూమి యెల్లా వప్పగించేస్తావు?' అని.

అమరకాంతునకీవాదమునదార్శనికానందము కలుగుచుండెను. ఆతడు నవ్వుచు 'అవును మామ్మా! నువ్వు నిజము చెప్పినావు. పర దేశిని విశ్వసించుట యెట్లు?' అనెను.

మున్నీకూడ ద్వారమునందు నిలచియుండి యీవాదము వినుచుండెను. 'పిచ్చియెత్తిందా యేమిటి పిన్నీ! నీపొల మెవరేనా నెత్తికెట్టుకొని ఎత్తుకుపోతారా? అయినా. మేమున్నాముకదా? నిన్నెవ్వడేనా వంచింప యత్నిస్తే మేముడుగమా?' యనెను.

బెదరియున్న గొడ్డుకు పదిమంది ప్రోగైన నంతకన్న నెక్కుడుగ బెదరిపోవును. వీరందఱు కూడి నన్ను దోపిడీచేయింప యత్నించుచున్నా రనుకొనుచుండెను సలోనీ. ఒకమారు కాదనినపిదప మరల, ససేమి, ఔనని యనలేదు. ఆమె వేగమే యచటినుండి వెడలిపోయెను.

పయాగ్ 'పిశాచి పిశాచి' యనెను.

అమరుడు లజ్జించుచు 'నీ వనవసరముగ ఆమెతో చెప్పినావు తాతా! నాకేమిటి? ఈయూరుకాకున్న మరొకటి' అనెను.

మున్నీ ముఖము వెలవెలబోయెను.

చౌధరీ 'కాదుతమ్ముడూ! ఏమిమాటలాడుతున్నావు. నాసహాయముగ నుండు. మహాంతులవారితో చెప్పి మరియొక మూడునాలుగు బీగముల భూమి కేర్పాటుచేస్తాను. నీ గుడిసె వేరే వేతాము. తినుట, త్రాగుట ఏమంత విషయము కాదు. అట్లుచేస్తే ఒకపెద్దమనిషి గ్రామములో నుండుట యగును. లేకుంటే ఏ బిళ్ళబంట్రోతు వచ్చినా ఊరివారి ప్రాణాలన్నీ యెగిరిపోతూంటాయి' అనెను.

అరగంటకు పిదప సలోనీ తిరిగివచ్చి చౌదరీతో 'నువ్వే నా భూమి నెందుకు కౌలుకుతీసుకోవు?' అనియడిగెను.

చౌదరీ కసరికొనుచు 'నాకక్కర్లేదు. నీభూమి నువ్వేఉంచుకో' అనెను.

అమరునితో సలోనీ విన్నపము గావించుకొనెను. 'నువ్వే ఆలోచింపుమబ్బాయీ! నేనేమేనా తప్పుమాటలాడేనా? కసివిసీయెఱుగనివాని కెవరేనా వస్తువిచ్చివేస్తారా?' అని.

అమరు డామె నూరడించెను. 'కాదు సిస్నీ! మంచిపనిచేశావు. ఇట్లు నమ్మటవల్లనే మోసము జరుగుచుండును' అని.

సలోనీకి కొంచెము ధైర్యముకలిగినది. 'నీ పరిచయము నాకు రాత్రినుంచేకదా! ఎవడిదగ్గర నాభూమి కలదో వాడు నాచుట్టము. వీనిదగ్గరనుండి లాక్కొని నీకిచ్చితినంటే వాడేమనుకొంటాడో చూడు. నేను తప్పుడుమాట లాడియుంటే లెంపలువాయించు. వాడు నన్ను వంచిస్తున్నాడని యెఱుగుదును. కాని శాంధవ్యవిషయ మాయెను. వాని నోటిదగ్గర కూడు పడగొట్టి భూమి నీకిచ్చితినంటే నీవుమాత్రము మంచిపని చేసినానందువా? చెప్పు?' అనెను

ఈ యుక్తి సలోనీకి స్వయముగ తోచినదో, లేక యెవరైన బోధించినదో కాని చౌదరీనోరుమాత్రము పూర్తిగ కట్టువడిపోయెను.

---

## 3వ ప్రకరణము

★

రెండుమాసములు గడచిపోయెను. పౌష్యమందలి శిశిరరాత్రి నీవి మేల్ముసుగుదాల్చెను. ఉన్నతమహీంధరము విశాల మహాత్మా కాంక్షసదృశమున తారకామకుటధారిణియైనిలిచియుండెను. తత్పర్వత ప్రాంతమందలి కుటీరములది తన్ని వైచిన చిన్నిచిన్నికోర్కెలట్లుండెను.

అమరకాంతుని కుటీరమున నొక దివ్వె వెలుగుచుండెను. పాఠశాల తెఱచియుండెను. దాదా పిఱువదిమంది బాలురు నిలచి యభిమన్యుల కథ నాలకించుచుండిరి. బాలురెల్లరు కడు ప్రసన్నులై యుండిరి. వారి వదనములు ప్రకాశించుచుండెను. కన్ను లుజ్వలములై యుండెను. వారు నభిమన్యునిచాదమున వీరులు, కర్తవ్యపరాయణులు నగునట్లు స్వప్నములు గాంచుచుండబోలును. ఒకానొకదినమున దుర్యో

ధన జరాసంధుల యెదుట మోకరిల్లవలసివచ్చునో, వినయపూర్వక ముగ ప్రతిమూలలవలసి వచ్చునో, ఎన్ని పర్యాయములు చక్రవ్యూహ ములనుండి పలాయన ముద్యమింపవలసివచ్చునో, యట్లొనర్చియు సఫ లులు కాజాలకుండ వలసివచ్చునో వారికేమి తెలియును?

చౌదరీ సీసామందిడుకొని యొకింతకాలము చింతానిమగ్నుడై యుండెను. పిదప చేతనున్న ముంత విసరివైచెను. సీసానెత్తి గూటి యందిడి, మున్నీని పిలచి, "అమరునితో చెప్పి భోజనమునకు తీసికొని రమ్ము. ఈమహానుభావున కెన్నటికి నాకలి వేయదేమో? రాత్రి ఝాము గడిచింది. ఇప్పటికీ భోజనము చింతేలేదు" అనెను.

'నీవెంతవరకూ త్రాగుతూంటావు? అందుకే నేను వానిని పిలు వలేదు' అనెను మున్నీ.

చౌదరీ అనిష్టముతో "నేడు నాకు త్రాగుటకు మనస్కరించుట లేదమ్మా! ఏమంత మహాపద్దపస్తువు" అనెను.

మున్నీ ఆశ్చర్యముతో చౌదరీవంక నిదేకదృష్టితో చూడజొ చ్చెను. ఆమెవచ్చి మూడేండ్లయినది. ఎన్నడూ చౌదరీ త్రాగకుండు టగాని, విరక్తిమాటలు పలుకుటగాని. కని, విని, యుండలేదు. సందే హించుచు "నీకీవేళ ఒంట్లో బాగుండలేదా ఏంతాతా?" అని యడి గెను. చౌదరీ నవ్వి 'బాగుండకేమమ్మా? త్రాగుదామనే తెప్పించాను కాని యిపుడు త్రాగాలని బుద్ధిపుట్టడంలేదు. అమరుని మాటలు మన సుకు పట్టాయి. 'ఎక్కడ కూటికిలేక నూటికెనభై మంది చస్తున్నారో అక్కడ సారాత్రాగడం రక్తము త్రాగినట్లే' అన్నాడు. ఇతరులెవ రేనా చెప్పియుంటే వినకపోయేవాణ్ణే కాని అతనుచెప్పినందున నామ స్సుకు అది గట్టిగా నాటింది. అనెను.

మున్నీ చింతాకులిత యయ్యెను. 'నీ వతనిమాటల్లో పడిపోకు తాతా! ఈవయసులో విడిచిపెట్టితే నీ ఆరోగ్యం చెడిపోవచ్చు. ఒంట్లో ఏమీ బాధ కలుగుటలేదుకదా?' అని యడిగెను.

చౌదరీ యీ యల్పచింతలను తుచ్ఛములుగ గణించి, 'బాధ కలుగనీ, అజీర్ణము చెయ్యనీ, నేనిక త్రాగను. ఈ జీవితములో వేల కొలది రూపాయల సారా త్రాగినాను ఆర్జనంతా మైకంలో నెగుర గొట్టివేశాను. అట్లు పాడుచేసిన ద్రవ్యంతో నేదేనా మంచిపని చేసి యుంటే గ్రామమంతా సుఖపడేది. పేరూ వచ్చేది. మార్గాలకింత కంటె చెడుగెక్కడుంది? గొప్పగొప్ప వారూ త్రాగుతుంటారనివిన్నాను కాని వారిసంగతి వేరు. ఇచ్చట వారిదిరాజ్యము. వారికి దోపిడిచేసిన ధనముంటుంది. వారుకాకుంటే ఇంకెవరు త్రాగుతారు? చూచావు కదా? నేడు కాశీ పయాగ్‌లకు కూడా చదువునందు రుచి కలుగ జొచ్చింది.'

పాఠశాల ముగిసెను. అమరుడు తేజా దుర్జనుల చేతిగ్రేళ్ళను పట్టుకొని నడచివచ్చి, చౌదరీతో, ఈ వేళ చాలా ఆలశ్యమైనది. నీవు భోజనము చేసివేయలేకపోతివా తాతా? అనెను.'

చౌదరీస్నేహములో మునిగిపోయెను.

'ఔను! కాదా మరి? నేనేర్ఘాముదాత్రినుండి పొలం దున్నుతున్నాను. నేనే చెప్పులజోళ్లు పట్టుకొని ఋషీకేశము వెళ్ళాను. ఇల్లా ప్రాణాలర్పిస్తున్నావంటే పాఠశాల మూసి వేయవలసివస్తుంది' అనెను.

అమరుని పాఠశాలయందిపుడు బాలికలును చేరిరి. వాని యానందమునకు మేరలేకుండెను.

భోజనముచేసి చౌదరీ నిద్రించెను. అమరుడు వెడలిపోబోవుచుండగా 'బాలా! నేడు నీవు చాలా పెద్దపందెము నెగ్గినావు. తాత నేడొక్క చుక్కైనా ముట్టుకోలేదు,' అని మున్నీ చెప్పెను.

అమరు దులికిపడి 'ఏమేనా అన్నాడా?' అని ప్రశ్నించెను.

నీయుద్యోగాన మొనర్చినాడు. అంతకన్న నేమంటాడు? మరణముతో నే కాని మానడనుకున్నాను. కాని ఉపదేశము తలకెక్కింది' అనెను మున్నీ,

అమరుని హృదయమున చాలదినములనుండి మున్నీ వృత్తాంత మడుగ కోర్కియుండెను. కాని నావకాశము కలుగలేదు. నేడు వీలు చిక్కుటచే 'నీవు నన్ను గుర్తించియుండవు. కాని నిన్న నేను గుర్తించితిని సుమా!' అనెను.

మున్నీ ముఖమునందలి కళ యెగిరిపోయెను. ఆమె బాధితములగు కన్నులతో వానిని జూచుచు, 'నీవు చెప్పుటచే నాకును స్మరణకు వచ్చుచున్నది నేను నెచటనో చూచియుంటి' నని అనెను.

కాశిలో కేసు జ్ఞాపకమునకు తెచ్చుకొనుము.

'సరే. ఔను! జ్ఞాపకంవచ్చినది. నీవే డాక్టరుగారి వెంట రూపాయలు పోగుచేస్తూ తిరుగుతుండేవాడవు. కాని నీవిచటికెట్లువచ్చితివి?'

నాన్నగారితో తగవు వచ్చినది. నీ వెట్లిచ్చటికి వచ్చితివి? వీరిలో నెట్లువచ్చి పడితివి?'

మున్నీ యింటిలోనికి వెడలిపోవుచు, 'ఇంకొకసారి చెప్పెదను. కాని నీకు దణ్ణముపెట్టెదను. వీరికిమాత్రం తెలియనివ్వకు' అనెను.

అమరుడింటికి వచ్చి తనమూటనుండి యొకధోవతులజత తీసికొని సలోనీయింటికి పోయెను. సలోనీ గృహాంతర్భాగమున పండుకొని నిద్రవచ్చుటకు పాడుకొనుచుండెను. అమరునిసవ్వడి నాలకించి, ద్వారం తెఱచి, ఏం నాయనా! ఈవేళ చాలా చీకటిగా ఉన్నది. భోజనమైనదా? ఇప్పటిదాకా రాట్నం త్రిప్పుతున్నాను. నడుమునొచ్చి, కాస్త ఒరిగేను' అనెను.

అమరుడు ధోవతులజత వెలికిదీసి 'నేనీ జోడా తెచ్చాను. నీవు వడుకుట పూర్తి అయితే తీసుకుంటాను. అంతవఱకు వీటిని తీసుకో' అనెను

సలోనీ నా డమరునిపైన విశ్వాసము చూపుటచే సంశయించుచుండెను. ఇట్టి పెద్దమనిషిపై తా నపనమ్మకమేల ప్రకటించినది!

లజ్జించుచు 'ఇప్పుడే యెందుకు తెచ్చావుబాబూ? నాలు వదుకుట అయిపోతే తెస్తానులే! అగు నా రెండెందుకు?' అనెను.

అమరకాంతుడు 'నీవి రెండును నుంచుకోపిన్నీ! ఒక్కదానితో ఎట్లు పని జరుగుతుంది?' అనెను.

సలోనీకి తన సుదినములయందుకూడ రెండు ధోవతులు లేవు. తనభర్త, పుత్రిల రాజ్యములోకూడ యొకటికన్న నెక్కుడు లభించియుండలేదు. ఇప్పుడు చక్కని ధోవతులు రెండు మృదులాలనతో నొసగబడుచున్నవి. ఆమెయంతఃకరణమున మాతృస్నేహామయదుగ్ధ ధారలు ప్రవహించుచున్నట్లున్నది. ఆమెవైధవ్యము, మాతృత్వములెల్ల నాశీర్వాదమయములై యామెమృదుత్వమును స్పందింపజేయసాగెను.

అమరుడు గుడిసెవీడి వచ్చెను. సలోనీ లోన నేడ్చుచుండెను. తనకుటీరమున బ్రవేశించి యమరకాంతు డొకింతకాల మనిశ్చయాత్మకదశలో నిలచియుండెను. పిదప తన దినచర్య పుస్తకమును దీసి వ్రాయ నారంభించెను. ఆ సమయమున తలుపులు తెఱచుకొని కలశలు చేబూని మున్నీ చౌదరిగృహామునుండి జలకములు తెచ్చుటకు బయలుదేరెను. ఇంట దీపికవెల్గుచూచి, వచ్చి, ద్వారమున నిలచి, 'ఇంకను పరుండలేదా? చాలరాత్రి అయినది' అని అనెను.

అమరుడు వెలుపలికి వచ్చి, 'లేదు. నిద్రరాలేదు. మంచినీళ్లు లేకపోయినవా?' అని ప్రశ్నించెను.

'ఇటు తే! నేను చేదుకొస్తాను. ఈ కటికచీకటిలో నీ వేమి వెళ్ళుదువు?'

'చీకటిరాత్రిలంటే నగరవాసులకు భయము. మేము పల్లెటూరివారముకదా?'

'వద్దు మున్నీ! నిన్ను పోనివ్వను.'

'అయితే నాప్రాణములు మీ వాటికన్న ఎక్కువవా?'

మున్నీ యాతని యనురాగమయదృష్టులతో చూచి, 'నిన్ను భగవంతుడు స్త్రీని చేయలేదేటికి బాబా? ఇట్టి కోమలహృదయ మేపురుషునియందును చూడలేదు. అప్పుడప్పుడు నీ విచటికి రాకయుండినచో బాగుండెడి దనుకొనుచుందును.' అనెను.

అమరుడు మృదుమందహాసమొనర్చుచు 'నేను నీయెడ నేమి తప్పు గావించితిని మున్నీ?' యని పృచ్ఛించెను.

మున్నీ గద్గదస్వరముతో 'అపకారము చేయలేదా? బాలున కుత్సాంగము, తినుబండములు, ఆటవస్తువుల వ్యసనముకల్పించుట తప్పు కాదా? అట్టి సుఖములు పడసినవాడు ప్రేమాదరములులేక నిలువ నేర్చునా?' అని ప్రశ్నవైచెను.

అమరుడు కరుణాభరితస్వరమున 'నేననాథుడను మున్నీ! నీవే నా కుత్సంగము, ప్రేమలయొక్క చవి చూపించితివి. నేనేడ్చి యేడ్చి నిన్ను పరిహాసపెట్టితివి' అనెను.

మున్నీ తనచేతనున్న బిందెను నేలమీద పెట్టి, 'నిన్ను నేను మాటలలో జయింపనేరను బాబా! కాని, నీవు రాకముందు నేను చాలా సంతోషముతో నుంటిని ఇంటిపనులు చేసి, కలియో, గంజియో త్రాగి సుఖముగ నిద్రించుచుంటిని. ఆ నాసుఖమును నీ వపహరించితివి. నీమనసులో నీమె బహు చంచలస్వభావయని తలంచుచుంటివి కాబోలు! అనుకొనుము. పురుషులు స్త్రీలైనప్పుడు స్త్రీలును పురుషులు కావలసివచ్చును. నీవు నాకు దూరదూరముగ నుండు చున్నావని నే నెరుగుదును. నన్ను తప్పించుకొని తిరుగుచుంటివనియు తెలియును. నిన్ను నేను పడయజాలననియు నాకు తెలియును. నాకట్టి యదృష్టము లేదు. కాని విడువను. నేను నీకడనుండి మరేదియు నర్థింపను. నేను నీదానినేయని మాత్రమెరుంగుదును. అదియేచాలు. నేనును

స్త్రీననియు, నాకొకరున్నారనియు, నాజీవితముకూడ ఒకరికి పనికివచ్చు ననియు నాకు గ్రాహ్యామగుగాక!' అని పలికెను.

అమరుడు మున్నీ నింతవఱకు ప్రేమచేతగాక, రసికభావంతో నొకానొక యువకుడొక సుందరియగు యువతిని జూచునట్టిభావముతో మాత్రమే చూచుచుండెను. కాని, ఈ యాత్మసమర్పణ మాతనిని చలింపజేసివైచెను. పాడియావు స్తనములను గాంచి మనము ప్రసన్నుల మగుదుము, వీనియందెన్ని క్షీరము లుండునోయని, కేవల మంత మాత్రపు భావమే మన మనసునందుండును. మనమాగోవును పట్టుకొని పాలను పితుకుట కుద్యుక్తులము కాము. కాని యెదుటి గిండియలోనికి క్షీరములు వచ్చుట వేరుసంగతి. అమరుడు దుగ్ధపాత్రము వంకకు చేయి చాచెను, 'రమ్ము మున్నీ! మనమిరువురము నెచ్చటికైన వెడలి పోవుదము. అచట నేను చెప్పెదను, ఈమె నా...'

మున్నీ తనచేత వానినోరు మూయుచు, 'చాలు! ఇంకేమీ చెప్పవద్దు. పురుషులెల్ల రొక్కరీతిగనే యుందురు. నే నేమి చెప్పితిని? నీ వేమి యనుకొనుచుంటివి? నిన్ను నేను పెండ్లియాడను. నీ సంరక్షణలో నుండదలచను. నన్ను నీదాసినిగా భావింపుము. అదియే నాకు చాలు!' అనెను.

మున్నీ కలశమును గ్రహించి కూపమువంక కేగెను. అమరుడీరమణీహృదయాద్భుతరహస్యము నవలోకించి స్తంభించిపోయెను.

ఇంతలో మున్నీ తిరుగ బిందె నింపుకొని వచ్చి, 'క్రొత్తనీరు తెచ్చినాను బాబా! కొంచెము నీకీయనా?' అని ప్రశ్నించెను.

నీటికొఱకు వానికి కోరిక పుట్టెను 'ఇప్పుడు దాహమగుట లేదు మున్నీ' యని యమరుడు ప్రత్యుత్తరమొసగెను.

---

# 4వ ప్రకరణము

★

మూడు నెలలవఱకు నేరికిని. అమరకాంతుడు జాబులు వ్రాయ లేదు. ఎందును స్థిమితముగ కూర్చుండుటకు సావకాశము చిక్కలేదు. సకీనాస్థితిగతుల నెరుగుట కతనిహృదయము సందడించు చుండెను. నైనాస్మృతికూడ తఱచు కలుగుచుండెను. పాపమామె యేడ్చియేడ్చి మరణించుచుండ బోలును. తనయుని కుసుమకోమల దరహాసితవదన బింబము మాటిమాటికి స్మరణకు వచ్చుచుండెను. కాని తనకాశ్రయము, స్థావరము లభించినకదా? లేఖ వ్రాయుటకు ఒక్కచోటనూ నిలచి యుండుట సంభవింపలేదు. ఇచటికి వచ్చి చేరినవెనుక నతడు మూడు కమ్మలు వ్రాసెను. సకీనా, సలీము, నైనాలు పేరున. సకీనాకు వ్రాసిన జాబు సలీము దానిలోని జతపఱచి పంపెను. ఈదినమున జవాబులు వచ్చియుండెను. అమరుడు గంగాతటమున నొక వివిక్తస్థలమున కేగి, యాజాబులు చదువుచుండెను. చదువుచుండగా, పిల్లలెవరును రాకుండ వలెననియు, మధ్య నేయాటంకము కలుగకుండవలెననియు నతనికోరిక.

నైనా వ్రాసియుండెను. 'ఈనాటికి నీకు నా స్మరణ కలిగినది. సరి! నీవింత కఠినాత్ముడవని నేను తలచలేదు. నే నీయింట, నీవులేనిదే యెట్లుండగలనో వూహింపలేవు. ఏలనన, నీవు నీవు, నేను నేనునూ గనుక. నాలుగున్నర నెలలు! నీకడనుండి వార్త లేదు. నీసమాచారము మాకు తెలియదు. కనుల నెంత నీరోడ్చితినో చెప్పలేను. ఏడ్చుగాక మాకు వేరేమి పని నీవు మిగిల్చిపోతివి? నీవు లేనిచో నా బ్రతుకింత శూన్యమైపోవునని నే నూహింపనైతిని.

ఇంతకాలము నీ వేటికి మిన్నకుంటివో తెలియును. కాని, అన్నా! అది నీరిక్తభ్రమ. నీవు నాయగ్రజుడవు రాజువు కానీ, దరిద్రుడవే కానీ, నా సోదరుడవు! ప్రపంచము నిన్నుపహసించిన నన్నుపహసించు

గాక, నిందించిన నిందించుగాక! నీవు నా సహోదరుడవే! నీవు నేను మహమ్మదీయుడనైనను, క్రైస్తవుడనైనను, అన్నవు కావా? భగవంతుడే సంబంధము కల్పించినాడో దానిని నీవు తెంచి వేయజాలుదువా యేమి? ఇ తటిబలాఢ్యుడవని నే ననుకొనలేదు. ఇంతకుమించి ప్రపంచమున వేరొండు ప్రియమగు బంధముకలదేమో నే నెరుగను. తల్లికి కేవలము వాత్సల్యముండును. సోదరికేమియుండునో చెప్పలేను. కాని, యది వాత్సల్యముకన్నను కోమలతరము. సుతుని యపరాధములకు తల్లి దండన యొసగును. సోదరి క్షమామూర్తి! సోదరుడు ధర్మమొనర్చిన, నధర్మము నొనర్చినను, బెదిరించినను, ప్రేమించినను, గౌరవించినను గౌరవమొనర్చినను, సోదరిహృదయమున క్షమగాక ఇతరములుండదు. ఆమెసోదరునిస్నేహమే వాంఛించును.

నీవు వెడలినప్పటినుండియు, పుస్తకములదెస చూచుటకైన నిచ్చగింపను. విషాదముకయించుచుండును. ఏపనికి మనసు గరింపదు. రాట్నమొక మూల పడియుండి నాకొఱ కేడ్చుచున్నది. సరియే కాని, ఏదేని సంతోసమొదవజాలిన వస్తువు మిగిలియున్నచో నది మనమున్నా! వాడు నాకంరమున హారమైపోయినాడు. క్షణికకాలమైన విడచిపెట్టడు. ఇప్పుడు స్తధింమ మన్నాడు కావున నీ లేఖ వ్రాయగల్గుచుంటిని. లేదేని వాడు మహావిద్వాంసులుకూడ పఠింప నేర్వని చిత్రలిపితో నీ లేఖను రచియించి యుండెడువాడే. వదినెకిప్పుడు వానిపై మునుపటి స్నేహము లేదు. నీవప్రస్తాపన ప్రమాదవశమునకైన నామె చేయదు. ధర్మచర్చ, భక్తి, వీనియెడ నామెకు విశేషప్రేమ యుదయించినది. నాతోకూడ బహుమితముగ భాషించుచుండును. రేణుకాదేవి యామెను తీసికొని లక్నో వెళ్ళనెంచినది కాని వదినె పోలేదు. ఒక్కదినమున నామె గోవున కుద్వాహమొనర్చినది. పురమందలి వేలకొలది ప్రజకు విందు జరిగెను. మేమును వెళ్ళియుంటిమి. ఇచటి గోశాలకు రేణుక పదివేలరూప్యముల దానమిచ్చెను.

ఇక నాన్నగారిసంగతి. వారొక దేవాలయము నిర్మించుచున్నారు. స్థలము నుండే సంపాదించియుండిరి. శిలలు సమకూర్చుచున్నారు. దేవాలయశంకుస్థాపన మహోత్సవమునకు రాజాసాహేబు నామంత్రించుతురట. ఈదినములలో వారేలనో తెలియదు కాని ఎవరిమీద నుగ్రుద్ధులగుట లేదు తుదకు తీక్షణముగ పలుకుటైన లేదు. పూర్వ మూవంత లవణమధికమైన భోజనపాత్రను విసరికొట్టువాడు. నేడు ప్పెంత యెక్కువైనను మాటలాడడు. ఆనామీలమీదకూడ మునుపటంతటి కాఠిన్యము చూపుట లేదని వినుదును. ఆలయప్రారంభోత్సవసమయమున ఋణగ్రస్థుల బకాయిలన్నింటిని విడచివేతురట. పఠానీనికిపుడు ఐదుకు బదులిరువది రూప్యము లొసంగబడుచున్నవి వ్రాయుటకు చాల విషయములున్నవి. కాని వ్రాయను. నీవిచటికి వత్తువేని ప్రత్యక్షముగ రమ్ము. ఏలయన ప్రజలాగ్రహముతో నున్నారు. మనయింటికి పరులెవరును రాకపోకలు సలుపుట లేదు.

రెండవలేఖ సలీము రచించినది.

నీవు గంగలో మునిగి దేశాంతరము గావించుకొంటివని యెంచి, యుల్లిపాయసాయముచే నొకటిరెండు కన్నీటిబిందువులు రాల్చితిని. మరియు నీయాత్మశాంతికై విప్రునకొకనికొక గ్రుడ్డిగవ్వ దానమొసగితిని. కాని, నీవు బ్రతికియేయుంటివని విని నావిచారమెల్ల వృధయయ్యెనని తెలియుటకు, చాలా చింతగలిగినది. అశ్రువులకంత విచారము లేదు కాని, యాగవ్వనుగూర్చి విషాదముతప్పదు. పెద్దమనిషీ! ఎవడైన నైదుమాసములవరకు వ్యర్థ మానవధారణకొడిగట్టునా? ఇచట నీవు ప్రత్యక్షముగా నుండకుండుటయు శ్రేయస్కరమే. నీవు గొప్ప గృహస్థుల సేవకుని శోకవైతివి. ఏవ్యక్తి తనమిత్రుల పక్షమున విశ్వాసఘాత మొనర్చునో వాడు సాంఘిక సేవ యేమిసేయును? బూడిద.

వైవముగోడు! నీ జ్ఞాపకమే నాకు నిత్యము వచ్చుచుండును. కళాశాలకేగుదును. మనస్కరింపదు. నీతో కళాశాల యందమాను

పోయినది. ఇచ్చట మాత్రం డి 'సివిలు సర్వీసు' సంగతి మెడకుచుట్టి ప్రాణములు తీసివేయుచున్నారు. తుదకెన్నటికైన మరణివత్తువా లేక ప్రవాసశిక్ష భోగించుచునే గడపెదవా?

కళాశాలస్థితి యథారీతిగనే యున్నది. అవే చతుర్ముఖ పురాణములు. అవే తరగతినుండి యుపాయింపులు, అవియే ఆటపాటలును, షౌను. పట్టప్రధానోత్సవ సందర్భమున నుపన్యాసము బాగుగనుండెను. విశ్వవిద్యాలయోపాధ్యక్షుడు 'సామాన్య జీవనము' పై తీవ్రముగ చర్చించెను. నీవైన నాయుపన్యాసము విశేషము ప్రజ్ఞలించియుందువు నాకది చవ్వగా కనిపించినది. కాని యాచరణరూపకముగ చూపెడు వాడెవ్వడును లేడు. ఇచట నెందరుపన్యాసకులు, గురువులు గలరో వారెల్లరు నిరాడంబరజీవితమున కుదాహరణలా? వారే జీవితప్రమాణము నతిశయమొనరించుచున్నతరుణమున బాతురిలుమాత్రి మేల చేయరు! గంగలో చేతులేల కడుగుకొనరాదు? ఉపాధ్యక్షుడేటికి తన యుపాధ్యాయులకు సాధారణజీవితము నేర్పరో తెలియదు. ప్రొఫెసర్ భాటియాకు రెండుజతల జోళ్లున్నవి. ఒక్కొక్కజత యేబది రూపాయలు. ప్రొఫెసర్ చక్రవర్తి మితవ్యయ వాదనాకౌశల్యముగల సుప్రసిద్ధవక్త, 'సంసారము నొల్లడు, సానులతో సంగాతము' వారియింట సేవకులెందరో తెలియునా? మొత్తము పండ్రెండుగురు. మనము నవయువకులము. మనయువక హృదయములలో నవనవోల్లాసమున్నది. నూతనాభిలాషలు కలవు. ఇంటిలోనివారి నర్థింతుము. ఈయకున్న శపింతుము. మితులియొద్ద ఋణములు తెత్తుము. వర్తకుల నలరింతుము. కాని ప్రతిష్ఠ, హోదాలతో బ్రతుకుదుము వారెల్లరునరకమునకే పోయినచో మనమునుపోవుదుము కాని వారివెనుకనే.

ఇక నరే నా స్థితి యించుక వినదలతువా?

మామచేత నిరువదిసార్లు కబురంపితిని; వస్త్రములంపితిని; రూకలంపితిని; కాని యొక్కటియు పరిగ్రహించలేదు. తినినచో రొట్టెలో

నొకముక్కమాత్రము తినుననియు. లేకున్న నిరాహారియై పడియుండు ననియు చెప్పినాడు మామ, అవ్వతో మాటలాడుటకూడ మానివైచిన దట. నిన్న నీజాబు చేరినవెంటనే యామెకంపించితిని. అందు కామె నుండి వచ్చిన ప్రత్యుత్తరమున కిది నకలు. అసలు రేక నీ విచ్చటికి వచ్చినపుడు చూడనచ్చును.

'బాబూజీ! తమకీయభాగ్యురాలిమూలమున గలిగిన యాశిక్ష కెంతయు విచారముగనున్నది. విశేషించి యేమి చెప్పగలను? జీవించు యున్నాను. మిమ్ము నిరతము స్మరించుచున్నాను. మరణించుటకు పూర్వ మొక్కసారి మిమ్ము చూడవలెనని యుత్కంఠగలదు. కాని యిందును మీ కపయశమె యొదవును. నా కప్రతిష్ఠ రానేవచ్చినది. నిన్న తమలేఖ చేరినది. పలుతడవలు మీయొద్దకు వచ్చివేయ సంకల్పించి వస్తువుల గైకొంటిని. తాము క్రుద్ధులగుదురా? నాకా భీతిలేదు. కాని మనసును కుదుఱుపఱచుకొందును. బహుశః అప్పుడే చావను. ఒకింతసేపు కోపముచేత మీజాబు తెఱవలేదు. కాని ఎంతవఱకు? కమ్మను విప్పితిని. చదివితిని. ఏడ్చితిని. తిరుగ చదివితిని మరల నేడ్చితిని. దుఃఖమునందపరిమితానందమున్నది. హృదయము తనియదు. ఇక నిరీక్షణశక్తియు దుస్సహమగుచున్నది. దైవము మిమ్మురక్షించుగాక!

చూచితివా అమర్? ఈలేఖ యెంత వేదనాపూరితమో! నా కనులవెంట చాలతక్కువ జలమే వెడలెను. కాని, యీ రేక గాంచి. యశ్రువుల నిరోధింప నశక్తుడనైతిని. నీవెంత యదృష్టశాలివి?

అమరుడు వంచినతల నెత్తెను. వానికనులయందొక మత్తు. అలసతకాని మదము స్ఫూర్తి వంతిమగు మైకము, రక్తచ్ఛవికాని యొకదీప్తి, యున్మాదముకాని, విస్మృతిలేని యొకజాగృతి గోచరించు చుండెను. ఆతని మనఃప్రపంచమున నింతటి భూకంపమెన్నడు వచ్చి యుండలేదు. వానియాత్మ మున్నెన్నడు నింత యుదారము, విశాలము, ప్రఫుల్లమునై యుండలేదు. ఆతని కనులయెదుట రెండు మూర్తులు

నిలచెను. ఒకటి విలాసమగ్నమై, గర్వోన్మత్తమై, రత్నాలంకృతమై యున్నది. రెండవది సరళమాధుర్యభూషాలంకృతము. లజ్జావినయ సౌశీల్యాదిగుణములచే వినతమైయున్నది. వాని తృషితహృదయమా సుగంధితమధుసేవనము నొల్లక, యీశీతలజలమువంక కాకర్షితము కాజొచ్చినది. ఆతడు పదేపదే లేఖయందలి విషయములను చదువు కొనుచు, నుద్విగ్నహృదయుడై గంగాతటమున నడయాడుచుండెను. సకీనాను కలసికొనుటెట్లు? జానపదజీవనమామెకు హితమగునా? ఎంత సుకుమారము? ఎంత కోమలము? ఆమెవంటి దానికీమాడ్కి జీవనమా? వెడలి యామెహృదయమును ప్రఫుల్లముగావించుటెట్లు? అతనికామె 'బాబూజీ! నేనును నీవెంట వత్తు' నను వాక్యము పలికినప్పటి మోహనాకృతి స్ఫురణకు వచ్చెను. ఓహో! ఎంత యనురాగపూరి తము! ఏకూలివానికైన నగ ద్త్రవ్వుచుండ నిట్టియనర్ఘమణి లభ్యము కాగలదా? తనయజ్ఞానకారణమున నది గాజుముక్కయని భ్రమయు చుండెనే!

'మరణించుటకు ముందు మీదర్శనభాగ్య మొదవుగాకయని మాత్రమొక్క యభిలాష కలద' ను వాక్యమాతని హృదయమున నెంత నాటుకొన్నది! ఆతనిమనసు గంగాతరంగిణీలహరులపైనీదులాడుచు సకీనా నన్వేషించుచున్నట్లున్నది. తరంగములవంక తదేకదృష్టితో చూచుచున్న యతనికి తాను కొట్టుకొని పోవుచున్నట్లు తోచెను. చకితుడై యతడింటికి వెడలెను. కంటతడి, నాసికమరక్తిమ, గండ స్థలమున నార్ద్రిత!

---

## 5వ ప్రకరణము

★

గ్రామమందొక యువకుని పరిధానోత్సవము జరుగుచుండెను. ఆ యుత్సవమున నాటలు, పాటలు, విందులు జరుగుచున్నవి. వారి

యింటిముందు నగారా మ్రోయుచుండెను. పల్లెయందా బాలవృద్ధము సమావేశమై యుండెను. నృత్యమారంభమాయెను. అమరుని విద్యాశాల నేడు మూయబడెను. పల్లెజనులాతని నాయుత్సవమునకు లాగుకొని వచ్చిరి.

పయాగ్ 'నడువుము సోదరా! నీవును కొంచెము చమత్కారము చూపుము. మీదేశపుజనులు చక్కగ నాట్యము సేతురని వినికిడి' అనెను.

'నాకు నృత్యము చేతగాదు. క్షమింపుము.'

తనకు నృత్యమలవడియుండిన వీరినెల్లరిని తననైపుణ్యముజూపి ముగ్ధులను గావించియుందునుగదా యని వానికి తోచెను.

యువతీయువకులు జంటలుగ నిలచిరి. ఒక్కొక్కజోడు పది పండ్రెండు నిమిషములపాటు చిందులుతొక్కి మరలుచుండిరి. నాట్యమందెంత యున్మత్తత, యెంతయానందము నున్నవో యమరకాంతు డెఱుంగడు.

ఒకయువతి మేల్మూసుగు సారించి రంగమున బ్రవేశించును. ఇటనుండి పయాగ్ బయలుదేరును. ఇరువురు నృత్యము నుపక్రమింతురు. ఆ జవ్వని యంగకములందెంత జోరున్నది! ఆమెయంగ విలసనము, భావవ్యంజనను దిలకించి ప్రేక్షకులు ముగ్ధులగుచుండిరి.

ఈయుగళము వెనుక వేరొక జంట వచ్చెను. జవ్వానుడు, బలిష్ఠుడు. అతని విశాలవక్షస్థలమున మొహారీలపేరు, మొలకు చిన్న ధోవతి వెనుకకు విఱిచికట్టినదియు నున్నవి. ఆ యువతినిజూచి యమరుడు ఆిచ్చవడియెను. ఆమె మున్నీ! ఆమె విస్తృతమగు పరికిణీ ధరించియుండెను. లేగులాబీవన్నెపయ్యెట దాల్చెను. పాదములకు ముచ్చెలు తొడుగుకొనెను. ఆలేగులాబీవన్నె మేలిముసుగామె కపోలద్వయము లేతగులాబీవన్నెచే వికసిల్లెను. ఆ యువతీయువక ద్వయమొండొకళ్ళకరము, కరము పట్టుకొనియు, నొక్కొక్కతఱి హస్తముల కటి

ప్రదేశమున బెట్టుకొనియు, ఒక్కొక్కసమయమున నొండొరుల చరణ ద్వయములయ ననుసరించియు, జఘనములదెస వాలుచూపుల బఱపియు, నున్మత్తులై నృత్యము సలుపుచుండిరి.

ప్రేక్షకులెల్ల రీకళాకోవిదుల కళాకౌశల్యమును వీక్షించుచుండిరి. ఎంత ధృతి! ఎట్టి విశ్వాసము! వారిప్రత్యేక గతియందు విన్యాసమునందు నెంత మార్మికత, యెంతటి వైదగ్ధ్యమునుగలవు! ఉభయులు కరము కరమున గీలించి, చిందులు త్రొక్కుచు, రంగస్థల మీకొన నుండి యాకొనవఱకు గమించునవసరమున, ప్రమాదవశముననైన గతిలయలు దప్పుటకు వారికేమి యధికారమున్నది?

పయాగ్ 'చూచితివా సోదరా! వదినె యెట్లు నృత్యమొనరించుచున్నదో? ఆమెప్రావీణ్య మసదృశ' మనెను.

అమరుడు విరక్తమనస్కుడై 'ఔను! చూచుచున్నా' ననెను.

పయాగ్ 'ఇష్టమున్నయెడల రమ్ము! ఆయువతిని పిలతు' ననెను.

'వద్దు. వద్దు. నాకు నృత్యము తెలియదు.'

అమరుడు మున్నీ నృత్యముగావించుచుండగనే యింటికి వచ్చివైచెను. ఆతడీప్రీడారాహిత్యవ్యాపారము సహింపలేకుండెను.

ఒకింతకాలములో మున్నీ వచ్చి, 'ఏల వచ్చివైచితివి లాలా? నీకు నానృత్యము నచ్చలేదా?' యని ప్రశ్నించెను.

అమరుడు ముఖమునావలికి త్రిప్పుకొని 'నేనుమాత్రము మనిషినికానా? చక్కని దృశ్యముగాంచి బాగుండలేదనుకొనుటకు' అనెను

వానికొకింత దగ్గరగావచ్చి 'అయిన నెందుకు వచ్చివైచితి' వని తిరుగ ప్రశ్నించెను.

అమరు డుదాసీనభావముతో 'నే నొక పంచాయతీకి వెళ్ళవలసియున్నది. వారు నాకొరకు వేచియుందురు. నీవు నృత్యమేల కట్టివైచితి' వనెను.

ముగ్ధత్వముతో మున్నీ 'నీవు వచ్చివేసినచో నృత్యము చేసి యేమి చేయను?' అని యడిగెను.

'అయితే నా మాట విను. ఇక నెన్నడు నృత్యముసేయవద్దు' మున్నీ విషాదగ్రస్థయై 'నీవీ చిన్నసంగతికే ఆగ్రహించితివా? ఎవరి నేనా అడుగు. నేనెన్ని దినములవెనుక మరల నృత్యము చేసితినో రెండేండ్లనుండి యూవంక కేగలేదు. అందరూ నాకు చెప్పిచెప్పి విసిగి పోయిరి. నేను నీవే నన్నటికాకర్షించితివి. నీవే తిరుగ కోపించుచుంటి' వనెను.

మున్నీ యింటికి వెడలెను. కొంతసేపటికి కాశీ ప్రవేశించి, 'వదినే! ఇచ్చట నేమిచేస్తున్నావు? అచట నూరివారంతా నీకోసం నిరీక్షిస్తున్నా' రనెను,

మున్నీ శిరో వేదనము మిషపెట్టెను.

కాశీవచ్చి యమరునితో, 'నీ వెందుకు వచ్చివేసితివయ్యా? పల్లెటూరి ప్రజల నృత్యగానాభినయాలు నీకు రుచింపలేదా?' యని ప్రశ్నించెను.

అమరుడు 'ఉహుంc! అది కాదోయి. ఒకపంచాయితీకి పోవలసి యున్నది. జాగ్రై పోవుచున్న' దనెను.

'వదినె వచ్చుటలేదు. ఆమెనృత్యము చూచినపిదప జనుల కితరులనృత్యములు రుచించుటలేదు. నీవువెళ్ళి బోధించితే వస్తుందేమో ఇట్టియుత్సవము నిత్యమూవస్తుందా? బంధుత్వం విషయమాయెను. మాయింట్లో పనివస్తే ముఖము చాటుచేసికొన్నదందురు'

అమరుడు ధర్మసంకటములోపడి 'నీవు చెప్పకపోతివా?'అనెను.

కొంతవడికి లోసికేగి 'నామీాద కోపమువచ్చినదా మున్నీ' అని యడిగెను.

అంగణము లోనికివచ్చి మున్నీ 'నీకు నామీాద కోపము వచ్చినది కనుక నాకు నీమీాదనూ్నవచ్చినది' అనెను.

'సరే! నామాట వినివెళ్లు!'

'బాలుడు బొమ్మలనాడించునట్లు నీవు నన్నాడించుచున్నావు లాలా! నీయిష్టమువచ్చినపుడేడ్పిస్తావు, ఇష్టమువచ్చినపుడు నవ్విస్తావు'

'అది నా అపరాధము మున్నీ క్షమింపుము.'

'అయితే నాచెయ్యి పట్టుకొని నీవురమ్ము. నీవు, నేనునాట్యము చేయుదమనిననేగాని మున్నీ యికనెన్నడు నాట్యము సేయదు, ఇతరులతో నృత్యమొనర్పదు.'

'అయితే నేనిప్పుడు నృత్యము నేర్చుకొననా?'

మున్నీ తనవిజయమున కానందము ననుభవించుచు, 'నాతో నృత్యము సేయదలచితే తప్పక నేర్చుకుంటావు.' అనెను.

'నీవు నేర్పతావా?'

'నీవు నాకేడ్చుట నేర్పుచున్నావు. నేనునీకు నృత్యం నేర్పతాను'

'సరే! నడువు'

కళాశాలయం దమరుడు చాలతడవ లభినయించియుండెను. అందు నృత్యము నుండెను కాని యానృత్యమునకు దానికిచాలవ్యత్యాసముండెను. అది విలాసవంతుల కామక్రీడ. ఇది శ్రామికుల స్వచ్ఛంద కేళి. వానిహృదయము భీతిచే కంపించుచుండెను.

అతడామెతో "మున్నీ! నేనొక వరమర్థింతును" అనెను.

మున్నీ స్తంభించిపోయెను. "అయితే నీవు నృత్యము సేయవా?" యని ప్రశ్నించెను.

అమరుడు "అదియే నేవేడు వరవ్రిదానము"

అమరుడామె "నాగుమాగు" మనుచునే యుండెను. మున్నీ గిరుకుదిరిగి వెళ్ళిపోయెను.

అమరుడు కుటీరమున బ్రవేశించెను. దుస్తులువేసికొని పంచాయతీకి వెడలెను. పరిసరగ్రామములయందుకూడ పంచాయతులేవేని జరిగినచో వానినాహ్వానించుచుండిరి.

---

## 6 వ ప్రకరణము

★

సలోనీ తనయింటిస్థలమును పాఠశాల కర్పించివైచెను. బాలురు పెక్కుమంది వచ్చుచుండిరి. ఆ చిన్నిగుడిసెలో స్థలము చాలకుండెను. సలోనీ నెవ్వరు నడుగలేదు. బలవంత పఱచలేదు. ఒకనాడు చౌదరీ యమరకాంతులు కూర్చుండి, 'క్రొత్త పాఠశాల నెచట నిర్మింపవలెను? గ్రామమున పశువుల గట్టుకొనుటకైన స్థలము లేకున్నది'. అనిచర్చించుకొనుచుండిరి. సలోనీ వానిసంవాదము నాలించుచు నిలచియుండెను. ఆకస్మికముగ నామె "నాయింటిస్థలమేల తీసికోరాదు? ఇరువది బారలు ముందు, నిరువదిబారలు వెనుకను కాళీయున్నది. ఇంతస్థలమువీాపనికి చాలదా?" యని యడిగెను.

వారిరువురాశ్చర్యముతో సలోనీవంక చూడజొచ్చిరి.

"నీవెచ్చటనుందువు పిన్నీ?" యని యమరుడు ప్రశ్నించెను.

"ఉహుం! ఇల్లూ వాకిలీ నే నేమిచేసుకుంటాను బిడ్డా? నీగుడిసె లోనికి వచ్చి యేమూలనో పడియుంటే చాలదా?" అనెను.

ఆగూఢడ్ తనమనసులోనే గుణించుకొని. 'స్థలం చాలావుంది' అనెను.

అమరుడు తలయూచుచు 'పిన్నిస్థలము తీసికొనుట నాకిష్టము లేదు, మహంతులవారిని కలసికొని యూరి వెలుపట పాఠశాల నొకటి కట్టింపించెదను' అనెను.

సలోనీ విషాదగ్రస్తయై 'నాస్థలంలో నేదేనా దెయ్యముందా బాబూ?' అనెను.

చౌదరీ తీర్పునిచ్చి సందేహనివృత్తి గాంచివైచెను. పిన్నిస్థలము పాఠశాలనిమిత్తము స్వీకరింపబడును. అందే యమరునకొక గదినిర్మిత మగును. పిన్ని యమరునిగుడిసె నాక్రమించుకొనవచ్చును. ఒకపార్శ్వమున నామె కాపురము చేయనగు' ననెను.

సలోనీ అంతకుముందెన్నడు ననుభవింపని యానంద మనుభవించెను. మున్ను తన కుటీరముముంగిట నెవ్వరైన పశువునుఁగట్టినను కయ్యములాడునది, పిల్లలు గోళీలాడుకొన బ్రియత్నించిన తిట్లకు చొరకొనునది, యగునావృద్ధవనిత నేడు తనపూర్వీకుల కాణాచిని దానముగావించి జన్మ సార్థకము గావించుకొనెను. ఇదియొకయసంగత మగుమాటయే. కాని కృపణుడుకూడ త్యాగమొనర్పజాలును. ఔను! చచ్చి సమకూర్చిన విత్తమునకు వాని దృష్టియందు యోగ్యమగు హేతువు కనబడినచో లోభియు దానమొసంగును.

వైళమనిర్మాణకార్యక్రమ మారంభమయ్యెను. ఇంటింటినుండి కలప, త్రాడు, పనివాండ్రు, ధనమువచ్చెను. ఒక్కనికిగూడ చెప్ప నావశ్యకత లేకపోయెను. ఆపాఠశాల వారిదే. అందు వారిపిల్లలేవిద్య నేర్తురు. ఈయారేడు నెలలకాలములోనే కొసంత విద్యాప్రభావము వారియందు వ్యక్తమయ్యెను. పిల్లల ప్రవర్తనయం దిప్పటికే చాల సాధుత్వము పొడగట్టుచుండెను. వారు పూర్వముకన్న నసృతభాషణము తగ్గించిరి. బూతులు తక్కువయ్యెను. ఇంటిలోని వస్తువులదొంగిలించుట విరమించిరి. మునుపటంతటి మంకుతనమును జూపకుండిరి. ఏ పనియున్నను వేరుసంతసమున చేసిపెచ్చుచుండిరి. అట్టి సుఫలదాయకమగు పాఠశాలానిర్మాణమునకు దోడుపడుట కెవరు వెనుదీయురు?

ఫాల్గుణియందలి శీతలప్రభాతము శోణారుణరాగరంజితమై పర్వతసానువుల నాట్యక్రీడావినోదము గావించుచుండెను. అమరుడు సచ్ఛాత్రుడై గంగాసరిదంతిని గ్రుంకులిడి, గృహాభిముఖుండయ్యెను. కాని యింతయాలస్యమైనను నేడు పాఠశాలానిర్మాణమునకు పనివారెవ్వరును వచ్చియుండలేదు. కతమేమి? ఇతరదినములయం దతడు స్నానమొనరించి మరలి రాకమున్నె పెక్కండ్రు పనిలో ప్రవేశించుచుండిరి. కాని నేడింత ప్రొద్దెక్కినను, వారిలో నొక్కనిజాడయు లేదు. ఆతడచ్చెరువుతో నాలోచనానిమగ్నుడై నిరీక్షించుచుండెను.

ఇంతలో మున్నీ జలకలశమును శిరమున బూని వానిముందు వచ్చి నిలచెను. ఆప్రభాతసమయమున శీతలశోణారుణరాగచ్ఛవి యామె లేగులాబీవన్నెముఖమండలముపై తాండవించుచుండెను.

అమరుడు చిరునవ్వుతో 'అటు చూడుము. ప్రభాతసమయ బాలభాస్కరుడు నిన్నెట్లు తదేకధ్యానముతో నుపలక్షించుచుండెనో' యనెను.

మున్నీ కలశము దింపుకొని, చేతబట్టుకొని, 'మరి నీవుకూర్చుండి చూచుచున్నావా?' అనెను. తిరుగ నొక్కక్షణికముండి, 'నీవీదినములలో నూరియందు లేనట్లేయున్నది. పాఠశాల నిర్మించుట మొదలు పెట్టినప్పటినుండి నీ దర్శనమే దుర్లభమైపోయినది. మీకేమైన వెట్టి యెత్తినదా? యని భీతి యుదయించిన' దనెను.

'నేను దినమంతా ఇచట నేయుందును. కాని నీవెచటనుందువో కనబడుటలేదు. నేడందరు నెచటికేనా పోయినారా? ఒక్కడూ రాలేదు.'

'ఊరిలో నెవరున్నారు?'

'అంతా యెక్కడికేనా పోయినారా?'

'వహవ్వా! నీకు తెలియనే తెలియదా? గతరాత్రి శిరోమణి పురప్రబ్రాహ్మణులగోవు మరణించినది. కావున నీవాడవారెల్లరు వచటికి చనిరి. నేడింటింట మాంసము దొరుకును.'

అమరు డుఘృణాసూచకభావముతో 'చచ్చినగోవుదా? మా యింటిలోనివారును తిందురు.' అనెను.

'ఏమి తెలియును? నే నెన్నడు చూచియుండలేదు. నీవును...' మున్నీ ముఖముచిట్లించుకొని, 'నే నావంకేనాచూడను.'

'వారికి చెప్పవా?'

'బోధించిన వినువారెవరు? అందులోనూ నేనుబోధిస్తే?'

అమరుని వంశక్రమానుగ తైష్ణవసాంప్రదాయ మీాయసహ్యా పైశాచికకృత్యము సేవగించుకొనదొడగెను. అతని కిది ద్రోహ పుట్టించెను. ఆతడు స్పృశ్యతా స్పృశ్యతలు, జాతి మత భేదభావములును మనసునుండి దూరకృత మొనర్చుకొన జాలయుండెను. కాని యభాద్య వస్తుభోజనమువిషయమున నసూయమాత్రము వాని హృదయమున స్థిరముగ నాటుకొనియుండెను విశేషించి యీాపది పండ్రెండు మాసములనుండి మృతజంతు మాంసభాదుల వేటనే కుడుచుండెను.

'నేడు నేను భోజనముసేయను మున్నీ' అనెను.

'మీాకు నేను వేరే వంటచేసెదను'

'వద్దుమున్నీ! ఏయింట నావస్తువు వండుకొందురో ఆయింట తినుట నావల్లకాదు.'

ఇంతలో కోలాహలము వినవచ్చుటయు, నమరుడు కన్నెత్తి చూడగా, పదిపండ్రెండుగురు మనుష్యులు వెదురుబొంగులతో కట్టిన మృతగోవుకళేబరము మోచుకొని వచ్చుచుండుట గానవచ్చెను.

ఎంత భీభత్సదృశ్యము! అమరు డచ్చట నిలువలేక పోయెను. గంగయొద్దకు పరుగెత్తి పోసాగెను.

మున్నీ 'పారిపోవుటచే నేమగును? తప్పనిలోచిన నో పోయి వారికి బోధింపు' మనెను.

'నామాట నెవరు వింటారు మున్నీ?'

'నీమాట వినకపోతే యింకెవరిమాట వింటారులాలా!'

'ఎవ్వరూ వినకపోతేనో'?

'వినేవారుంటేనో? రా! కొంచెంపందెము వేతువా?'

'సరే. ఏమియొడ్డుదువు?'

'వినినచో నాకొక మంచిచీర తెచ్చి యివ్వవలె'

'వారునామాట మన్నింపకున్న నీవేమిచ్చెదవు?'

'ఒక గవ్వ'

ఇంతలో నాజనులగుంపును సమీపించెను. చౌదరీ సేనాపతి వలె నగ్రసురుడై వారిని నడిపించుచుండెను. మున్నీ ముందునకేగి "తేవడమైతే తెస్తున్నారు. కాని లాలా పారిపోవుచున్నా"డనెను.

చౌదరీ కుతూహలముతో "ఎందుకు? ఏమైనది?" అని యడిగెను.

'ఈచచ్చినయావుసంగతి. మీచేతిసీరైనా ముట్టననుచున్నాడు' పయాగ్ రొమ్మువిఱుచుకొని 'వదరుకోసీ! మాచేతిసీరు తాగకున్నంతమాత్రాన మేము తక్కువై పోము' అనెను.

కాశీ "నేటికి చాలాదినములకు వెనుక మాంసములభించింది. దానికికూడా ఈబాధా?" అనెను.

చౌదరీ సమాధానపఱచునూహతో 'తుదకేమనును?' అని ప్రశ్నించెను.

మున్నీ యాగ్రహముతో "వెళ్ళియతనినే అడుగు. ఏవస్తువు నగ్రకులజులు తినరో దానిని మనమెందుకుతినవలె? ఇందుకనే ప్రజమనలను నీచులుగా నెన్నుదు"రనెను.

ఆవేశముతో పయాగ్ 'అయితే మన మే బ్రాహ్మణ పురోహితుల పడుచునైనా పెండ్లాడబోవుచున్నామా? బావనయ్యలవలె పరుల గుమ్మములయొద్ద ముష్టినెత్తుకోబోము. ఇది వారి వారి యాచారము' అనెను.

'జిహ్వాచాపల్యముకొఱకు పరులచే నీచులనిపించుకొనుటవేమంత ఘనకార్యము?' అని మున్నీ కసరికొట్టెను.

. గోకళేబరమచటనే దించివైచిరి. ఇరువురు, ముప్వురు కత్తులు తేబోయిరి. అమరు డచటనిలచి, మున్నీ వారిని వారించుచుండుట, వారామెపలుకులు పెడచెవిని బెట్టుచుండుట, వీక్షించుచుండెను. దమనమగునేమోయని ముఖము నవ్వలివంకకు త్రిప్పుకొనెను. అట్లు చేసిననుకూడ నా దృశ్యమతని కన్నులయెదుట కనిపించుచునే యుం

డెను. తనకు పాతికబారల దూరములో మాంసముకొఱకు గోవును తరిగివేయుచుండిరన్నసంగతి నతడెట్లు మరువగలడు! అతడు గంగా నదియొడ్డునకు పరుగెత్తిపోయెను.

అదిచూచి చౌదరీ చింతతో 'అతను నిజముగ గంగవంకకే పరుగెత్తుచున్నాడు. మిగుల నావేశముకలమనిషి. ఎందైనా మునిగి పోడుకదా?' అనెను.

పయాగ్ 'నీపని నీవుకానిమ్మా. మునిగిపోడు, గినిగీపోడు. ఎవ నికీ ప్రాణములంత బరువులేవు' అనెను.

మున్నీ యతనివంక ముపదృష్టితో చూచుచు 'నీచులకు, నీచు లుగానే మనగోరువారికిని ప్రాణములన్నతీపి. సిగ్గున్నవారు, పరుల ముందు తలవంచుకొని నిచ్చగింపనివారును, ఇట్టి విషయములలో ప్రాణములర్పింప నెనుదీయరు.

పయాగ్ "నీ వతనిపక్షము బాగావహించి పలుకుచున్నావు వదినే! ఏమన్నా పెళ్ళినిశ్చితమైనదా యేమి?' అని హేళనగ ప్రశ్నిం చెను.

మున్నీ గద్గదికస్వనమున 'తాతా! నీవీమాటలు వింటునేయు న్నారుకదా? కాని నోరుమెదుపవు. నేనతనిని పెళ్ళాడితే మీకు వేళాకో ళమా? కాక, నాకిట్టి యూహయే పుట్టినన్నాపగల వారెవ్వరు? సరే. ఈసంగతీచూతును, ఇంట్లోకి మాంసమెట్లువచ్చునో? మాంసము తెచ్చుటముందు నాకుత్తుకపై కత్తివ్రేటు పడవలెను.' అనెను.

మున్నీ వారిమధ్యనుండని, యాగోపురిసముదొద్ద కూర్చుండి, బెదరించుచు, "ఎవరు నరకుదురో నరకుడు. ఇదే కూర్చున్నాను" అనెను.

పయాగ్ కాతరుడగుచు, 'హత్యసేయుట, పొలమ దున్నుట, తిండితినుటా?' అనెను.

మున్నీ 'మీబోంట్లే మీసంఘమున కపయశము దెచ్చుచున్నారు పై పెచ్చు వరులెవరైన చెప్పినచో జగడమునకు సిద్ధము' అనెను.

గూఢడ్ చౌదరీ గభీరవిచారనిమగ్నుడై నిలచియుండెను. నేటి ప్రపంచ వాతావరణస్థితి యెట్లులున్నదీ, గాలి యెట్లువీచుచున్నదీ దిని యుండెను. అనేకపర్యాయములతడీ విషయమునుగూర్చి యమరకాంతునితో చర్చించియుండెను. గాంభీర్యముతో "సోదరులారా! ఇచ్చట నె యూరిజనులెల్లరు కూడియున్నారుకదా? చెప్పుడు. ఇప్పుడు మనము చేయతగిన దేమి?" యని యడిగెను.

ఒక విశాలోరస్కుడగు యువకుడు 'మీనిర్ణయమే కర్తవ్యము. అదేమెల్లరకు సమ్మతము. మీరీగ్రామమునకెల్ల నాయకుల'ని వచించెను.

పయాగ్ తనతండ్రి విచలితుడగుటగాంచి, తిక్కనవారిని జీరి, "మీరంతా నిలబడి ఆశ్చర్యంతో చూస్తున్నారేమిటి? మున్నీ చెయ్యి దొరకబుచ్చుకొని లాగివేయరేమి? నేను కట్టిపట్టువిలచియున్నాను." అనెను.

మున్నీ క్రోధముతో "నామాంసము తింటేమాత్రమేమిబాధ? అదీ మాంసమేకాదా?" అనెను.

ఎవ్వరును ముందుకు రాకుండుటచూచి, పయాగ్ స్వయముగ మున్నీని సమీపించి, చెయ్యిపట్టుకొని లాగివేయనుద్యుక్తుడగుటయు, కాశీ వానినొక్క తోపుతోసి నెట్టివైచి కన్నులెఱ్ఱచేసి, 'తమ్ముడా! ఈమెయొడలపై చేయివేసినచో హత్య జరుగును. ఇదే చెప్పివేయుచున్నాను. మనయింటిలోని కీగోమాంసపు వాసనకూడ వచ్చుటచూడ నేరవు వచ్చితివెట్లయితే మహావీరుడవయి' అనెను.

ఆవిశాల వక్షస్కుడగు యువకుడు మధ్యవర్తియై "చనిపోయిన గోవుమాంసమునందంతటి విశేషమేమున్నది. యింతమంది కొట్టుకు

చచ్చుటకు? గొయ్యితీసి మాంసము పాతిపెట్టివేయుడు. చర్మము నొలిచి తీసికొనుడు. ఇదే అమరుని యూహ. వానియుపదేశము మన మనుసరించితిమేని మనముద్ధరింపబడుదుము. ప్రపంచమెల్ల మనలనస్పృశ్యులని వాకొనుట కిదియే కారణము. మనము కల్లు, సారాయి త్రాగుదుము. మృతజంతుమాంసభక్షణ మొనర్తుము. చర్మములతో కృషి సల్పుదుము. ఇంతకుమించి మనయందు లోపమేమియున్నది? కల్లు సారాయిలు విడచిపెట్టినాము. మనము విడచుటేమి? జాల్మమే మనలను విడువచేసినది. మృతజంతుమాంసములో నేమంత ఘనత యున్నది? ఇక చర్మకారవృత్తియున్నది. అది దోషమని యెవ్వరును చెప్పజాలరు. ఒకవేళ చెడ్డదన్ననూ మనకు లక్ష్యము లేదు. చర్మములు శుభ్రముచేయుట, వాటి క్రియవిక్రయము దోషముకాదు.' అని పలికెను.

చౌదరీ యీయువకుని సాదరదృష్టితో చూచుచు 'మీరెల్లరు భూరేపలుకులు విన్నారుకదా? మీయందఱి యభిమతము నిదేనా?' అని ప్రశ్నించెను.

భూరే 'కాదనువాడెవడైన నున్నచో చెప్పు' డనెను.

ఒకవృద్ధుడు 'ఒక్క నీవూ నేనూ మానినంతమాత్రమున నేమగును?

'జాతిఅంతా తింటూంటే?' అనెను.

భూరే "జాతిఅంతా తింటే జాతి నీచముగ నేప రిగణింపబడును. ఎవరిధర్మము వారికుండు" ననెను.

చౌదరీ భూరేను సమర్థించెను. "నీవు సరియైన మాట చెప్పినావుభూరే. పిల్లలచదువువిషయము తీసుకో. ఆదిలో నెవరైన తమ పిల్లలను పంపెడివారా? కాని ఎన్నడు మనపిల్లలు చదువుకొన మొదలిడిరో, తక్కినయూళ్ళపిల్లలును రాసాగిరి" అనెను.

కాశీ 'మృతకళేబరమాంసము తిననందుకు సంఘము మనలను దండింపదు. దీనికి బాధ్యత నాది. కాని, సాయంత్రమున కీవార్త నలు దిక్కులవ్యాపించును. అప్పుడు వారుకూడ నిదే చేయుదురు. అమరు డనిన నెంతగౌరవమున్నది! అతనిపలుకులు ఖండించుట కెవనికి శక్తి గలదు?' అనెను.

పయాగ్ ఇప్పుడిక తన పప్పుడకదని గ్రహించి, యధిక్షేపిం చుచు, 'ఇక స్త్రీలదే రాజ్యము, స్త్రీ చేయనేరని పనులగుదు' అనుచు కత్తి తీసికొని యింటికి వెడలిపోయెను.

చౌదరీ గంగాతటమున కేగి, 'ఇందేల నిలచియున్నావు సోదరా? ఇంటికి పద! జగడమంతా తీరిపోయిన' దని చెప్పెను.

అమరుడు గాఢచింతానిమగ్నుడై యుండెను. ఈపలుకులు వాని చెవిని బడలేదు. చౌదరీ యింక కొంత సమీపమునకు జని, 'ఇచ్చట నెంతకాలము నిలచియుందువు' అని తిరుగ ప్రశ్నించెను.

'వలదు తాతా! నన్నిచ్చటనే యుండనిమ్ము. మీరచట మాం సము తినుచుందురు నేనది చూడలేను. మీకు తీటికయైన పిదప వత్తునుగాక' అనెను.

'కోడలు నీవు మాయింట నన్నముకూడ తినవనుచున్నది.'

'ఔను తాతా! ఈదినము తినను. నాకు వాంతియైపోవును.'

'కాని మాయింట నిత్యము నీపనియే జరుగుచుండును.'

'నాలుగైదుదినములలో నాకు నలవాటయిపోవును.'

'నీవు హృదయమున మమ్ము రాక్షసులుగ దలపోయుదువు కాబోలు'

అమరుడు గుండెపై చేయినిడికొని 'కాదు తాతా! మీయొద్ద రవంత నేర్చుకొనుటకును, మీకు సేవచేసి నాయుద్ధారణ గావించు కొనుటకును నేను వచ్చితిని. కాని ఇది వారివారి యాచారము. చీనా చాలా పెద్దదేశము. ఆదేశమున పెక్కురు బుద్ధభగవానునారాధింతురు.

వారిమతమున జంతుహత్యా పాపము, కావున వారు మరణించిన జంతువులమాంసమే భుజింతురు. కుక్కలు, పిల్లులు, కుందేళ్లు వేనినికూడ వారు విడిచిపెట్టరు. ఆహేతువున వారు మనకంటె నీచులా? మనదేశమునకూడ బ్రాహ్మణులు, క్షత్రియులు మాంసమెంతమంది తినుట లేదు. జిహ్వాచాపల్యమున వారు జీవహత్య గావింతురు. మీరు వారికన్న నెన్నిమడుంగులో శ్రేష్ఠులు' అని చెప్పెను.

చౌదరీ నవ్వుచు, 'భాయీ! నీవు చాలబుద్ధిమంతుడవు. నిన్నెవ్వరూ గెలువలేరు. ఇక నిప్పుడెవ్వడూ మృతజంతుమాంసమును తినడు. మేమందరము నిదే నిశ్చయించితిమి. ఇదంతా కోడలి పనే. కాని చర్మములు పారవేయనక్కరలేదుకదా!' అనెను.

అమరుడు సంతసించి, 'అవసరములేదు తాతా! చర్మము లేటికి పారవైతురు? పాదరక్షలు చేయుట అన్నిటికన్న నుత్తమసేవ. కాని, వదినె చాలతగవు పెట్టినదా?' యని ప్రశ్నించెను.

చౌదరీ 'తగవు పెట్టుట మాత్రమే కాదు. ప్రాణము లర్పింప నుద్యుక్తురాలైనది. గోవుదగ్గర చతికిలబడి, 'కత్తి వేయుము. మొదటి వ్రేటు నాకంఠముపై పడగల' దనెను. పిదప కత్తి వేయుట కెవనికి శక్తిగలదు? అని చెప్పెను.

అమరకాంతుని హృదయ మొక్కపరి లంఘించి మున్నీపద ముల వ్రాలి మొక్కరిల్లెను.

---

## 7వ ప్రకరణము

★

చాల నెలలు గడచెను. ఆగ్రామములో నెన్నడు తిరుగ మృతకళేబరమాంసము రాలేదు. ఆశ్చర్యకరమగు విషయమేమన, పరిసర గ్రామవాసులుకూడ మృతజంతుమాంసము తినుట మానివైచిరి. సదుద్యమమొకింత సంక్రామికము నగును.

అమరుడు నూతననిలయప్రవేశ మొనర్చెను. విద్యయెడ జనుల కాసక్తి గలిగెను. యువకులు, వృద్ధులుకూడవచ్చి పాఠశాలయందు చేరి యేదో కొంత నేర్చుకొనునంత రుచికలిగెను. అమరుని శిక్షా శైలి యాలోచనాత్మకమైయుండెను. అన్యదేశముల సామాజిక, రాజ నైతికవృత్తాంతము, నవనవానిష్కృతి, క్రొత్త క్రొత్త యోచనలు, వానిముఖ్యవిషయములు. దేశదేశాంతరముల యాచార వ్యవహార ములు, మర్యాదలు, నభ్యాసములు, వీనినిగురించిన కథలు శ్రోతలెల్లరు నుత్సుకతతో వినుచుందురు. నిరక్షరకుక్షులగు నీచాతుర్లు జరిల సామాజికసిద్ధాంతము నెంతసులభముగ గ్రహింతురో చూచి యమర కాంతున కప్పుడప్పుడు విస్మయము కలుగుచుండును. పల్లెలందెల్లెడ నొక నూతన జీవనస్రోతస్సు ప్రవహించుచున్నట్లుండెను. స్పృశ్యత, స్పర్శనములకెంతో లోపము కలిగెను. అంటుముట్లుల దోసము లడు గంటె,. పరిసరగ్రామములందలి యగ్రజాతులవారు నీ గ్రామమునకు రాకపోకలు సలుపజొచ్చిరి.

పవలెల్ల కష్టించినపిదప నమరకాంతు డొకయాఖ్యాయికను కేలగొని, చదువ నుపక్రమించెను. కొంతసేపటికి మున్నీవచ్చి నిల్చెను. అమరుడు చదువునందే మునిగియుండుటచేత నామెవచ్చిన సంగతి వానికి తెలియకుండెను. ఏవిధానము విశ్వమంతటెనిగాని వెదకినను గానరాదో, ఏది తలంచిన నేటికిని గర్వవశమున మనకంఠములునిక్కు చుండునో, యట్టి బలివిధానము! ప్రాణముల నెవ్వరైన నింత తుచ్ఛ ములుగ చూడజాలిరా! కులమర్యాదారక్షణార్థమీ దృశయలౌకికా దర్శమెచటనైన లభింపగలదా? నేటికాలపు బుద్ధివాద మావీరమాత లపై నెంత నిందయైన విసరుగాక! మనభక్తి వారి చరణసరోజములు సన్నిధానమున సర్వదా వినతులొనరించుచుండును.

మున్నీ సవ్వడిసేయక నిలచి, యమరుని దిలకించుచుండెను ఒకసంవత్సరమువకు పూర్వమామె హృదయాకాశమున విహంగమము

పడుపున నెగయజొచ్చిన మేహశకలము నేడాకసమంతటిని సంపూర్ణముగ నావరించెను. గతించిన జ్వాలయందు శుష్కించిన కాంక్షలీ శీతలచ్ఛాయలో పునరుజ్జీవములై హరితవర్ణవిరంజితము లయ్యెను. ఆశుష్కజీవన ముద్యానవనము పందముగ నవ్యసౌరభ, వికాస భరితమై వినూత్నకళాశోభితము కాసాగెను.

అన్న్యాల కామెమఱద దుర్గి వంట కావింతురు. అమరున కామె తనచేతులతో వంట సేయును; వాపమతడు వారెట్టివి పెట్టినా నాగొట్టలే తినుచుండును; కాని యీపట్లెటూరిపడుచులు దళసరిరొట్టెలు బొగ్గుల యందు కాల్చి వాని కిడుచుందురని, అమరు డామె కేకార్యమైన నియోగించిన నామె ముఖమండలమున నానందజ్యోతి ప్రకాశింప జొచ్చును. ఆమె యొకనూతన స్వర్గమును నిర్మించుకొనుచు, నేదో యొక నవ్యసుఖస్వప్నములను గనుచుండును.

ఒకదివసమున సలోనీ మందస్మిత వదనయై, 'అమరభయ్యా! నీయదృష్టము చేతనే యీ చటికి వచ్చినాడు మున్నీ! ఇక నీ దినములు మారగల వనెను.

మున్నీ తనహస్తమును పిడికిట బిగియబట్టినట్లణచుకొనుచు, 'ఏమి మాట్లాడుచున్నావు పిన్నీ? అతనెక్కడ, నేనెక్కడ? నాకంటె నెన్నేండ్లో చిన్నవాడై యుండును కాని ఎంతవిద్వాంసుడు! ఎంత చతురుడు! నేను వానిపాదరక్షలకైన సరిరాను' అనెను.

'అదంతా సత్యమే కాని నీపరిభావమతని నాకర్షించినది. నేనది కనిపెట్టితిని. మోమోటమి కలవానివలె కనబడును. నేను చెప్పలేను. కాని, నీవు వానిమనసులో స్థావర మేర్పరచుకున్నావు. ఇది నానమ్మకము. ఇంతమాత్రము గ్రహింపలేనా? నేనాతని సిగ్గును పోగొట్టవలెను' అని పిన్ని పలికెను.

పులకితయగుచు మున్నీ 'నీయాశీర్వాదమున్నచో పిన్నీ! నా మనోరథమును ఫలింపగల' దనెను.

ఒకింతకాలము మున్నీ వానివంక చూచుచునిలచి, వాని మంచము గదిబయటకి తెచ్చెను. అమరునిధ్యానము చెదిరెను. 'అటులుండనీయుమున్నీ! నేనిప్పుడే పక్కవైచుకొనెదను. నీవింతగా నన్ను గారము చేసినచో నేను సోమరినైపోవుదును. రమ్ముమున్నీ! నీకు హైందవ నారీమణుల గాథలు వినపింతును.'

"ఏమేనా కథయా?"

"కాదు. యదార్థమగు చరిత్రయే"

అమరుడు ముసల్మానుల జైత్రయాత్రలు, క్షత్రియాంగనల శరణాగతులు, రసపుత్రవీరుల శౌర్యోత్సాహములు, వీటిచర్చ సలుపుచు 'ఆస్త్రీలకగ్నిప్రవేశమొనర్చి, మరణించుట సమ్మతమేకాని, పరపురుషుల దృష్టిబడుట యసమ్మతము. గౌరవ సంరక్షణార్థమై వారాత్మహత్య యొనర్చుకొనెడివారు. మనస్త్రీలకట్టి మహత్తరమైన యాదర్శముండెడిది. నేటి యూరపునందలి స్త్రీల యాదర్శమెట్టిది? జర్మను సైనికులు పరాసు దేశము నాక్రమింప, పురమెల్ల పురుష విహీనము కాగా, పరాసు దేశస్త్రీలు, జర్మను సేనానాయకులతోను, సైనికుల తోడను, ప్రేమక్రీడల దేలనారంభించిరి.' అని చెప్పెను.

మున్నీ యసహ్యించుకొనుచు 'వారంతా కడుచంచలలు. కాని రసపుత్రాంగనలు సజీవముగ నెట్లగ్ని ప్రవేశమొనర్చెడివారు? అని ప్రశ్నించెను.

అమరుడు పుస్తకమును మూసివేయుచు 'చాలకష్టముమున్నీ! ఇచట కాసంతనిప్పు తగిలినచో బిలబిల వేతురు కాని, వారట్లుకాదు. ప్రపంచమంతయు వారినామములకు వినతిమొనర్తురు. నేనీకథలను చదువుసమయములయందు నారోమములు గగుర్పొడుచును. ఏపవిత్ర స్థలముల నాస్త్రీలు తమచితుల జేర్చిరో? యాస్థలమందలి భస్మమును శిరసున ధరింపవలెననియు, కనులకద్దుకొనవలెననియు, నచ్చట మరణింపవలెననియు నాకభిలాషజనించుచుండును.' అని చెప్పెను.

మున్నీ ఏదో విచారమగ్నయై క్రిందికిచూచుచు నిలచియుండెను.

అమరుడు మరలచెప్పసాగెను 'ఒకొ్కక తరుణములయందు, పురుషులను, సాంసారిక మాయామోహ విముక్తులనొనరింపనెంచి స్త్రీలు సమరమునకుముందే యగ్నిప్రవేశమొనరించుటయు నుండెడిది. మనుష్యులకు ప్రాణములపై నెంత మమతయున్న, వృద్ధులు సైతము మరణింపనొల్లరు, నానాకష్టములు సహించియు, మనము బతుకుదుము మహామహా ఋషిపుంగవులుసైతము జీవితముపై గల మోహమును త్యజింపజాలరు. కాని యాస్త్రీరత్నములకు జీవితమొక వినోదమువలె నుండెను. మున్నీ యప్పటికిని మౌనముదాల్చి నిలచియుండెను. ఆమె యంతరంగమున నేదియో దుస్సహవేదన కలిగినట్లు మొగమునందలి కళ క్షీణించెను.

అమరుడు కంగారుపడి 'ఒంటెయందేట్లున్నది మున్నీ. ముఖము వసివాడిన దేల?' అని ప్రశ్నించెను.

మున్నీ క్షీణమందహాసము నొనర్చుచు 'నన్నడుగుదువా? నాకేమిజరిగెనా?' అని ప్రశ్నించెను.

'సంగతేమి? నాకడ దాపురమేల?'

'లేదు. ఏమీలేదు'

ఒక నిముషము గడచినపిదప నామె 'నేడు నాకధనీకు వినిపించెదను. విందువా?' యనెను.

అమరుడు 'చాలసంతోషముతో అనేకసార్లు నిన్నడిగియుంటిని, కాని నీవు చెప్పలేదు' అనెను.

'నిన్ను చూచి నే నడలుచుంటిని. నన్ను నీచురాలని, యింక నేమేమో యనియు ననుకొనగలవు.'

అమరుడుకుద్ధుడైనయట్లు 'సరే! మంచిమాటే, చెప్పుము! నే నెటువంటివాడనో నట్లే యుందును. నీవు యత్నించినంతమాత్రమున నన్ను మార్పజాలవు.' అనెను.

మున్నీ పరాజితయై 'నీవు రవ్వంతమాటకు నలుగుచుందువు లాలా! స్త్రీతో నీకెవ్వడూ పడడు. సరే విను! నీమనసుకెట్లు తోస్తే అట్లే భావింపుము.

నేను కాశీనుండి బయలుదేరునప్పుడు నాకు కొంతకాలమువరకు స్మృతిలేదు; ఎచ్చటికేగుచుంటినో, ఎందుకు పోవుచుంటినో, ఎందుండి పోవుచుంటినో, గుర్తు లేకుండెను. మరల నేడువజొచ్చితిని. నాభర్తపై గలమోహము హృదయమున సాగరమువలె నుప్పొంగ దొడగెను. అందు నేను మునుగుచు, తేలుచునుంటిని. అప్పుడు నేనేదో కోల్పోయి వచ్చివేయుచుంటిననుభావన కలిగెను. నాబిడ్డడు నా యుత్సాగము నకు నుత్సహించుచున్నట్లు తోచెను. అట్టి మొహమింతవరకు నెన్నడు నాహృదిని జాగరితము కాలేదు. వానిని స్మరింపజొచ్చితిని. వానినవ్వు. యేడ్పు, తొక్కు పలుకులు, తప్పటడుగులు, వాని ననువయింపజాబిల్లిని చూపుట, నిదురబుచ్చ జోలలుపాడుటాది విషయము లొక్కటొక్కటియే జ్ఞప్తికి వచ్చుచుండెను. ఆచిన్నిసంసారమెంత సుఖప్రదమైయుండెడిది? ఆ రతనమును నాయొడియందుంచుకొని ప్రపంచమునగల సంపత్తిని కాలదన్నినట్లు ప్రసన్నురాలనగుచుంటిని. ఆసుఖమునకు బదులు స్వర్గసుఖమునైన నొల్లను. ఎదలోని కోర్కెలెల్ల నాయీవత్సునియందు ప్రభవించియున్నట్లు తోచెడిది. నా శిథిలకుటీరము, నాజీర్ణవసనము, నా నగ్ననిరీక్షణ, దారిద్ర్యచింత, ఋణపణములబాధ, యిత్యాదులెల్ల ముళ్లుగల పువ్వులయ్యెను. నాకుగల ఏకైకకాంక్ష నాబాలునకెట్టి యనిష్టము వాటిల్లకుండుగాత' మని నే నట్టిపాపను విడచి యెచ్చటికేగు చుంటినో తెలియదు. నాచిత్తముద్భ్రమితమైపోయెను. మనసునస్మృతులెల్ల కన్నులయెదుట పరులిడుచున్న బాటప్రక్క వృక్షములవలె నన్ననుసరించి పరువెత్తుచున్నట్లు తోచుచుండెను. కడకు నేను ముందున కడుగిడ నోపకుంటిని ప్రపంచము పరిహసించిన పరిహసింపనీ. బంధువర్గము బహిష్కరించిన బహిష్కరింపనీ, నేను నా చిట్టిపాపను

వదలిపోను. కూలి నాలి చేసియైన పొట్ట పోసికొనగలను. నాకన్న బాబును నాకన్నులార చూచుకొనుచు బ్రతికెదను. వానిని నాకౌగిటి నుండి లాగుకొనువాడెవ్వడు? నేను వానికొరకే వచ్చితిని. వానిని నా రక్తముతో నుత్పన్నము గావించితిని. నా క్షీరములిచ్చి పోషించి తిని. వాడు నాధనము. వానిపై నొరులెవ్వరికి నధికారము లేదు.

లక్నోలో బండి దిగితిని. తిరుగుబండిలో కాశీ వచ్చివేయ నిశ్చయించుకొంటిని. జరుగవలసిన దేదో జరుగును!

నే నెంతవరకు ప్లాటుఫారముపై నిలచియుంటినో యెరుగను. విద్యుద్దీప మాలాపరంపరలచే శకటవిరామస్థలము దేదీప్యమానమై యుండెను. పదేపదే కూలీలను 'కాశీబండి వచ్చునెప్పుడని' యడుగు చుంటిని. పదిగంటలకని తెలిసెను. నేను నావస్తువులు సర్దుకొంటిని. మనసు తొట్రుపడసాగెను. బండి వచ్చివేసెను. ప్రయాణీకు లెక్కు చుండిరి. కూలివాడు వచ్చి, 'సామాను స్త్రీలబండిలో పెట్టుదునా పురుషులబండిలోనా?' యని ప్రశ్నించెను.

నానోటినుండి శబ్దము వెలువడదయ్యెను.

కూలి నాముఖమువంక చూచుచు 'ఆడువారిబండిలో వేయనా?' యని యడిగెను

నేను కలతపడి 'నసీబండిలో పయనింప' నంటిని.

'ఇక రెండవబండి పగలు పదిగంటలకు వచ్చు'నని వాడు చెప్పెను.

'సరే! నేను దానియందే పోయెదను' అంటిని.

'అట్లయిన సామాను బయటకి తీసికొనిపోనా? లేక సత్రము లోనికా?'

'సత్రములోనికి'

అమరుడు 'నీవాబండిలో నేటికి పోనైతివి?' అని పృచ్ఛచేసెను.

మున్నీ గద్గదికస్వనముతో 'నామనసులో నేమి పుట్టెనో తెలి యదు. కాలుసేతులెవ్వరోకట్టివేసినట్లయ్యెను. నేనెద్దియోగోహత్య

సేయబోవుచున్నట్లదుగు సాగలేదు. ఈకుష్ఠహస్తములతో నా చిన్ని పాపనెట్లెత్తుకొనగల్గుదును! నాకు నాపతిపై కోపము వచ్చుచుండెను. ఆయన నావెంట నేటికి రాలేదు! వారికి నాచింతయే యున్నచో నన్నేటికొంటరిగా రానిచ్చును! ఆతడు నీబండిల్లోనే వచ్చియుండును. వాని కిష్టము లేనప్పుడు నేనును పోను. ఇవిగాక యిక నేయే సంగతులు స్మరణకువచ్చి నన్నవరోధించినవో చెప్పజాలను. నేను సత్రము నందు హతాశనై కూర్చుంటిని. ఇంతలో నొకపురుషుడువచ్చి జంబుకానా పరచి, తనభార్యతో నాసమీపమున కూర్చుండెను. ఆ స్త్రీ సందిట నొక యేడాదివయసుగల బాలుడుండెను. ఆపసికందువు కడు సుందరుడు. కందగెడ్డవంటి శరీరము. ఆళువచిప్పలబోలు కన్నులు, వెన్నవంటి మృదులాంగకములు. తన్మయురాలనై వానిని చూచుచు, 'స్వపర' చింతల విస్మరించితిని. వాడు నాతనయుడే యనిపించెను. ఆ బిడ్డతల్లి యుత్సంగమును విడచి మెల్లమెల్ల బ్రాకుచు నావంకకు వచ్చెను. నేను మరొకవంక కేగితిని. తిరుగ నాపిల్లవాడు నావంకకు జరిగెను. నేనును దూరముగ జరిగితిని. ఆబిడ్డ నేను తన్ననాదరణ చేసితినని భావించి యేడువసాగెను. అప్పటికిని నేను వాని దగ్గరకు పోలేదు. బాలుడు మారాము పెట్టసాగెను. మాటిమాటికి నావంకకు చేతులు చాచుచుండెను. కాని నేను దూరముగ నిలచియుంటిని. నా చేతులు నరకివేయబడినట్లు తోచెను. నాయీ పాడుచేతులాబాలుని ంటి నంతమాత్రమున నాబంగరుబొమ్మవంటి బాలున కేదేని యరిష్టము సంభవించునని, వానినుండి యేదో యెగురుపోవునని తోచుచుండెను.

ఆ వనిత, 'బిడ్డను కొండెమెత్తుకొను మమ్మా! నీవేమో పారిపోవుచున్నావు. తన్నెవరు ప్రేమింతురో వారియొద్దకీయభాగ్యుడు వెళ్ళడు. ఎవరిముఖము నవ్వాలికి త్రిప్పుకొందురో వారివంకకు పరుగెత్తును' అనెను.

బాబూజీ! ఈపలుకులు నాహృదయము నెట్లు వేధించెనో చెప్ప జాలను' నేను కళంకినని, పాపినని, నేను స్పృశించిన ననిష్టమగునని దెలుపనోర్తువా? అది తెలిసిన నామె యాశిశువు నెత్తుకొననిచ్చునా?

నేను దరిజేరి, శిశువును స్నేహాభరితాక్షములతో వీక్షించుచు, వానినెత్తుకొన కరములు సాచితిని. అంతలో శిశువేదో భయానక దృశ్యము జూచినవానివగిది కెవ్వుననార్చి తల్లివంకకు పరుగిడెను. ఆలోచించిన నిప్పుడు బోధపడును. అది బాలురబాల్య ప్రకృతియని. కాని నేను సిగ్గుపడిపోతిని.

ఆతల్లి పిల్లవానిని 'ఇప్పుడు పోవేమిరా? పిలుచుచున్నదికదా?' యని 'ఎక్కడికి వెళ్ళెదవు చెల్లెలా?' యని నన్నడిగెను. హరద్వారమునకని చెప్పితిని. ఆదంపతులు హరద్వారమునకే పోవుచుండిరి. బండి తప్పిపోయినందున నిలచిపోయిరి. వారికిల్లువాకిలి గలదు. వెనుకకు తిరిగిపోనొల్లకుండిరి. హరద్వారమువరకు తోడుండును కదాయని సంతసించితిని. కాని బాలుడు మరల నాదిక్కునకు రాలేదు.

కొంతకాలమున కాదంపతులిరువురు నిద్రించిరి. తల్లి నంటిపెట్టుకొని యున్నబిడ్డడును నిద్రించుచుండెను. నా కాబాలకు నెత్తుకొని లాలింపవలెనని, ముద్దువెట్టుకొనవలెనని ప్రబలమగు నిచ్ఛ జనించెగాని బిడ్డ లేచియేడ్చునో, తల్లి యేమనుకొనునో యనుభీతి గరచజొచ్చెను. ఆశిశువుయొక్క వికసితవదనారవిందము ప్రియశిశువాడే మధురస్వప్నములో గాంచి నవ్వుచుండబోలును చూచి నామనసును పట్టజాలనైతిని. నిదురించువానిని నాయక్కున జేర్చుకొంటిని కాని, మరుక్షణము చైతన్యముకలిగి, వానిని యథారీతిని పరుండబెట్టివేసితిని. ఆక్షణికమాత్రపు ప్రేమయందెంత యానందముండెను! నా పుత్రుడే యీయాకృతిని జొని నాయొద్దకు వచ్చినాడనిపించెను.

ఆస్త్రీ చాల కఠినహృదయురాలు. మాటిమాటికిని యాముద్దుబిడ్డ నదలించును. అప్పుడప్పుడు కొట్టుచుండును. ఆ సమయములో నా

కీమెను కసరికొట్టవలెనని బుద్ధి జనించుచుండును. తల్లి తనవత్సపై నాగ్రహముచూపుట నాకిదియే మొదటి యనుభవము.

మరుసటియుదయమున హరద్వారము పోవుబండి నెక్కుట తోడనే శిశువు నావశమైపోయెను. నేనిప్పుడు మీతో నేమిచెప్పుదును బాబూజీ! నాస్థనముల పాలు చేపజొచ్చెను. తల్లికీబాధకూడ తప్పించి వైచితిని.

హరద్వారమున మేమొక ధర్మశాలయందు విడిసితిమి. ఆశిశువు మోహజాలముల సింధింపబడిన నే నాదంపతుల వెంటతిరుగుచుంటిని. పిల్లవాని మలమూత్రములు కడుగుట, వాలుగుడుపుట, యాడించుట, నాపనియయ్యెను. తల్లికి విడుదలయయ్యెను. నేను వానిసేవయందే మగ్నురాలనైతిని. ఆదేవి యెంతపోమరి, గర్విష్ఠియునో, యామె భర్త యంత సచ్ఛీలుడు, దయాళువును. అతడు నావంక నెన్నడు కన్నెత్తి చూడనైనలేదు. గదిలో నే నొంటిరిగ నున్నచో లోనికి రాడు. ఇంచుమించు నతని స్వభావము మీ దానివంటిదే. ఆయనను చూచి నాకు దయగల్గుచుండెడిది. ఆకర్కోటకురాలితో నాతనిజీవితము మార్జాలపునఖముల జిక్కిన మూషికమువిధమున గడచుచుండెను. ఆమె వానిని తడవతడవకు నిదిల్చికొట్టును. ఆతడు లజ్జించుచుండును.

ఒకపక్షము గడచిపోయెను ఆస్త్రీ యింటికి తరలిపోవుదమనెను ఆమెభర్త యిచటనే మరికొన్నినాళ్లు గడుప నిచ్ఛగించుచుండెను. ఈవిషయమై వివాదఘటిల్లెను. నేను ప్రాంగణమున బాలకునెత్తుకొని నిలబడియుంటిని. ఆసతి కృద్ధురాలై 'మీరుంటే వుండండి! నేను వెళ్ళిపోతాను మీకింటిదృష్టి లేదనెను.

ఆమెపతి బెదరుచు, బెదరుచు 'ఇంక నైదారుదినము లిచట యుండిన నష్టమేమున్నది? నాకు నా దేహస్థితినిగూర్చి చింతచేత నే మీరిచ్చట నున్నారా? నిజము చెప్పండి'

'అయితే ఎందుకు వచ్చినాము?'

'వచ్చుట ఎందుకువచ్చినా, నా ఆరోగ్యమునుగూర్చి కాదు మీరచట నుండగోరుట. ఈతీరుతీయములు మీ దుస్స్వభావమెరుగని వారికడ్డుపడికివచ్చును. మీనిలువెల్ల యెరుగుదును. మీరిచట నుండ దలచుట విహారముకొరకు, క్రీడకోసమును ..'

భర్త చేతులుజోడించి 'సరే! ఇక చాలు! నాకు కళంకము తెచ్చిపెట్టకు. నేడే బయలుదేరుదును లెమ్ము!' అని మనవి చేసెను.

ఆదేవి యింత చౌకగ విజయము చేకూరుటచే ప్రసన్నురాలు కాలేదు. ఆమె తనమనోవ్యథ నింకను పూర్తిగ వెడలగ్రక్క లేదు.

'ఔను. బయలుదేరుదురు. ఏల బయలుదేరరు? అదే మీ కోరిక. ఇక్కడనుంటే డబ్బు ఖర్చయిపోదామరి? తీసుకొనివెళ్ళి యీ నరకకూపములో పడవేయండి. ఎవరు చచ్చినా బ్రతికినా మీకేమి? ఒకతెపోతే ఇంకొకర్తు వస్తుంది. నవనవలారత్నము. మీయదృష్టమే యదృష్టము! దేవుడు నన్ను తీసుకునేనాపోడు! ఈపీడ మీకు వదలు టకు' అనెను.

అమరకాంతుడు 'ఆత డేదేని చిలిపిచేష్ట చేసెనా? లేక ఆమెది మిథ్యారోపణయేనా' యని ప్రశ్నించెను.

మున్నీముఖము నావలివైపునకు దిప్పుకొని చిరునగవుతో, 'లాలా! నీబుద్ధి చాలా మందబుద్ధి. ఆపిశాచి నాపై నారోపణచేసినది. పాప మతడామె యేమనునోయని సగము చచ్చియుండెను. వినతి చేసెను. ప్రార్థించెను. కాని యామె యెంతటికిని సమాధానపడ లేదు.

ఆయువిద భర్తను క్రీగంటిచూచుచు, 'భగవంతుడు నాకూ కళ్ళిచ్చినాడు. గుడ్డిదాన్ని కాదు. నే నింట్లోపడి యేడుస్తుంటాను. మీరు బయట విలాసముగ ననుచితవ్యాపారములు సాగించుచుందురు. ఉబుసుపోక కేదో వ్యాపారముండవద్దా?' అనెను.

క్రమశః నాకీరహస్యము బోధపడజొచ్చినది. వెంటనే యామె ముఖము తగులబెట్టవలెనని తోచినది. నేను నీయొద్ద నేమీ దాచుట

లేదు లాలా! నే నాతనివంక నెన్నడు తేఱిపాఱచూడనైనలేదు. కాని యాభూతిము నాపై నిష్కారణముగ నిందమోపినది. ఆతనివ్యంగ మోటమిపగానిచో నే నాదయ్యపు స్వభావమును చేసియుందును. సూది గుచ్చని చోట నాగేటికర్ర గుచ్చసాగినది.'

తుదకామెభర్తకును కోపమువచ్చెను.

'నీపలుకులు శుద్ధయసత్యములు. వట్టికల్లలు' అనె నతడు.

'నే నబద్ధము లాడుచున్నానా'

'ఔను! వట్టిఅబద్ధములు.'

'మీపిల్లవానిమీద నొట్టుపెట్టుకొనుడు'

నేనప్పుడు మిన్నకయుండవలసినదే కాని యన్యాయము చూచి సహింపనేరని నామన సెట్లూరకుండనిచ్చును? నాముఖము క్రోధముచే కందిపోయెను. నే నామెయెదుటికి జని, 'చాలునమ్మా! ఊరుకో! లేనిచో మాటదక్కదు. నే నూరకున్నకొలదీ నీవు నెత్తెక్కుచున్నావు నీవేమో దొడ్డదానవని పెద్దమనిషివని యెంచి మిన్నకొనుంటిని. నీవిట్టి దానవని తెలిసియున్నచో నీ నీడనుండి కూడ దూరముగ తొలగి పోయెడిదానను. నేను కులటనుగాను. అనాథనుకాను. నీదయకల్మి, నాకును పతియు, పుత్రుడునున్నారు. కర్మవిలాసకారణమున నేనిచట నేకాకిగనున్నాను. నీభర్త నాపతికాళ్లు కడుగుటకైన నర్హుడు కాడని నా విశ్వాసము. నేను నా స్వామిని పిలిపింతును. నీవే చూతువుగాని ఇక నేటికి చాలు. రేపటిదాక నిలుపుము.

ఇంకను నానోటిమాట పూర్తియవకమున్నే నాభర్త తనయు నెత్తుకొని, యంగణమునసిలచి, నన్ను చూచినంతనే చటుక్కున నా వంకకువచ్చెను నే నతనిని చూచుటతోడనే సింగమును చూచినంత గాబరాపడి, తటాలున గదిలోదూరి తలుపుమూసికొంటిని. గుండెదడ దడలాడుచుండెను. కాని తలుపుసందులోనుండి చూచుచునేయుంటిని. నాస్వామి తనముఖమును సంబాళించుకొనెను. శిరోజములపై ధూళి

గ్రిమ్మియుండెను. వీపున కంబళి, మూటయుండెను. చేతనొక కర్ర పట్టుకొని యాశ్చర్యవివశుడై నిలచియుండెను.

అవర్తకుడు నాపతిని సమీపించి 'మీరామె భర్తకాబోలు! సమయమునకు వచ్చినారు. మేమిప్పుడే మీవిషయమై ప్రసంగించు చుంటిమి. రండు! మూట మల్లెనిచట పెట్టుడు. కాని మా చెల్లెలులోని కేటికి పారిపోయినది? ఈపోరుగూరిలో చాలేమి?' అనెను.

నీవు నాస్వామిని చూచియేయుంటివికదా లాలా? ఆమెభర్త నాపతిముందు ఆబోతుసమక్షమున నా పెద్దువలెనుండెను.

నాపతి యతనికి బదులు చెప్పలేదు. నేనున్నగదితలుపును సమీపించి, 'మున్నీ! ఇదేమి యన్యాయము? మూడునాళ్ళనుండి నీకొర కన్వేషించుచుంటిని. నేటికి దొరకితివి. కాని, లోనికిపోయి కూర్చుంటి వేటికి? దేవునిముఖముచూచి, తలుపు తెఱచి, నాదుఃఖకథనము నాలిం పుము. పిదప నీయిచ్చవచ్చినట్లు సేతువుగాని' అనెను.

నా కనుకొలకులనుండి జలజల నశ్రులు రాలసాగెను. కవాటము తెఱచి, నా తనయుని బిగియార గౌగలించుకొన మనసు తొం దరపెట్టజొచ్చెను.

కాని చిత్త మేమూలనుండియో 'జాగ్రత్త! పిల్లవాని నెత్తు కొందువేని' యని వారించుచున్నట్లయ్యెను. పిపాసార్తుడు జలకలశ మును గాంచి లంఘింప, నెవరో యీజలము మిథ్యయని పలికినట్లు తోచెను. మనస్సు 'భర్తననాదరణ సేయకు! ఈశ్వరకల్పితమగుపత్నీ, మాతల బంధనము త్రెంచుకొన నెవరికైన సాధ్యమా?' యని ప్రబోధించుచుండెను. చిత్తము 'నేడు నీవు పతిని పతియని, పుత్రుని పుత్రుడని, వాకొనజాలవు. క్షణికమోహావేశమున బడిపోయితివేని వారిరువురకు గొప్ప మచ్చ దెచ్చిపెట్టుదువు' అని చెప్పుచుండెను.

నేను తలుపు విడచిపెట్టివైచి నిలబడితిని.

పాపడు తనచిన్ని చేతులతో తలుపును దీయుమని చెప్పుటకు యత్నించుచుండెను. 'తలుపు తీయు' మని.

ఆశిశుభాషణము లెంత మధురములు! సబ్బతయందేదేని యను మానముకలిగి భీతి యుదయించిన, దానిని తొలగించుకొనుటకు మనము గానము సేయసాగి, మనశబ్దమునే మనకు సహాయమని భావించుకొని తృప్తినొందు వడువున, నాయుబుకుచున్న ప్రేమను నేనాసమయమున నణచుకొన బ్రయత్నించుచు, మీరెందుకు నావెంట బడినారు? నేను మరణించితినని యేలభావింపరు? సపుత్రులై యుండికూడ మీచిత్త మింతకష్టము సహింపలేదా? ఒక తుచ్ఛనారికొరకు మీరు మీకుల మర్యాదను గంగపాలొనరింతురా? వెళ్ళి మరల పెండ్లిచేసికొనుచు, బాలుని పోషించుకొనుడు. ఈజీవితమున మనకిక సంబంధము లేదు. ముందుజన్మలో మీరే నాకు తిరిగి లభింతురుగాక యని వేడుదును. మీరు నాదృఢసంకల్పము నేటికి భగ్నము సేతురు? నా హృదయము నేటికి మోహములో బడవైతురు? పతితను గూడి మీరు సుఖింప జాలరు. నాయెడ దయజూపుడు. నేడే వెడలిపొండు. అట్లొనర్పరేని విషపానము జేసివైతును' అని చెప్పివైచితిని.

నాస్వామి నన్ను కరుణాపరోధముతో 'నేను నీకొరకు నాకుల గౌరవము, బంధుకోటి, నన్నింటిని విడచివేతును. నాకెవరిలక్ష్యమును లేదు. ఇల్లు తగులబడిపోయినను నాకు చింతలేదు' నిన్ను వెంటగొని పోనైన పోయెదను, లేక యిచట గంగలో పడిపోవనైన పడిపోయెదను. నీవు నావెంట రానిచో పిల్లవాని నిచ్చట నీకప్పగించి పోయెదను. వానిని పెంచుకో, చంపుకో! నేను నీదరికిక నెన్నడును రాను. ఎన్నడైన నాస్మృతిగలిగిన దోసెడు నీళ్ళు వదలుము' అని చెప్పెను.

నేనెట్టి పెద్దసంకటములో పడియుంటినో యూహింపుము లాలా! నాభర్తకు వాక్యసంపత్తికి లోటులేదని నే నెరుగుదును. ప్రాణముల నాతడెంత తుచ్ఛములుగ గణించుచుండునో నాకు తెలియును. ఐనను

నాగుండె రాయి చేసికొని, 'మీరు బాలు నిచటవదలివెళ్ళినచో వాని హత్యకు మీరే బాధ్యులు కాగలరు. ఏలనన, నేను వాని దుర్గతి నాలోకించుటకు జీవించియుండనేరను. వీని పోషణభారము మీయది. మీకర్తవ్యము మీకు గుర్తింపుడు. నాజీవితమున నేదేని సుఖముండిన నది నాభర్తయు, పుత్రుడు జీవించియుండిరను నాశయే. మీరు నాకా యణుమాత్రపు సుఖమును లేకుండ చేయనెంచినచో చేయుడు. కాని జ్ఞప్తియందుంచుకొనుడు. ఇదియే నాబ్రదుకుకు జీవగఱ్ఱ'యని అంటిని.

నాపతి చంకనుండి క్రిందికిదించిన బాలకుని మరల నెత్తుకొని, వెనుకకు తిరిగిపోయెను. వానికన్నులనుండి నీరు గారుచుండుట, వాని పెదవులు కంపించుచుండుట నా కగపడెను.

ఆవణిగ్వంశజ నాభర్తను గౌరవార్హునివలె నాహ్వానించి, కూర్చుండబెట్టి, 'ఏమైనది? ఏటికి కోపించిన' దని ప్రశ్నింపజొచ్చెను. కాని నాపతి నోరు విప్పలేదు. ప్రత్యుత్తరమీయలేదు. ఆతని నామె భర్త వీధిద్వారము వరకు సాగనంపనేగెను. వారిరువురు నేమి మాట లాడుకొనిరో చెప్పలేను కాని, యావర్తకుడు నా ప్రశంస గావించి యుండును. అప్పటికి నాపతి యాత్మహత్య గావించుకొనునేమోయను భీతిచే నాహృదయము కంపించుచుండెను.

ఆ వణిగ్వరుడు తిరిగి వచ్చుటతోడనే నెమ్మదిగ తలుపు తెరచి 'ఎక్కడికి వెళ్ళినారు? ఇంక నేమైన ననెనా?' యని యడిగితిని.

ఆతడు వెగడికతో చూచుచు, 'ఏమనును? వానినోటనుండిశబ్దమైన వెలువడెనా? దుఃఖము బిగబట్టి వెడలిపోయెను! ఇంతవరకు కుశలియై యున్నాడు. నీవింత దయామతివయ్యు నింతకఠోరముగ వర్తింతు వనుకొనలేదు. పాపమతడు శిశువువలె వెక్కి వెక్కి యేడ్చుచుండెను.

ఒకమానిసిపరులను కూడ తనవారినిగనే తలచునట్టి విపదావస్థ యందుండుటచే వానిని కసరుకొనుచు, 'ఇంతలోనే పరుగెత్తుకు వచ్చి

వేసిరి. రవంతసేపు వారితోనున్న మీకు పరువు తక్కువకాదు. కాక, మీభార్య నెవ్వరూ యెత్తుకొనిపోరు. వారికి ప్రస్తుతము మనస్థిమితము లేదు కాని మీరు వచ్చివేసినారు' అంటిని.

ఆయన సతియు 'పడిపోయినట్లు పరుగెత్తుకురాకపోతే యెవ రెరుగుదురు. నే నెచ్చటికేనా ఉడాయిస్తానేమో! రండి ఇంట్లోకూర్చొనండి! నేను వెళతాను. వానినిపట్టి యీడ్చుకురాకపోతే నా తండ్రికి పుట్టనట్లే' అనెను.

సత్రమునందు దాదాపిరువదిమంది యుండిరి. వారెల్లరునుద్వారమునందు నిలచి యాచోద్యము చూచుచుండిరి ఆమె బయలుదేరిన తోడనే యామెవెంట నైదారుగురు తోడుగ జనిరి అరగంటలో వారు తిరిగివచ్చిరి. నాపతి స్టేషనువంక కేగెనని తెలిసెను.

కాని నాకాయన బండినెక్కువరకు నూరటయెక్కడ? బండి యుదయమున వచ్చును. ఆరేయి వారు స్టేషనులోనే గడుపుదురు. చీకటిపడినవెనుక నే నచ్చటి కేగితిని. ఆయనసమీపమున నొక వృక్షచ్ఛాయలో కంబళము పఱచుకొని కూర్చుండియుండెను. బాలకుడు గ్లాసుకు త్రాడుకట్టి బండిగాచేసి లాగి యాడుకొనుచుండెను. నే నొక చెట్టుచాటున నిలచి యీచిత్రము నరయుచుంటిని. పలువిధములగు భావములు జ్ఞప్తికి రాదొడగెను. బంధువులభీతి యున్నది. నేను వేరొండుతావున నాభర్తతో కాపురముచేయుదో, బంధువులేమిచేయగలరు? కాని మునుపటి మున్నీని కాగల్గుదునా?

ఒకింతవడి కదియేకల్పన. నాస్వామి తనహృదయము విశుద్ధమని నుడివియుండెను. కపటవ్రాగచన వానికలవాటులేదు. అట్టివాడు నాకు నచ్చుమాట లేలపలుకును? మృతకళేబరమును గొయ్యినుండి వెలికి దీయుటతనికభ్యాసము లేదు. వారు నన్నెంత ప్రేమించుచుండిరి! నేటికిని వారిహృదయ మట్టిదే! నేను వ్యర్థసందియముంతో వాని జీవితమును నాబ్రతుకును ధ్వంసమొనర్చివైచుచున్నాను. కాని...కాని

నేను పూర్వపుదానను మఱల కాగలనా? కాజాలను ఎన్నటికిని కా నోపను.

పతిదేవుడు నన్ను పూర్వముకన్న నెక్కుడుగ నాదరించును. పాలకుండ పగులగొట్టినను నన్నేమియు ననడు. ఆయన నన్నంతగా ప్రేమింపగలడు. అది నే నెరుగుదును. కాని యిప్పుడు మునుపటి సంగతి యెట్లు వచ్చును? ఇక నాదశ యెట్టి యాహారమును రుచింపని రోగిదశ యైపోవును.

అయిన నే నేటికి జీవించియుండవలెను? ఎట్టిసుఖము, నెట్టికామ నలు లేనిపట్టునమనియుండుట వ్యర్థము. కొన్నిదినములపాటు వడ్చినను దానివలన ఫలమేమి? ఏ కళంకము సహింపవలసియుండునో? ఏదుర వస్థ ఘటిల్లునోపునో యెవ్వరెరుగుదురు? దానికన్న మరణమేమంచిది.

ఇట్లు నిశ్చయించుకొని నేను లేచి నిలబడితిని. కన్నెదుట పతి దైనమునిద్రించుచుండెను. బిడ్డడును నిద్రించుచుండెను. ఓహో! లోభికి ధనమువలె నెంత ప్రబలబంధనము! లోభి తిననూ తినడు. పరులకు పెట్టనూ పెట్టడు. వానికి ధనమున్నదనుటకన్న నేమి యానందము కలదు? ఆమాటమాత్రముచేత నతనికెంత బలమువచ్చును? నేనిట్టి మోహముద్రించి వేయనుంటిని.

నేను భయపడుచు, పడుచు, కన్నులలో ప్రాణములుపెట్టుకుని పతిదేవుని సమీపించితిని. ఒక్కక్షణకాలమైన నచట నిలువలేకపోతిని. అయుసాక్రాంతముచే నాకర్షితమగు సినుపశలాక దానికెట్లు హత్తుకొ నునో, నేను నేతెద్ధ్వముగ నాపతివంక కీడ్వఁబడుచుంటిని. నేనుహృద యమును కుదురుపరచుకొని, యామోహమును ఛేదించివైచి యావే శముతో గంగాతటమునకు బరుగిడితిని. మోహమప్పటికే మనసును హత్తియుండెను. నేను గంగయందు దూకితిని.

అమరుడు విషాదగ్రస్తుడై 'ఇక నిప్పుడు వినుట నా వల్లకాదు మున్నీ! ఇంకొకప్పుడెన్నడైన చెప్పదువుగానిలే' అనెను.

మందహాసమొనరించుచు మున్నీ! 'హా! హా! ఇక చెప్పుటకు మాత్రమేమున్నది? కొంతకాలము నీటిలో నుంటినో చెప్పనేరను! కాని, స్పృహవచ్చునప్పటికీయింటనుంటిని. నేను కొట్టుకొని పోవుచుండ, ప్రాతఃకాలమున చౌదరీపెద్దకుమారుడు సుమేర్, స్నానముచేయుటకు గంగకువచ్చి, కొట్టుకొనిపోవుచున్న నన్నుచూచి, నీటిమండి వెలువరించి, యింటికి జేర్చెను. అప్పటినుండి నేనిచటనేయున్నాను. అస్పృశ్యుల యీచిన్నికుటీరమున నాకొదవిన శాంతియెంతని వర్ణింపగలను! కాశీ, పయాగ్‌లిరువురు నన్ను వదినె యందురు. కాని సుమేర్ నన్ను సోదరియని సంబోధించెడివాడు. నాకు బాగుగ లేదను, తిరుగను శక్తి రాకమున్నే యతడు స్వర్గపథగామియయ్యెను.

అమరునిహృదయమున నొక కంటకము వేదించుచుండెను. అది కొంచెము వైదొలగెను కాని యింకను పూర్తిగ విడువలేదు.

'సుమేరు నీపై మరులు గొనియుండెనుగాదా?' యని యడిగెను. మున్నీకి కోపమువచ్చెను. 'ఔను! అత్యధికముగనే ప్రేమయుండెను. కాని అది నావశమున నేమున్నది? నాకు నెమ్మదించిన పిదప నతడు తనప్రేమ నాకెరిగించెను, నేను కుపితహాసమగ్ననై 'నీవీ రూపమున నుపకృతికి ప్రత్యుపకృతి నభిలషించుచుంటివా? ఇదే నిజమైనచో తిరిగి నన్ను గంగలో పారవేయుము. నీవీ యభిప్రాయముతోనే నాప్రాణరక్షణ మొనరించియుంటివేని, చాలయన్యాయముచేసియుంటివి. నేను రజపుత్రవంశజను. ఇక నెన్నడైన నాతో నిట్టి ప్రసంగమొనర్చితివేని గంగ యెంతోదూరమున లేదు.' అని చెప్పివైచితిని సుమేర్ సిగ్గుపడిపోయి నాతో మాటలాడుటయైన నొనర్పకుండెను. కాని నా వాక్యములు వాని కాశాభంగ మొనర్చెననుట నిజము.

ఒకదినమున నాకు డోక్ర్యాలో పోటువచ్చెను. సుమేరది భూతావేశమున నసితలచెను. మాంత్రికుని తోడుకొని రానేగెను. నడపోగి

యుండెను. ఆతడందు మునిగిపోయెను, వానిమరణము నాకు సహజమ్మని వినియోగమున గలిగినంత ఖేదము జనించెను. అధమజాతుల్లో కూడ నిట్టి దేవతలుందురని నేనిచ్చటికి వచ్చినపిదప తెలియజాలితిని. ఆతడు మరికొంతకాలము బ్రతికియుండిన నీగృహముయొక్క భాగ్యము పండెడిది. గ్రామమంతటికి నతడు సేవకుడై యుండెను. ఎవ్వరేని ధూషించినను, బెదరించినను, కూడ నెన్నడు బదులుచెప్పడు.

అమరుడు 'అప్పటినుండి నీకు నీపతి, పుత్రుల సమాచారమేమైన తెలిసెనా?' అనెను.

మున్నీ కన్నులనుండి జలజల యశ్రుబిందువులు రాలదొడగెను. దుఃఖాతిశయమున కంఠావరోధము గల్గెను. కాని వెక్కి వెక్కి ఏడ్చుచు బహు ప్రయత్నపూర్వకముగ వచింపదొడగెను.

నాస్వామి యుదయమున మరల సత్రముని కేగెను. రేయి యందు నే నచటికి రాలేదని తెలిసికొని నన్న న్వేషింప బైలుదేరెను. ఎందెందు నాజాడ తెలియుచుండెనో, యచటికి పోవుచుండెను. ఒక నెలదినములపాటూ ప్రాంతమెల్ల వెదకుచు తిరిగెను. ఈనైరాశ్యము, చింతలచే వానికి సతిభ్రమము కలిగెను. క్రమ్మఱ హరద్వారము జేరెను. కాని యీపర్యాయ మతనిసందిట బాలకుడు లేకుండెను. ఎవ్వరైన నీసుతుడేమయ్యెనని ప్రశ్నించిన నవ్వుచుండును. నాకు బాగుగ నారోగ్యము కలిగి, తిరుగ శక్తి కలిగినవెనుక నొకనాడు నా వస్తువులగతి యేమయ్యెనో తెలిసికొన బుద్ధిపుట్టెను. మూడు నెలల కన్న నెక్కుడుకాలము గడచిపోయెను. వస్తువులు దొరుకునను నాస లేకుండె గాని, యీవ్యాజమున నాపతిజాడ లరయవచ్చునని వాంఛ ముమ్మడించెను. ఒక కమ్మవ్రాసి పడవైతునా యను నాలోచనయు నుండెను. సత్రమును సమీపించితిని. పెక్కుఱు జనులు ప్రోగుపడుట గానవచ్చెను. నేనును సమీపమునకు వెళ్ళితిని. ఒకశవమచ్చట పడి యుండెను. ప్రజలు 'ఆపిచ్చివాడే తన భార్యకొరకు వెదకికొను చుం

జెడి యూపిచ్చివాడే" యని చెప్పుకొనుచుండిరి. నేనానవాలు పట్టితిని. అతడే నాపతియని, తక్కినసంగతులెల్ల చుట్టుప్రక్కలవారివలన తెలిసెను. గుండెలుబాదుకొనుచు నిలచియుంటిని. ఏ సర్వనాశనమునకై వెఱచుచుంటినో యదియె జరిగిపోయెను. కాని యిట్లు సంభవించునని తెలిసియుండిన, నాతనితో పోయియేయుందును. ఈశ్వరుడునాకు ద్విగుణీకృత శిక్షనొసగినాడు. కాని మనిషిజన్మ పట్టిసిగ్గుమాలినది. ఇప్పుడు చావనులేకుంటిని, ఏమిచేసిచత్తును? ఏమియూ జరిగియుండనట్లుతినుచున్నాను, నవ్వుచున్నాను, పలుకుచున్నాను, చాలునిక! ఇదియేనాకారామకథ.

---

# కర్మ భూమి

## 3వ భాగము

### —: 1వ ప్రకరణము :—

లాలానమరకాంతుని జీవితమునందలి సంకల్పములెల్ల మంటిపాలయ్యెను. తనజీవన సంధ్యాకాలమున తనసర్వస్వమును కుమారుని వశమొనర్చి, తనయకుద్వాహముగావించి, యెద్దియేని యేకాంతస్థలమున భగవన్నామస్మరణ యొనరించుకొనుచు గడుపవలెనని యాతడాసించుచుండెను. కాని వానికామితములు మనసులోనివి మనసులోనే యుండిపోయెను. అత డంతిమశ్వాసవఱకు విశ్రాంతిగైకొను వ్యక్తికాడనుట వాస్తవమే. తనయుడు పెద్దవాడగుచున్నకొలదివాని కోరికలీరికలెత్త సాగెను. మధ్యమధ్య నమరకాంతుడు దారిలోనికి వచ్చుచున్నట్లగపడెను. కాని వానియభివృద్ధి భ్రష్టయిపోవునపుడిక యాశలకు తావేది? అమరునివిషయమున నెట్టిదోషములున్నను వానిచరిత్రనుగూర్చి మాత్ర మెట్టియనుమానమును లేకుండెను. కానికుసంగతిలోబడిపోయి, యతడు

ధర్మచ్యుతుడయ్యెను, శీలమును చెఱచుకొనెను, కులమర్యాద నాశము గావించుకొనెను. లాలాజీ కుత్సితసంబంధ మంతచెడ్డదని భావింపడు. ధనాఢ్యులలో నట్టి ప్రథ ప్రాచీనకాలమునుండియు వచ్చుచునేయున్నది. ఇట్టివిధమున క్రీడలనుభవింపని వాడెట్టిధనికుడు? కాని ధర్మత్యాగమున కొడిగట్టుట సాంఘికమర్యాదలను చూంచుచు, భ్రష్టుగావించుట యనునది వెర్రితనము, విశేషించి గార్దభకృత్యమును!

సమరకాంతుని వ్యావహారికజీవనము వాని ధార్మికజీవనమునకు పూర్తిగ దూరము. వ్యవహారవ్యాపారములయం దతడు వంచన, కౌటిల్యము, నన్నియు క్షమ్యములనియె భావించును. వర్తకములో, జొన్నలు ప్రత్తివిత్తులయందు, ధాన్యమున సన్నకంకర రాళ్ళు, నేతియందు దుంపనెయ్యి, మొదలగునవి కలుపు టాదికృత్యములు ఔచిత్యబాహ్యములుకావు. కాని స్నాన మొనర్పకుండ నతడాచమనమైననే యడు. ఈ నలువదియేండ్లకాలములో నతడు సంజవేళ నారతిదీసికొనని, శిరమున తులసిదళము ధరింపనిదియు నొక్కదినమైనలేదు. ఏకాదశీదివసమున నిర్జలోపవాస మొనర్చును. సారాంశ మెద్దియన, వాని ధర్మము జీవితమున నీషణ్మాత్రప్రయోజనమైన లేని యాడంబరము!

సలీము గృహమునుండి తిరిగివచ్చుటతోనే లాలాయొనర్చిన మొదటిపని సుఖదను జాడించివైచుట, పిదప నైనా వంతువచ్చెను. ఇరువురిని యేడ్పించి, తన గదియందుజొచ్చి, యతడు స్వయముగ నేడువ సాగెను.

ఆనాటిరాత్రియందే యీవార్త పురమందెల్లెడల వ్యాపించెను. ప్రజలు పరిపరిసిధముల జెప్పుకొనుచుండిరి. పగలెల్ల సమరకాంతుడు గృహమువిడచి బయటి కేగలేదు. తుదకు గంగాస్నానము నేయుటకైన జనలేదు, ఒకఋణస్థుడు పైకము చెల్లింపవచ్చెను లేఖరి లాలాచేత రసీదుపై సంతకము పెట్టించుకొనబోయెను. లాలాజీ వానిని కసరి కొట్టెను. పాపామా లేఖరి నోరుమూసికొని బయటికి వచ్చివైచెను.

ఋణస్థుడు సొమ్మునీయకయే పట్టుకొనిపోయెను. సేవకుడు ధూమపానము సేయ 'గుడిగుడీ' తెచ్చి వానిముందుంచెను. లాలా గొట్టము నోటబెట్టనైనలేదు.

పదిగంటలకు సుఖదవచ్చి "మీరేమి భుజింతు"రని ప్రశ్నించెను, లాలా యామెవంక చుఱచుఱ చూచుచు "నాకాకలిలే"దని చెప్పివైచెను.

సుఖద వెడలిపోయెను. ఆనాడెవ్వరుకూడ భోజనములు ముట్టలేదు.

రాత్రి తొమ్మిదిగంటలకు నైనావచ్చి "నాన్నా! గుడికిపోరా?" అని యడిగెను.

లాలా యులికిపడి "ఆఁ ఆఁ ఏటికివెళ్ళను? మీరేమైనా తిన్నారాలేదా?" అని ప్రశ్నించెను.

"ఎవరికిని హితవు లేకుండెను. ఎవరు తిందురు?"

"అయితే వానివెంట నింటెడుమందీ ప్రాణము లర్పిస్తారా?"

సుఖద యీసమయమున సిద్ధమయ్యెను" మీరే ప్రాణము లర్పించుచున్నపు డితరులపై కోపగించుకొనుటకు మీకేమి యధికారమున్నది?" అని ప్రశ్నించెను.

లాలాజీ దుప్పటము కప్పుకొని, యిల్లు విడచి బయటికరుగుచు "నేనేమి శరించినా నాప్రాణములు వీడుదునని? ఇచ్చట నుండినను దానివల్ల నాకేమిసుఖముండేది? కొడుకుసుఖము నేనెఱుగనే యెఱుగను. అప్పుడూ బాధపెట్టేవాడు. ఇప్పుడును బాధించుచున్నాడు. వెళ్లు, వంటచెయ్యి. వచ్చి భోజనము చేస్తాను. ఉన్నవారికి పోయినవారి లోటు పూర్తిచేయుటవిధి. నే నెందుకు ప్రాణము వదులుతాను? నేను కొడుకును కన్నాను. వానికి పెళ్ళి చేసినాను. సంసారమంతా నేనే చక్కబఱచినాను. వానిని వెడలనడచినభారము నాపైనున్నది. నే నింకా చాలకాలము బతుకవలసియున్నది. కాని ఆ దుఃఖమునకిగ నొట్టుబోలి

సదో నాకు బోధపడకున్నది. పతానిని మనుమరా లప్పరసకాదు. కాని అంతగా వాడేటి కామెవెంటబడినాడు ? వానిస్వభావ మట్టిదికాదు. దీనికే భగవంతునిలీల యంటూరు'' అనెను.

దేవళమున పూజసమావేశమై యుండెను. లాలా సమరకాంతుని చూచుటతోడనే యొకసజ్జనుడు అపురు డెక్కడికేనా పోయినాడా లాలాజీ! ఏమిజరిగినద''ని ప్రశ్నించెను.

లాలాజీ యాప్రసంగమును ఖండించివైచుచు "ఏమీలేదు. వానికి చాలకాలమునుండి దేశాటనేచ్ఛ యుండెడిది. పూర్వజన్మలో తపస్వియై యుండినవాడు. వానియిష్టమే సాగినచో నాయిల్లంతా దోచి పెట్టెడివాడే. నేనది చూడనేరకుంటిని. ఇదే తగవు, నేను దారిద్ర్యము యొక్క కష్టమనుభవించితిని. ఏడాదో, ఆరుమాసములో దానిరుచి యొక్కింత అనుభవమయినచో కండ్లువిడును. అప్పుడతనికి ప్రపంచసేవ తనదగ్గర డబ్బున్నవాడే చేయగలడని బోధపడగలదు. ఇంట కూటి కాధారములేకున్నచో నేసభ్యత్వమునూ రాదు'' అని చెప్పెను.

ఆపైన వానినడుగుట కెవరికిని సాహసము లేకుండెను. కాని మూర్ఖుడగు పూజారి "ఎవతెయో తురకబీబీ వలలో దగుల్కొనె నని వింటిమే!'' అనెను.

ఆ తెలివితక్కువ ప్రశ్నవిని, యచటివారెల్లరు నాలుకలు కఱచు కొని, ముఖముల నవ్వులివంకకు దిప్పుకొనిరి. లాలాజీ యాపూజారి వంక రక్తారుణనేత్రములతో చూచుచు; "ఔను! చిక్కుకున్నాడు. ఆపైన? కృష్ణభగవానుడు వేయిమంది రాణులతో వినోదించలేదా! శంతనమహారాజు జాలరిపడుచుతో క్రీడింపలేదా! వాడొనర్చినదేమీ క్రొత్తసంగతికాదు. నీవంటివారి కిదియే ప్రత్యుత్తరము. ఇంట నప్సరస వంటి యిల్లాలుండగా పుల్లివిస్తరాకుల కొఱకెవడు ప్రాకులాడును!'' అని మోహనభోగము నారగించువాడు "తాలింపుశనగలకు తంటాలు పడడు.''

అనుచు లాలాజీ దేవుని విగ్రహసాన్నిధ్యమున కరిగెను. కాని వాని మనసునందు నేడంత శ్రద్ధ లేకుండెను. దుఃఖితు డార్తిచేత నీశ్వ రునియందు భక్తిగలిగియుండును. సుఖియన్ననో, భయముచేత దుఃఖ భాజినున కెంతకష్టములువచ్చిన, నంతభక్తి వృద్ధియగుచుండును. సుఖికి దుఃఖము ప్రాప్తించిన, నతడు విద్రోహము సేయదొడగును. ఈశుడును తనధనముమందు సాగిలపడవలెనని వాడు కోరుచుండును. వ్యధితహృద యము కాంచన, కలధౌతముల యలంకారములచే మెఱయుచుండు ప్రతిమలు, ధైర్యసంతసములకు సందేశము వడయనేరకుండెను. నేటి దనుక, వానికా ప్రతిమయే బలము నుత్సాహమును బ్రసాదించు చుండెను. ఆప్రతిమ కతనికి పదగ్రస్థహృదయము విద్రోహము సేయు చుండెను. వానిభక్తికిదియే పురస్కారము! వాని స్నాన, వ్రత, నిష్ఠల కిదియే ఫలము!!

అతడు వెడలిపోవుచుండగా పెద్దపూజారి "లాలాజీ! ఇప్పు డిచ్చట వాల్మీకీయకథాకాలక్షేపము జరుగుచున్న" దనెను.

లాలా వెనుకకుతిరిగి 'సరే! కానిమ్ము" అనెను.

ఒకసత్పురుషుడు "ఇచ్చట నేరికి నంతమాత్రము శక్తి లేదు. మీరు ధైర్యమిచ్చినచో జరుగగల" దనెను.

సమరకాంతుడు సోత్సాహుడై "సరియే. దానిభారమంతా నేను వహించుటకు సంసిద్ధుడను. భగవద్భజనకుమించి ధనమునకు ప్రయోజన మేమున్నది?" అనెను.

వాని యుత్సాహముగాంచి ప్రజలు అచ్చెవడిరి. అతడు కృప ణుడు. ఏధర్మకార్యములయందును నగ్రసరుడు కాకుండెను. వారెల్ల రీతనినుండి పది, యిరువది రూపికలు లభించిన నెక్కువయని తలచు చుండిరి. అత డింతలోనే తనస్వభావమును మార్చుకొనుటచే ప్రజలు మఱింత యావేశముగలవారైరి. సేఠ్ ధనరామ్ "భారమంతా మీరే వహింపవలెననుట లేదు లాలాజీ! మీరు లక్ష్మీపుత్రులనుట నిజమే.

కాని యొరులకును భక్తికలదు. చందాలతో జరుగనిండ''నెను. సమరకాంతుడు ''అయినచో నితరులు తమలోతాము చందాలు వేసుకొనుడు. ఎంతలోటువచ్చిన నదియంతయు నేను పూర్తిగావింతు''ననెను.

ధనీరాముని కీమహాశయుడు చవుకగ వదిలిపెట్టడని జయమొదవెను. ''అట్లుకాదు. మీకెంతతోచిన నంతేవేయుడ''నెను.

సమరకాంతుడు వాడుకననుసరించి ''ముందు మీరువేయు''డనెను. కాగితము, కలము, సిరా తెచ్చిరి. ధనరామ్ 101 రూపాయలు అంకెవేసెను.

సమరకాంతుడు పూజారిని ''మీయూహాలు నీపనికెంతవ్యయమగుననియున్నది?'' అని ప్రశ్నించెను.

బ్రహ్మచారి మదింపు వేయిరూప్యములు.

సమరకాంతుడు కలముగైకొని ''999– అంకెవేసివ్రైచెను.

వెంటనే యతడచటనుండి వెడలిపోయెను. సత్యశ్రద్ధంగల కొంతనతడు ధనముచే పూర్తిగావింప నభిలషించుచుండెను. ధర్మమునకు క్షితికొంతవరకునగునోయాడంబరమునకువృద్ధియు నావరుసనే యగుచుండును.

---

## —: 2వ ప్రకరణము :—

అమరకాంతుని లేఖదీసికొని నైనా లోనికేగగనే సుఖద ''ఎవరు వ్రాసినది?'' అనియడిగెను.

నైనా లేఖనుచూచిన వెంటనే చదివివ్రైచెను. ''అన్నవ్రాసె'' నని చెప్పెను.

సుఖద ''మంచిది. వారు వ్రాసిరా! ఎచటనున్నారు!'' అని ప్రశ్నించెను?

''హరిద్వారము సమీపమున నేదో పల్లెయుందు''

ఇప్పటి కైదునెలలనుండి వారిరువురిమధ్య సమరకాంతుని చర్చ రాలేదు, అదియొక గాయమైనట్లు దానిని స్పృశించుటకేవారు భయపడుచుండినట్లును సుఖద తదనంతర మేదియునడుగలేదు, ఆమె పిల్లవాని కొరకు యుడుపుకుట్టుచుండెను, తిరుగ నామె కుట్టుప్రారంభించెను-

నైనా యాలేఖకు సమాధానము వ్రాయజనెను, ఇప్పుడేయామె కమ్మనింపివైచెను, నేటికైదునెలలకు నీకు నా జ్ఞప్తికలిగినది. అనుచు నేవేవి వ్రాయవలయునో వానినెల్ల వ్రాసి కొన్నిగంటలకు లేఖ పూర్తి చేసినది, అది యిదివరకే చదువరులు చదివియున్నారు, లేఖ ముగించి యామెవదినెకు దానినిచూపబోయెను, సుఖద యదిచూచుట యనవసరమని యెంచెను.

హతాశయై నైనా "నీవంకనుండి కూడ కొంచెము వ్రాయనా?" యని యడిగెను-

"వద్దు, ఏమీవద్దు"

"పోనీ నీచేతులతోనే వ్రాయుము"

"నాకు వ్రాయుటకేమీలేదు"

నైనా విషాదగ్రస్థయై వెడలిపోయెను, లేఖను తపాలాపెట్టెలోపడవైచెను. సుఖద కమరుని పేరన్నను కోపమే ఆమెగదియందు అమరుని ఛాయాచిత్రమొకటి యుండెను, ఆమె దానిని తీసిపాఱవైచెను. ఇపుడాతని స్మృతికలిగించుటకొక్కవస్తువైన నామెయొద్దలేదు, తుదకు తనయునిపై మమతకూడ తరిగిపోయెను, బాలుడిప్పుడు విశేషము నైనాతో యుండును, తల్లివానియెడ స్నేహమునకుమారు దయజూపుచుండును, గాని యీపరాజయమామెను హతాశురాలిగా నొనర్పలేదు, ఆమె యాత్మాభిమాన మనేకగుణము లతిశయించుచుండెను, ఆత్మనిర్భరము నొకకొంతయధికమయ్యెను, ఆమె యేరినైన నపేక్షింప నిచ్ఛగింపదు, ఆమె తన విలాసప్రియత సేవనమందో పోగొట్టుకొనినట్లుండెను, ఆమె స్నేహశాసనమునకుగాక యన్యశాసనమునకు విప్లవమొనర్చుచుండెను,

గాని, ఆశ్చర్యకరమగు విషయము సకీనాపై నామెకు లేశమాత్రము ద్వేషమును లేకుండుట సకీనాసహితము తనవలె లేక తనకన్న నెక్కుడు దుఃఖితయని యామె భావించుచుండును, తనకెంతయవయశము వాటిల్లినను పాపమామె యాదయారహితుని మాటేతలంచుకొని యేడ్చుచున్నది, ఆమె యున్మాదమిల్ల తొలగిపోవుచున్నది. తుచ్ఛులకు విశ్వాసమేమి? వేరొకపక్షి వలజిక్కినదేమో? సుఖదకామెను చూడవలెననిమి క్కటమగు కోరికయుండెను గానియోచించి యోచించి నిలిచిపోవుచుండెడిది.

ఒకనాడు పఠానినిచే నామెకు జబ్బుగా నుండెననువార్త దెలిసెను. నాడు సుఖద యామెను కలసికొన నిశ్చయించుకొనెను. నైనాను కూడ తీసికొనిపోయెను. పఠానిని మార్గమధ్యమున "నాతో నామె నోరువిప్పదు. మాటామంతీలేదు. మీకిల్లుచూపి యెచటికేనా పోయెదను. ఎంతో మంచిసంబంధము దొరకినది కాని యామె సమ్మతింపలేదు. నేను బ్రతికియున్నంతవఱకూ లాలాజీ యింట నది అడుగుపెట్టజాలదు. తమ వింతసంగతి యేమో చెప్పలేనుగాని" అని చెప్పెను.

"ఎన్నడైన వారియొద్దనుండి లేఖ వచ్చెనేని, ఆమె వెళ్ళిపోయిననేమిచేయుదువు ?" అని సుఖద ప్రశ్నించెను.

ఆవృద్ధురాలు గ్రుడ్లు పెద్దవిచేసికొని "అట్లుపోవుటకు సాహసమున్నదా ? రక్తము త్రాగివేయనా ?" యనెను,

తిరుగ సుఖద "ఆయన మహమ్మదీయులలో కలసిపోయినచో నీకేమి యభ్యంతరముండును?" అని యడిగెను.

పఠానిని చెవులుమూసికొని "ఓరికొడుకా ! యావజ్జీవము ఎవరియుప్పుదిని బ్రతికితిమో వారికొంపదీసి, యిల్లుకట్టుకొనవమా! అది మంచివాళ్ళపని కాదు. ఈ గుంటలో నేమిచూచి ఆ అబ్బాయి వశుడైపోయినాడో తెలియకున్నది" అనెను.

తనయిల్లు వారికిచూపి, పఠానిని పక్కనున్న యింటిలోనికి పోయెను. ఆజవ్వను లిరువురును సకీనా తలుపు తట్టిరి. సకీనా లేచి

కవాటము తెఱచెను. వారి నిరువురను చూచి సకీనా యెందైనా పారి పోవలెనని యభిలషించినట్లు తొట్రుపడసాగెను. ఎచటకూర్చుండ బెట్టుట ? ఏమిసత్కారము సేయుట ?

సుఖద "నీవు చింతింపకుము చెల్లెలా! మేమీమంచముమీాద కూర్చుందము. నీవెంతచిక్కిపోయినావు! ఒక విశ్వాసహీనుని తగుల ములోపడి ప్రాణము లర్పించెదవా ?" యనెను.

సిగ్గుచేత సకీనాయొక్క పాలిపోయినముఖ మెఱ్ఱబడెను. ఆమెకు సుఖద "నాపండువంటి సంసారము నేలపాడుచేసితివి?" యనుప్రశ్నకు సమాధానమునకై నిరీక్షించుచున్నట్లు తోచెను. సకీనాదగ్గర యీ ప్రశ్న కెట్టిజవాబును లేకుండెను. ఆనాటిఘటన యాకస్మికముగ నను కొనకుండగనే జరిగిపోయెను. ప్రథమమున నొక మేఘశకల మాకాశమున నొకకోన నగుపించెను. చూచుచుండగనే యాకసమెల్ల మేఘచ్ఛన్నమైపోయి, ప్రళయప్రభంజన సహితవృష్టి సంభవించెను. తానం దెగిరిపోయెను. ఎట్లు, లేమి, యెందుకు, జరిగెనో తానేమి చెప్పగలదు? చేరెడు మబ్బుతునకనుచూచి ప్రళయమగు తుపానువచ్చునని యెవ్వ రూహింపగలరు ?

ఆమె తలవంచుకొని "స్త్రీప్రశ్న యింక నెందుకుసోదరీ! ఎవనిని ప్రేమించుచుండునో వానిచే వంచింపబడుట స్త్రీకి సంభవించినచో నామె దురదృష్టవంతురాలు. ఆమె యిష్టమేమున్నది? కాని విశ్వాస ఘాతుకులపై ప్రేమజనింపని చో ప్రేమకుమాత్ర మేమిసుఖమున్నది? తగవులు, చర్చలు ,ఏడ్పులు, నిందలు, నిష్ఠురములు, అస్థిరత్వము, బలహీనత—యివి ప్రేమకు వినోదలక్షణములు. కాని నేనావేళకూడ విశ్వాసమును కాంక్షింపలేను. నేనప్పుడు సహితమాప్రచండఝం ఝామారుతము నాలుగైదుగడియలు పర్యంతమే నిలచునతిథియనియే యెఱిగియుంటిని. కాని, ఎవనిని నాహృదయమున నెల్లరకన్న నెక్కుడుగ ప్రేమించుచుంటినో, యాపురుషుడు తన ప్రేమకు నేనర్హ

రాలనని యెంచుటయే నాకు సంతృప్తి నొసగజాలెను. నేనాకాగితపు పడవనెక్కియే సాగరము దరింతును.

సుఖద యీ యువతిహృదయమెంత నిష్కపటమైనదో గ్రహింపగల్గెను. ఒక్కింత నిరాశచెంది "ఇవియే పురుషుల దౌష్ట్యము. ఆదియందు సాధుత్వమెల్ల తమలో మూర్తీభవించియున్న దేవతలట్లు కనబడుదురు. పిదప చిలుకలవలె పరాఙ్ముఖులగుచుందురు" అనెను.

సకీనా ధృఢచిత్తముతో "అక్కా! చేసినంతమాత్రమున నెవరును దేవతలు కాజాలరు, వయసున నీవు నాకన్న నొకటో, రెండో వత్సరములు పెద్దదానవే కావచ్చును. కాని నీకన్న నాకీవిషయములో ననుభవము మెండు. ఇది గర్వముచే చెప్పుటలేదు. లజ్జతో నే చెప్పుచుంటిని, పేదల బాలికలను దైవము సుందరులుగ సృజింపకుండుగాక! పేదఱికమున సౌందర్య ముపద్రవహేతువు. అచ్చటనల్పులకునుగూడ ప్రవేశము గలదనిన యధికులసంగతి వేరుగ వచింపనేల? మాయవ్వ వట్టి యమాయకురాలు. నన్ను దేవతగ నెంచుచుండబోలును. యువకు లెవ్వరిని గుమ్మమున కెదుట నిలువనైన నిలువనీయదు. కాని యిప్పుడు ప్రసంగము వచ్చినది కనుక చెప్పవలసి వచ్చినది. నాకు పురుషులను జూచుటకు, పరీక్షించుటకు తగినన్నియవకాశములు గలిగియుండెను. ఎల్లరును తమ మనోవాంఛలను దీర్చుకొనుటకు కర్హమగు వస్తువునని యెంచి, నాపేదరికమును జేసి తమయభిమతముల ప్రకటింపజూచిరి. ఏ యొక్కడైన నన్ను సగౌరవదృష్టితో చూచియున్న, నతడు బాబూజీయే, దైవసాక్షిగ చెప్పుచుంటిని. దౌష్ట్యదుర్గంధము నెలువడునట్టి ప్రశంసావాక్య మాయననోటినుండి యెన్నడూ రాలేదు, ఆయన నన్నెన్నడూ దోషభావముతో నావంక చూడలేదు. వారు నాకు నైవాహికపు విందును బహూకరించినారు. నేను నందుల కంగీకరించితిని. వారు స్వయముగ నెంతవఱకు తమవాగ్దానమును నిరాకరింపరో తావత్పర్యంతము, యావజ్జీవము నీవిధముగ

నాకు పడియుండవలసి వచ్చినను, నేను వారికధీననే. నాకు వారియం దట్టివిశ్వాసము జనించినది. నేను వారినామస్మరణయే యొనర్చుచు కాలము గడుపగలను. వారివెంట నేటికి పోకపోయితినని, నేటికీ పశ్చాత్తాప మొందుచున్నాను. వారితో నేనుండినచో వారికికొంతవిశ్రాంతి కలిగియుండెడిది. వారి కొక్కింత సేవయొనర్చియుందును. వారి కాకార వికారములచే వ్యామోహము కలుగజాలునంతమాత్రము నమ్మకము నాకున్నది. అప్సరస తారసిల్లినను, వారామెవంక కన్నెత్తనొల్లరు. కాని, ప్రేమ, పేదలవశీకరణశక్తి వారిని సులభముగ నాకర్షించివేయ గలదు. ఇదే భయము. అక్కా! నేను నీకు యదార్థమగు మనసుతో చెప్పుచున్నాను. మీయిరువురకు తిరిగి సమావేశమగుటయు, మీవైమనస్యత లంతరించుటయుగాక నాకు సంతోషదాయకమగు విషయము వేరొండులేదు, నే నట్టిసమయమున నింతకంటె నధికసంతోషముతో నుండెదను. వారివెంట నేను వెడలకుండుట కిదియే ప్రబలహేతువు. కాని దోషముగా భావింపవేని యొక్కమాట చెప్పెదను...

ఆమె పలుకుట చాలించి, సుఖద ప్రత్యుత్తరమును నిరీక్షించుచుండెను. సుఖద యూరడిలి బలికెను. "నీవింత నిష్కపటహృదయముతో పలుకుచుంటివి కావున, నీవేమిచెప్పినను నేను తప్పుగ నెంచను. యథేచ్ఛ నుడువుము!" అని.

సకీనా ధన్యవాదము లర్పించుచు "ఇప్పుడు వారిసమాచారము తెలియవచ్చినది కావున నీవొకపర్యాయము వారికడ కరుగుము. వారు సేవకు వశులు.నీవుసేవచేతనే వారినివశపఱచుకొనగలవు" అనెను.

"సరే. ఇంతేనా, ఇంకేమైనగలదా!" యని సుఖద ప్రశ్నించెను.

"ఇంతే, ఇంక నీకు నేనేమిబోధింపగలను? నాకన్న నీవెన్నో మదుంగులు తెలిసిన దానవు"

."వారు నాయెడ విశ్వాసఘాతుక మొనరించిరి, నే నట్టి నీచ మానవుని ప్రసన్నుని సేయజాలను. నేనే యెవనివెంటనైన లేచిపోయి

నచో నాయన నన్ను ప్రార్థింపవత్తురని నీవు తలంతువా? ప్రాయశః కుత్తుక ఖండించివైతురు. నేను స్త్రీని. స్త్రీహృదయమంత కర్కశము కాజాలదు. కాని, నాకొనయూపిరి యున్నంతపర్యంతము వారిని ప్రసన్నుల జేయనేరను" అని చెప్పుచు సుఖద లేచి నిలుచుండెను. అవసరమైనదానికన్న నధికప్రసంగముచేసి యామె కేటికాగ్రహము గలిగించితినని సకీనా పశ్చాత్తాపపడెను. ద్వారమువరకు క్షమభిక్ష నర్థించుచు సాగనంపెను.

ఉభయులు నశ్వశకటము నధిరోహించి, యందాసీనులైనపిదప నైనా " వదినా! నీకు సులువుగా కోపము వచ్చివేయునమ్మా!" యనెను.

సుఖద తీక్ష్ణస్వరముతో "నీవక్లే యందువు, నీయన్నల్ల చెల్లిలివికావా? ప్రపంచమున నట్టిపతిని ప్రతిమాలుటకుపోవు స్త్రీ యెవతె యుండును? అగును. బహుశః సకీనా వెళ్ళునేమో? ఆమె కాశాతీతమగు పదార్థము లభించినది గావున!" అనిపలికెను. ఒక క్షణకాలము గడచినవెనుక తిరుగ"నేనామెకునుసాభూతిజూపవచ్చితిని,గాని నేనిచ్చట నుండి పరాజయమునొంది వెడలిపోవుచుంటిని. ఆమె విశ్వాసము నన్ను పరాజితనొనర్చివైచినది. ఈయువతియందు పురుషుల నాకర్షింపజాలు గుణములన్నియు నున్నవి. ఇట్టిస్త్రీలె పురుషులహృదయముపై రాజ్యము సేయుదురు' నామనసున నింతటిశ్రద్ధ మున్నెన్నడును గలుగలేదు. వారితో నవ్వుచు పలుకుట, హాస, పరిహాసములొనర్చుట రూపయవ్వనముల ప్రదర్శించుట, నాకర్తవ్యపరిణామములుగ భావించితిని. ఎన్నడును ప్రేమింపనైతిని. ప్రేమింపబడనైతిని. నేననేక వత్సరములలో బడయనేరని దీమెయొక కొన్నిగడియలలో బడయజాలినది. నాయందేలోటుగలదో కొంచెము నాకు నేడుబోధపడినది. ఈనవోధ నాకు జ్ఞానముకలిగించినది. నాకన్నులు విప్పినది!" అనిపలికెను.

## 8 వ ప్రకరణము.

ఒకనెలనుండి దేవాలయమున పురాణకాలక్షేపము జరుగుచుండెను. పండిత మథురదాసజీ యాకళయందు ప్రవీణుడు. వానికథనమున శ్రవ్య, దృశ్యకావ్యముల యుభయవిధముల యానందమును గలుగుచుండెను. ఎంతసులువుగ నతడు శ్రోతలను నవ్వింపగలడో యంతసులభముగ నేడ్పింపనుగలడు. ఆయన దృష్టాంతములకు సాగరమువంటివాడు. ఆయన యేచరిత్రవినిపించునో దానిచిత్రము కనులయెదుట తాండవించునట్లొనర్పగల నాట్యకళాకుశలుడు. పట్టణమెల్ల మూగుచుండెను. రేణుకాదేవి సంజవేళనే దేవళమునకు వచ్చిచేరును. వ్యాసులవారు, భజనసేయువారు మొదలగువారెల్ల రామెకతిథులు! నైనాకూడ మేనల్లునెత్తుకొని వచ్చును. కేవలము సుఖదకుమాత్రే మీకథ రుచింపదయ్యెను. ఆమెయొక్క విప్లవహృదయము సంసారమంతటి నెదుర్కొని యుద్ధముసేయ నగ్నఖడ్గము ధరించినట్లుండెను. ఒక్కొక్క నాడామె సాంఘిక, ధార్మికబంధములను ద్రెంచివేయవలెననునంతటి యుద్విగ్నహృదయయగుచుండును. అట్టిమానవులకు వారిభార్యలు నదేమార్గము ననుసరించుటయే తగినశిక్ష. అప్పుడాపురుషులకు జ్ఞానమువచ్చి యీార్ష్యయననేమో బోధపడగలదు. ఒక్క నేనుమాత్రమే వంశమర్యాదకు కులప్రతిష్ఠకు నేడ్తునుగాక. కాని స్త్రీయాయత్యాచారము చిరకాలము సాగదు. భర్త యదేష్టముగ ప్రవర్తించుట, భార్య వానిచరణములు ప్రక్షాళనయొనర్చి పాదోదకము ద్రావుట, వానిని తనదేవతగ భావించుట, వానిపదసంవాహనక్రియ యొనర్చుట, యతడు నవ్వుచు ప్రసంగించినంతమాత్రమున మహాభాగ్యమని తలంచుట, యిత్యాదులు స్త్రీలొనరింతురని యికనెవ్వరు భ్రమయుచుండరుగాక! ఆదినములు గడచిపోయినవి. అనుచు నీవిషయమునుగూర్చి యామె వార్తాపత్రికలందు పెక్కువ్యాసములు వ్రాసియుండెను.

ఈనాడు నైనా యధిక్షేపింపదొడగెను. "పురుషుల యాచార విచారములు పరీక్షింపవలెననుచుందువు. పరీక్షించినంతమాత్రమున వంచన జరుగదా? ప్రతిదినము విడాకులిచ్చువేల తటస్థించుచుండును?"

"దాన దోసమేమున్నది? పురుషుడు విలాసముగదిరుగుట స్త్రీ వానికై వెక్కుచుండుట సంభవింపదు!"

"నైనా యామాటనే రెట్టించెను. "ప్రేమలేనిదే సుఖమెన్నడూ లభింపదు? బాహ్యాకారరోధములవలన నేలాభములేదు."

"నీవు నేడీవిద్య నభ్యసించుచున్నట్లున్నది" యని సుఖద పరిహాసముచేసెను. ఒండొరులచూచుకొని గ్రహించి, వివాహము చేసికొన్నప్పుడే యొక్కొకవేళ మోసము జరుగుచున్నప్పుడు చూచుకొనకుండ గనే చేసికొన్న వివాహములయందంతకన్న నెక్కుడువంచన గలుగుట తథ్యము. వివాహమునకు పద్ధ యదియేయగునేని కానిమ్ము— కాని యామీద వివాహమున నేమిసుఖమున్నదో బోధపడగలదు."

నైనా దీనికేవిధమగు ప్రత్యుత్తరము నొసగజాలక పోయెను. నిన్న వ్యాసులవారు భారతీయ వైవాహిక పద్ధతులకును, పాశ్చాత్య పరిణయపద్ధకును తారతమ్యములు వినిపించియుండెను. ఆమాటలు కొన్ని యస్పష్టముగ నామెకు జ్ఞాపకముండెను. "నీవు కథకువచ్చెదవా లేదా?" చెప్పుమని యడిగెను?

"నీవు పొమ్ము నేను రాను"

నైనా దేవగృహము సమీపించునప్పటికే కథ యారంభమయ్యెను. పూర్వముకన్న నేడు జనసమ్మర్ధము మెండుగనుండెను. నవయువక సభాసభ్యులు, సేవావిద్యాలయచ్ఛాత్రులు, నధ్యాపకులును సహితము వచ్చియుండిరి. మధురదాసులవారు "రామరావణుల కథ మన యీజీవితము, నీప్రపంచమును గూర్చినకథ, విన నిష్టముండినవిన వచ్చును. ఇష్టములేకున్న మానవచ్చును. దీనిని తప్పించుకొనుటకు

మనకు శక్తిలేదు. మనలో రాముడున్నాడు, రావణుడున్నాడు, సీత యున్నది, ఇత్యాది...

ఆకస్మికముగ సభ వెనుకటిపం_క్తినుండి యొకకలకలము బయలు వెడలెను. బ్రహ్మచారిజీ కొందరు మనుష్యులను చేతులుపట్టుకొని లేవ దీయుడనెను. గబగబ తిట్టుచుండెను, అల్లరిజరిగెను. జనులందునందునుండి లేచి యూతావులకు ప్రోగుపడిరి. కథాట్లాడిపోయెను.

సమరకాంతుడు "గొడవదేమని" ప్రశ్నించెను.

బ్రహ్మచారి, బ్రహ్మతేజమునుండి యెర్రవారినగ్రుడ్లు బయలువడ "ఏమిసంగతా? ఇచ్చటికి ప్రజ కథవినుటకువత్తురా లేక ధర్మభ్రష్టత్వము కావించుకొనుటకా? మాల, మాదిగ ఎవరైనాసరే లోనికి జొరబడుదురు. ఇది దేవళముకాదు సత్రమైపోయినది" అనిచెప్పెను.

సమరకాంతుడుగ్రుడ్డై "అందరినీ తన్ని పంపివేయు"డనెను.

ఒకవృద్ధుడు చేతులుజోడించి "మేము ద్వారమునకు వెలుపల చెప్పులు విడచుచోటున కూర్చుంటిమి. మీవంటివారి మధ్యకువచ్చి కూర్చుండుటకు మేమేమంత పసివారమా?" అని విన్నవించెను. బ్రహ్మచారి చెప్పునాడించుచు "నీవిచటి కెందుకువచ్చినావు? ఇందెల్లడనొకే జంబుకానా పరచియున్నది. ఒకరికొకరు తగులుతున్నారా లేదా? ప్రసాదమున్నది, చరణామృతమున్నది. గంగాజలమున్నది. ఇవన్నీ మన్నైపోయాయా లేదా? ఈశీతాకాలపుచలిలో నందరు స్నానాలు చెయ్యాలాలేదా? మిట్టూ నీవు పెద్దవాడవైపోయినావు. చచ్చేరోజులు సమీపించాయి. ఇంకా నీకీమాత్రము బుద్ధికూడారాలేదా? మహాభక్తుని తోకవైవచ్చావు?" అనెను.

సమరకాంతుడు క్రుద్ధుడై "ఇదివఱ కెన్నడేనావచ్చినావా లేక యిప్పుడేనా? అనియడిగెను.

మిటువా "నిత్యమూ వస్తున్నానురాజా! ద్వారమునకు బైట కూర్చుండి కథవింటున్నాను" అని చెప్పెను.

పూజారి తలమొత్తుకొనుచు "ఈదుష్టుడు నిత్యం వస్తున్నాట్ట! దినదినమూ అందరినీ ముట్టుకుంటూనే ఉన్నాడు. వీడు తాకిన ప్రసాద మంతా తింటున్నారు. ఆచారమున కింతకన్న హానియేమికలుగగలదు? అనదొడగెను. ధర్మాత్ముల క్రోధమునకు పారములేకుండెను. అనేకులు తమపాదరక్షలను బుచ్చుకొని యాబీదలపై బడిరి. భగవంతుని మందిర మున, భగవద్భక్తులహస్తములతో, భగవద్భక్తులపై పాదుకా ప్రహార వృష్టికలుగుచుండెను!

డాక్టరు శాంతికుమారుడు, నతని సహోపాధ్యాయులును నచట నిలిచి, కొంతకాల మీవినోదమునుచూచుచుండిరి. చెప్పు లెగు రుట ప్రారంభమైనతోడనే స్వామీ యాత్మానందుడు తనచేతికర్రను దీసికొని పూజారిపైకి దూకెను. డాక్టరు ఘోరసమరము కానున్నదని గ్రహించి స్వామి చేతికర్ర లాగుకొనెను. ఆత్మానందుడార క్తలోచనుడై మీరీ దృశ్యము చూచుచు నిలువగలరా? నేను దీనిని సహింపలేను!" అనెను.

వానిని శాంతపఱచి డాక్టరుచ్చైస్స్వనముతో "సహావ్వా! ఈశ్వరభక్తులారా! భళి! మీభక్తి నేమనదగును? ఎవరెన్ని పాదుకా ప్రహారములు గురిపింతురో భగవంతుడు వారిపై నంత ప్రసన్నుడగును. వారికి చతుర్విధములు సిద్ధించును. స్వర్గమునుండి తిన్నగా విమాన మే తెంచును. కాని మీరెంతకొట్టినా, ధర్మముమాత్రము భ్రష్టమై పోయినది" అనెను.

పూజారి సమరకాంతుడు ధనీరామ్‌సేఠ్ తక్కుంగలవారు నబ్బురపాటుతో శాంతికుమారునివంక చూచిరి. పాదుకలజడి విరమిం చెను. ఆతరుణమున శాంతికుమారు డంగీధరించి, కండువా వైచుకొని పంచకట్టుకొని నుదుట చందనమలడి, వ్యాసులవారి చిన్నతమ్మునివలె నుండెను. అది ప్రజ ధర్మమని యాక్షేపింపదగిన, వానిపూర్వపు వేషము కాదు ఆయన తిరిగి హెచ్చరించుచు "ఏల చేతులుకట్టివైచుకొన్నారు?

విసుగుడు రివ్వురివ్వున! ఆచెప్పులతో నేమగును! తుపాకులు దెప్పింపుడు. ఈధర్మద్రోహుల నంత మొందించి వేయుడు. ప్రభుత్వమువా రెద్దియు ననజాలరు. ఇంక నోధర్మద్రోహులారా! మీరందరు కూర్చుండుడు. ఎన్ని చెప్పుదెబ్బలు తినగలరో తినుడు. ఇచట వర్తకశిఖామణుల దేవ ముందు నన్నంతమాత్రము సంగతియే మీకు తెలియదా? ఈభగవం తుని మందిరమున నడుగుపెట్టునంతటి సాహసమామీకు? మీదేవు డేగుడిసెయందో, ఏచెట్టునీడనే యుండగలడు. ఈదేవుడు రత్నవిభూ షలు ధరించును. దధ్యోదనములు, క్షీరాన్నములు గుడుచును. చింకి-పాతలు గట్టుకొని సెనగలుతినువారి నీదేవుడు చూడనిచ్చగింపడు." అని ప్రసంగించెను.

బ్రహ్మచారి పరశురాముని చందమున భయదాకృతిదాల్చి "బాబూజీ! మీరత్యాచారము గావించుచున్నారు. అంత్యజులను దేవళములలో ప్రవేశింపనీయవచ్చునని శాస్త్రములయం దెచట వ్రాసి యున్నది?" యని పృచ్ఛచేసెను.

శాంతికుమారు డావేశముతో "కాని శాస్త్రములలో నిదిమాత్రము వ్రాయబడియున్నది? 'నేతిలో క్రొవ్వుకలిపి విక్రయింపుము, మీసములకు రంగువేయుము, లంచములు మేయుము, పరుల నిందింపుము, శాస్త్రములను కాలితో తన్ని వేయువాడైనను సరే, నీకన్నబలవంతుడగు వానికాళ్లకడిగి యాచనము సేయుము.' అని శాస్త్రముల యందు భగవంతునిదృష్టిలో నెవ్వడును నల్పుడుకాడు, ఎవ్వడును ఘనుడుకాడు. ఎవ్వడూ పరిశుద్ధుడుకాడు, ఎవ్వడు నపరిశుద్ధుడునుకాడు. వాని యుత్సంగమెల్లరకును దెఱచియేయున్నది." అని రచింపబడి యున్నది స్వామీ" అని ప్రత్యుత్తరమిచ్చెను. సమరకాంతు డచట చేరినవారిలో చాలమంది యంత్యజులపక్షమును బూనుటకుసిద్ధముగ నున్నవారేయని గ్రహించి, వారిని శాంతింపజేయు సూచనసేయుచు డాక్టరు గారూ! మీరు వ్యర్థముగ నింత క్రుద్ధులగుచున్నారు. శాస్త్రములయం

దేది వ్రాయబడియున్నదీ? ఏది లేనిదీ? పండితులే యెరుగుదురు. మన మెట్టి పరిధచూచుచుంటిమో యట్టులే యాచరింతుము. ఈదుస్తులు యోచింపవలెనా, అక్కరలేదా? వీరికీచటిపరిస్థితి తెలుసును. బయట నెచ్చటనుండియో వచ్చినవారు కారుగదా?'' అనెను.

శాంతికుమారుని రక్త ముడికిపోవుచుండెను. "మీరు చెప్పు లేల విసరినార''ని ప్రశ్నించెను.

బ్రహ్మచారి మూర్ఖత్వమును బ్రకటించుచు, "కాకపత్తిరి, పుష్పములుకొని పూజింతురా?'' అనెను.

శాంతికుమారు డుత్తేజితుడై "అంధులగు భక్తులకన్నులలో దుమ్ముకొట్టి నైవేద్యము లారగించుట ఇంకెంతోకాలముసాగదు మహాశయా! తెలిసినదా? ఇక భగవంతుడును పాలలో స్నానముచేయుట మాని నీటిలోనే స్నానము సేయుకాల మాసన్నమైనది'' యనెను.

ఎల్లరు ఆఁ ఆఁ అనుచుండగనే శాంతికుమారుడు, నాత్మానంద స్వామియు సేవాశ్రమ పాఠశాలవిద్యార్థులు లేచి వెడలిపోయిరి. భజన మండలికి ముఖ్యుడును నాయకుడును సేవాశ్రమములోని వ్రజనాథుడు. ఆతడును వారిననుసరించెను.

---

## —: 4వ ప్రకరణము :—

ఆనాడిక పురాణశ్రవణము జరుగలేదు. కొందరు బ్రహ్మచారి నాక్షేపింప జొచ్చిరి. "కూర్చుండుటే యేదోమూల కూర్చున్నాడు అంతమాత్రమున వానిని లేవగొట్ట నగత్యమేమివచ్చినది? పోనీ నెమ్మదిగ చెప్పి పంపివేయరాదా! కొట్టుటవలన నేమిలాభము?'' అని.

రెండవదినము నియమితసమయమున కథ తిరిగి ప్రారంభింప బడినది, కాని శ్రోతలసంఖ్య చాల తగ్గిపోయియుండెను. మధురదాసజీ

తొలినాటియుత్సాహము కలిగింప జూచుచుండెను. కాని జను లావు లించుచుండిరి. వెనుక నాసీనులైయున్నవారు గుఱ్ఱుపెట్టి నిద్రించుచుం డిరి. దేవాలయావరణ మొక్కింత చిన్నదైనట్లు, సింహద్వారము రవ్వంత క్రిందికొరిగినట్లు దోచుచుండెను. భజనమండలి లేకుండుటచే నిశ్శబ్దతయు నతిశయించెను. అచట నవయువక సమాజమందిరమున కెదుట మైదానములో శాంతికుమారుని కథనము సాగుచుండెను. వ్రజ నాథుడు, సలీము, ఆత్మానందులవారును వచ్చుచున్నవారికి స్వాగతము లిచ్చుచుండిరి. కొలదికాలమున మధ్యనున్న వేదిక చాలకపోయెను. క్రిమశః మైదానమే చిన్నదైపోయెను. అందుజేరిన వారియందధికాం శము ప్రజలు దిగంబరులు. కొందరు జీర్ణవసనములు ధరించినవారును గలరు. వారిశరీరములనుండి మాలిన్యపుదుర్గంధము, పొగబీల్చినదుర్వా సనయు నెడలుచుండెను. స్త్రీలు చినుగు ముడిగుడ్డలు కట్టుకొని యొట్టి యాభరణములు నలంకారములును లేకయుండిరి. పట్టుదుకూలములు, బంగరుభూషణాలంకారములు, పరిమళదివ్యవాసనలు, పేరునకైన లేకుండెను. కానివారియెడదల దయయుండెను, ధార్మికచింతయుండెను, సేవాభావముండెను, త్యాగముండెను, క్రొత్తగావచ్చువారికి తావొసం గక కాళ్ళుచాచుటలేదు. ఊరకే చూచుచు తిష్టవైచుకొని కూర్చుండు టయు లేదు. శత్రులరాకజూచి భయపడినట్లుచూడక జరిగి సర్దుకొని కూర్చుండి క్రొత్తవారికిని చోటిచ్చుచుండిరి.

తొమ్మిది కొట్టుసరికి కథ ప్రారంభమయ్యెను. అది దేవీదేవతల కథకాదు, బ్రహ్మ క్షత్రియుల తపశ్చరణ వృత్తాంతముకాదు, క్షాత్రవ వీర్యము, దానమునుగ్గడించు కథకాదు. ఇదిసహృదయత, కర్మశుద్ధియు ధర్మమునకు మూలసత్వముగగల పురుషుని పావనచరిత్రము. ఎవని మనసు నిర్మలమో వాడే యుత్కృష్టుడు. ఎవనిచిత్తము మలినమో వాడె నికృష్టుడు. ఏవాడు కృత్రిమసంఘమును సృష్టించి, సంఘమున నొకయంగము మదాంధము, వేరొండు దానినిమ్లేచ్ఛమునుగ నొనరించి

యుండకుండెనో, యెవ్వడొక నిలలాటమున ఘనతసూచించు తిలకమును మరియొకనిముఖమున నీచత్వసూచకమగు కళంకమును పెట్టి యుండలేదో అట్టివాని పావనచరిత్ర. ఈచరిత్రయం దాత్మోన్నతికాక సజీవ సందేశమున్నది. ఆచరిత్ర వినిన శ్రోతలకు తమయాత్మబంధనములు విడిపోయినట్లును, విశ్వమంతయు పవిత్రము, సుందరము నయిపోయినట్లును దోచుచుండెను.

నైనాకు ధర్మముయొక్క పాషండత్వ మసహనీయముగనుండెను. ఆమెతో నమరకాంతు డీవిషయమునుగూర్చి తఱుచుగ ప్రసంగించుచుండెడివాడు. అస్పృశ్యులయెడ గావింపబడు నత్యాచారములను గాంచి నైనాయెడలు మండుచుండెడిది. సమరకాంతుని భయమే లేకున్నచో నామె పూజారిని కసరికొట్టెడిది. ఆహేతువున శాంతికుమారు డీసమయమున తిలకధారులపై ధ్వజమెత్తినపు డామెహృదయము ముగ్ధమై వానిచరణములకడ వ్రాలినది. అమరునిచే నాతనిప్రశంస యామె వినియేయున్నది. ఈతరుణము నతనియందు వానినిసమీపించి "మీరు ధర్మమునకు నిక్కంపు దేవతలు. తమకు నమోవాకములర్పించుచుంటి" నని చెప్పవలె నన్నంతశ్రద్ధ యామెమనసున నుత్పన్నమయ్యెను ఆమెకు చుట్టునున్న జనులక్రోధమునుజూచి వారాతనిపై బడుదురేమో యనుభీతి యుదయించెను. ఆమెకు శాంతికుమారుని యండనిలచి యతనికి తోడ్పడవలెనని కోర్కె జనించెను. అతడు కొందరితోగూడి నిష్క్రమించుటతోనే యామెకూరట గలిగెను. ఆమె సుఖదవెంట నింటికి వచ్చివైచెను.

మార్గమధ్యమున సుఖద ఆదురాత్ముడు నేడెచ్చటినుండి యూడిపడెనో తెలియదు. దానికితోడు డాక్టరుగారు వానిపక్షమే వహించి యుద్ధమునకు సిద్ధమైరి" అనెను.

"భగవంతుడు కొందఱిని నీచులుగను, కొందఱిని ఘనులుగను సృజించి యుండలేదు" అనెను నైనా.

"దైవమే సృజింపకున్న నింకెవరు చేసినారు?"

"అన్యాయము"

"చిన్న, పెద్ద ప్రపంచమున నెన్నడున్నారు. ఉందురు?"

నైనా తర్కవితర్కములకు గడంగుటయుచితము కాదనితలచెను.

మఱునాడు నవయువక సభలు నస్పృశ్యులకు వేరొక కథాశ్రవణము జరుగునని తెలిసి, యామెహృదయ మచటికరుగవలెనని వేధింపసాగెను. ఆమె సుఖదవెంట గుడికిజనెను.సుఖద కునికిపాట్లుపడుట ప్రారంభింపగనే, అది యీనాడు శీఘ్రముగనే ప్రారంభించెను. ఆమెకు విరక్తి భావముదయించి బయటికి వచ్చివైచి బండియెక్కి యువజనసభామందిరమునకు వెళ్ళిపోయెను. ఆమె సుఖదకీసంగతి తెలియకుండ నట్లుదూరమున నిలచియే యాసమావేశమునుచూచి తిరిగి రావలెననుకొనెను. దవ్వుననుండగనే యామెకు విద్యుద్దీపములకాంతి గనపడ్యెను. కొంచెము ముందుకు సాగుటతోడనే వ్రజనాథుని కంఠస్వరులహరులామె చెవి సోకజొచ్చెను. శకటము సభాస్థల సామీప్యమున కేగగనే, శాంతికుమారుడు వేదిక నధిరోహించెను. ప్రజాసముద్ర ముప్పొంగియుండెను. శాంతికుమారుని ప్రతిభ యాసంద్రము పైనెద్దియో విశాలవ్యాపకమగు నాత్మకరణి నావహిల్లియున్నట్లు దోచెను. మంత్రముగ్ధయైన వడువున కొంతకాలము నైనాశకటమందుపవిష్టయై వానియుపన్యాసము వినుచుండెను. పిదప క్రిందికిదిగి మెల్లగ వెనుకనిలువబడెను.

ఒక ముదుసలిస్త్రీ "ఎంతవరకు నిలచియుందువు బిడ్డా! లోనికేగి కూర్చుండు"మనెను.

"ఇక్కడ సుఖముగానేయున్నది. వినబడుచున్నదికూడ" అనెను నైనా.

వృద్ధురాలు ముందు నిలచియుండెను. ఆమె నైనాచేతిని దొరకబుచ్చుకొని తాను నిలచియున్నస్థలమునకులాగి నిలువబెట్టి, తాను నైనావెనుక నిలచెను. అంత శాంతికుమారుడు నైనాకెదుట

కనపడెను. ఆయన ముఖమండలమున దేవోపమ తేజచ్ఛాయ యావహించియుండెను. ఆత డొకదివ్యస్థలమున నిలచియున్నట్లును, అచటి వాయువాసమయమున సుధామయమైనట్లును తోచుచుండెను. ఏదరిద్రులవదనముల నిరంతరధూషణవృష్టికతమున విషాదచ్ఛాయ లలముకొనియుండు టామె గాంచుచుండెనో, వారి ముఖమండలముల, తమకేదేని పెన్నిధి యొండు లభించినమాడ్కి, యొకవిధమగు గర్వమయ వికాసము నేడామెకు గోచరించుచుండును. ఇంతనమ్రత, యింతభద్రితయు నామె మున్నెన్నడును వారియందు చూచియుండలేదు.

శాంతికుమారుడు వచించుచుండెను. "మీరీశ్వరుని మందిరము నుండి బానిసవృత్తినలుపుటకే శపథము పూనివచ్చియుండిరా? మీరు తనువులతో, మనసులతో, పరుల సేవయొనర్చుచున్నారు; కాని మీరు వానికి బానిసలు. మీకు సంఘమునందెట్టి స్థానమునులేదు. మీరే సంఘమునకు పునాదులు. మీపైననే సంఘ మాధారపడి నిలచియున్నది, కాని మీరస్పృశ్యులు. మీరు దేవళముల బ్రవేశింప వీలులేదు. ఇట్టి యవినీతి యీదౌర్భాగ్యపు దేశమునగాక యెందైన నుండునా? సర్వదా మీరిట్లే పతితులు, దళితులునై మననిచ్చగించుచున్నారా?"

ఒకవాక్కు "మావశమేమగును?" అని వినవచ్చెను.

శాంతికుమారు డుత్తేజిత స్వరముతో తిరుగ పలుకసాగెను. "ఎంతదనుక మీవశమున లేదని తలంచుచుందురో, యంతవరకు మీవశమున నుండదు. దేవమందిర మొకవ్యక్తిదికాని, యొకకులముదికాని కాదు. అది హిందువు లందరివస్తువును? ఎవడేని మిమ్ము నిరోధించునేని యది వాని దుర్నయము. మీమీద నగ్నిగోళవృష్టి జరిగినను మీరు దేవళ ద్వారమునుండి కదలకుడు. కించిద్విషయములకును మీరు సర్వస్వ నాశము గావించుకొందురు, ప్రాణము లర్పింతురు. ఇది మతవిషయము. ధర్మమెల్లరికి ప్రాణముకన్న ప్రియమగువస్తువు. ధర్మోద్ధరణ ప్రాణత్యాగమువల్ల నైనది. ప్రాణము లర్పించుటచేతనే కాకున్నది.

కడచిన దివసమున జరిగినదుర్ణయ మచటిశ్రోతల నెల్లర నుత్తే జితుల నొనరించివైచినది. వారు పగలంతేయూ నావిషయమే చర్చించు చుండిరి. మందుగుండు సామగ్రి సిద్ధమయ్యెను. దానికి 'జానకిత్రాడు' దగిలించుటయే శేషించియుండెను. ఈపలుకు లాయగ్గితాత్రిటిపని నొన రించివైచెను. సాంఘికశక్తి వారిసాహసమును వృద్ధిగావించెను. జనులు శిరోవేష్టములను సవరించుకొనిరి. ఆశనములు మార్చిరి. ఒకరి వంక నొకరు బయాలుదేరెదరా లేక యింక నాలోచించుట కేమైనగలదా!" యని ప్రశ్నించుకొనుచున్నట్లు పరస్పరావలోకనము లొనరించుకొన సాగిరి. తదుపరి శాంతించిరి. సాహసము బిలములునుండి తలసుంత యీవలకుబెట్టి వెనుకకులాగికొను మూషికముచందమున బఱువడెను.

నైనా సమీపమున నిలచిన వృద్ధాంగన "మా దేవాలయములు తీసికొన్నారు మేమేమి చేయుదుము?" అనెను.

నైనా పడిపోవుచున్నగోడను పడకుండ నాపుచున్నట్లు "దేవ ళము లేవ్యక్తివికావు" అనెను.

శాంతికుమారుడు ప్రతిధ్వనించు స్వరముతో దేవుని దర్శనము చేసికొనుటకు నావెంట వచ్చువా రెవ్వర"ని ప్రశ్నించెను.

ముసలిది "లోనికెవ్వరూ రానివ్వకపోతేనూ!" అనియడిగెను.

శాంతికుమారుడు పిడికిలిబిగించి "ఎవరురానీయరో నేనుచూ తును. మనయీశ్వరు డెవరిసొత్తునూకాడు, ఇనుపపెట్టెలలోపెట్టి దాచు కొనుటకు. నేడే యీసంగతి యెల్లప్పటికీ తేల్చివేయవలెను" అనెను.

కొన్నివందలమంది స్త్రీ పురుషాదులు శాంతికుమారుని వెనుక దేవళమువంకకుబోయిరి. నైనాహృదయము కంపింపసాగెను, కాని యామె తనమనసును తిరస్కరించి యీజనసమూహాము వెన్నంటి పోయెను, తనసోదరు డేవేళ యిచటనుండియున్న నెంతసంతసించియుం డునోయని యామె యనుకొనుచుండెను. ఆయుత్సాహతోకూడ పావుర ములవలె సందియములు నెగురజొచ్చెను.

ఆజనసముదాయము మెల్లమెల్లగ దేవాలయమువంకకు సాగుచుండెను. ఇతరులుకూడ వచ్చి యందుకలియుచుండిరి. మందిరమును సమీపించుచున్నకొలది, వారిసాహసమును క్షీణింపసాగెను. ఏస్వత్వము నుండి వారు సర్వదా వంచింపబడుచుండిరో దానికొరకు వారికి విశేషాభిలాష లేకుండెను. దెబ్బలువడినందుకు దుఃఖముమాత్రమే యుండెను. న్యాయజ్ఞానమున జనించు విశ్వాసమచట లోపించియుండెను. జనులసంఖ్య యింక నతిశయించుచుండెను. ప్రాణముల నర్పించువారన్న నరుదుగనే యుండిరి. సామూహికోపద్రవ భయపరిదర్శనముచే జయము వడయు నాసనే వారిని ముందునకు నడిపించుచుండెను.

ఆపరిజాసమూహము దేవమందిరమును సమీపించునప్పటికి పది గంటలయ్యెను. బ్రహ్మచారి పలువురు పూజారులు, పండాలును,కర్రలు చేతబట్టుకొని ద్వారములో నిలచియుండిరి. లాలాసమరకాంతు డిటునటు దిరుగుచుండెను.

బ్రహ్మచారిని సమీపించి "నీవు మహాధర్మాత్ముడవై పోయితివి. అర్ధరాత్రిపర్యంతము గుడియందే జూదమాడుచుందువు. దమ్మిడీ కూడ విశ్వాసమున నమ్ముకొనుచుందువు. కూటసాక్ష్యము లిత్తువు, ప్రతీగుమ్మము తిరిగి బిచ్చమెత్తుదువు. అయినప్పటికీ నీవు ధర్మమునకు ముఖ్యుడవు. నీస్పర్శమాత్రమున దేవతలకు కళంకమువచ్చును" అని దులిపివేయవలెనన్నంత కోపమువచ్చెను నైనాకు.

ఆమె తనయాగ్రహము పట్టజాలకపోయెను. వెనుకనుండి దారి చేసికొనుచు నాసమూహములోనుండి, యామెవచ్చుచుండ శాంతి కుమారుని కంటబడెను. అతడు రిచ్చవడి "ఇచటి కెట్లువచ్చితివి నైనా? నీవు లోపల పురాణము వినుచుందు వనుకొంటిని అనెను.

నైనా కృత్రిమరోషముతో "మీరు నామార్గము నడ్డగించుచున్నారు" ఎట్లుపోదును అనెను.

శాంతికుమారు డాజనుల నడ్డగించుచు "నీవు వీరియడ్డముచేత నిలచిపోయితివని యెరుగ"ననెను.

నైనా యించుకనిలచి "మీరు మాదైవమును భ్రష్టుచేయ నెంచుచున్నారా!" యని ప్రశ్నించెను.

శాంతికుమారు డామె హేళనమును గ్రహింపలేకుండెను. అత డామెను "నీయభిప్రాయము నట్టిదేనా? యని యడగెను.

నైనా క్రోధమునునటించి "మీరు దేవాలయము నస్పృశ్యులతో నింపివేసినచో దేవత భ్రష్టముకాదా?" యనియడిగెను.

శాంతికుమారుడు గాంభీర్యముతో "దేవత భ్రష్టులనుపునీతుల గావించుననుకొంటిని. తానే భ్రష్టగునని తలపలే"దని పలికెను.

అంతలో బ్రహ్మచారి గర్జించుచు "మీరు భగవంతునియాలయ ద్వారమున నుపద్రవము సేయవచ్చినారా?" యనిప్రశ్నించెను.

ఒకపురుషుడు "మేము దుండగముసేయ రాలేదు. భగవంతుని దర్శనము చేసికొన వచ్చితి"మనెను.

సమరకాంతుడా మనుష్యునదలించుచు "నీతండ్రి, నీతాత యెన్న డేనా దర్శనము చేయవచ్చెనా లేక నీవే మహావీరుడవా?" యని పృచ్ఛించెను.

శాంతికుమారు డాపురుషుని శాంతపఱచి "తండ్రితాతలు చేయని పనులన్నియు పుత్రులకు, పౌత్రులకు వర్జనీయములా? లాలాజీ తాతముత్తాతలు తంతివార్తలు విద్యుచ్ఛక్తి నెఱుగరు. నేడు వాటి వ్యవహారమే ప్రబలియున్నది. ఊహలయందు వికాసము గల్గుచుండును. మీరు దానినాపజాల" రనెను.

సమరకాంతుడువ్యంగ్యముగ "అందుకనియే భగవంతుని భక్తి విడనాడి వానికి విద్రోహులగునట్లు మీయూహలో నీవికాసము గలిగినది కాబోలు"ననెను.

శాంతికుమారుడు "భగవంతునికి ద్రోహిని నేనుకాను. వాని భక్తులను పూజచేసికొననీయనివాడే ద్రోహి. ఏమి? వీరు హిందూసంస్కారములను పాటింపరా? అయినను దేవాలయద్వారములు వారికేలమూసి వేయబడినవి?" యని ప్రతివాదము గావించెను.

బ్రహ్మచారి గ్రుడ్లు పెద్దవిచేసికొని "మద్యమాంసములు తినువారిని, నిషిద్ధకర్మలు చేయువారిని దేవాలయములోనికి రానీయు వీలు లే"దనెను.

శాంతికుమారుడు శాంతముగ "మద్యమాంసములు చాలమంది బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులును ప్రాశింతురు. వారిని మీరేల యడ్డగింపరు? ప్రాయికముగ నెల్లరు త్రాగెదరు. ఇచట నట్టివారినేల పూజారులు, నాచార్యులు గావించి నిలిపినారు?" అని యడిగెను.

సమరకాంతుడు చేతికఱ్ఱను సవరించుకొనుచు "వీరెల్లరూ ఉక లక్ష్యపెట్టరు. వీరిని దండముల సాయముననే పాఱద్రోలవలెను. కొంచెమేగి రక్షకభట కార్యాలయములో చెప్పిరమ్ము. వీరిచ్చట నుపద్రవము చేయవచ్చిరని" అనెను.

అప్పటి కనేకులు పండాలు, పూజారులు గుమికూడిరి. వారందరు కర్రలమొనలతో నాగుంపును దొలగింపజొచ్చిరి. ప్రజలయందు పలాయనభీతి యుదయించెను. కొందరు తూర్పు, కొందరు పడమరగను పారిపోసాగిరి. శాంతికుమారుని తలపైనొక ప్రేటుపడెను. కాని యతడు నిలచినచోటనే నిలువబడి, జనులకు "పారిపోకుడు పారిపోకుడు. అందరు నిచటనే కూరుచుండుడు, దేవునిపేర మీప్రాణములు బలిగావింపుడు ధర్మముకొరకు——"

కాని రెండవసారి వానిశీర్షమున వేరొక ప్రహారముపడుటయు, నాతనివాక్యము పూర్తికాకుండగనే యాతడు నేలవ్రాలెను. సంబాళించుకొని యెటులైననేచి నిలువనుంకించుచుండె గాని యంతలో దడదడ దెబ్బలు మెండుగ తలపైబడుటయు నాతడు మూర్ఛిల్లెను.

## 5వ ప్రకరణము

సారెకు సారెకు నైనా గుమ్మముదగ్గిరకు వచ్చుచు? సమరకాంతుడచట నాసీనుడై యుండుటచే మగుటి చనుచుండెను- ఎనిమిదిగంటలయ్యెను కాని లాలాజీ గంగాస్నానమున కేగలేదు. నైనా రేయయంతయు నిటునటు దొర్లుచుండెను. ఆమె శాంతికుమారుడు గాయపడుట గాంచియుండెగాని నిర్జీవప్రతిమకరణి రాపడి నిలచెను. వానిడాయజని రక్తస్రావమునైన నరికట్టు యత్నముసేయ నేరకపోయెను ఆమె తాటాతూటఃముగ సమరునికడ ప్రారంభచికిత్సావిధానము నభ్యసించియుండెను. కానితరుణమున నుపయోగింపలేకపోయెను. జనసమూహమతని చుట్టుముట్టుటయు చూచెను. పిదప వైద్యునిరాక, శాంతికుమారుని మోయించుకొనిపోవుట చూచినది కాని కదలలేదు. కట్టివైచిన పశువుభాతి మాటిమాటికి నామెమనసు పాటిపోవ నుంకించుచుండె గాని యామెపగ్గమును రెండుచేతులబట్టుకొని యాపుచుండెను. కతమేమి! సంకోచము!

తుదకామె గుండె దిటవుగావించుకొని గడపదాటి వసారాలో నడుగిడెను.

సమరకాంతు "డెచటికేగెద" వనియడిగెను.

"కొంచెము దేవాలయమువరకు వెడలివత్తును"

"అచ్చటికైనచో మార్గము బంధింపబడినది. మాలమాదిగలెల్లరెచటినుండియో వచ్చి గుమ్మములో కూర్చుండిరి. లోపలికెవ్వరిని పోనీయకున్నారు. రక్షకభటులు వారిని వెనుకకంపివేయు ప్రయత్నములు సలుపుచున్నారు. కాని యానిర్భాగ్యులు వినుటలేదు: ఇదియంతయు శాంతికుమారుని తెలివితక్కువ తనము! ఆతడే వీరికెల్లరకు నాయకుడైనాడు. విదేశములకేగి జాతిభ్రష్టుడై వచ్చినాడు. ఇకనిచ్చట హైందవధర్మమును(వేళ్ళు) పెల్లగించుచున్నాడు. ఆచారములేదు. అతని

స్నేహితుడగు సలీముతోకలసి తినును, త్రాగును. అట్టి ధర్మద్రోహుల కింకేమి తోచును? వీడంకటిస్నేహమే యమరుని పాడుచేసినది. ఈయన నెవ్వరుపాధ్యాయునిగ నియోగించిరో తెలియదు''అనెను.

నైనా దూరమునుండియే యీదృశ్యము గాంచివత్తునని వంక పెట్టెను. దేవళముదిక్కు చనెను. కొంతదూర మేగినపిదప నొకసం దులో జొఅబడి వైద్యాలయముదారిబట్టెను. కుడి యెడమలుచూచు కొనుచూ నేదియో తప్పిదము గావించిన దానిపడువున చరచర నడచి పోవుచుండెను.

ఆస్పత్రి సమీపించినంత, వేలకొలది జనులు పోగైయుండుట, విశ్వవిద్యాలయచ్ఛాత్రులిటునటు పరువులెత్తుచుండుట కంటబడెను. సలీము నగపడెను. ఆమె వానిని చూచుటతోడనే వెనుకకు మరల నుంకించుచుండ, బ్రజానాథు డామెను దారసిలి, “అరే! నైనాదేవి? మీరిచటి కెట్లువచ్చితిరి? డాక్టరు గారికి రేయియంతయు తెలివిలేకుండెను. సలీమును నేనును వానిసన్నిధినే కూర్చుండియుంటిమి. ఇప్పుడే కనులు దెరచిర''ని చెప్పెను.

ఇందరు పరిచితుల మ్రోల నైనాయెట్లు నిలువగలదు? ఆమె త్వరితముగ వెనుకకు దిరిగెను. కాని యిచటికివచ్చుట రిత్తగాదు డాక్టరుగారికి చైతన్యము గలిగినదని తెలిసినది!

ఆమె మార్గమధ్యమందుండెను, ఇంతలో వందలకొలది జనులు పఱుగెత్తుకొని వచ్చుచుండుట కనుపించెను. ఆమె యొకసందులో దూరి దాగుకొనెను. ప్రాయశః యుపద్రవము జరిగిపోయినది కాబోలు. తా నెట్లుయిల్లుచేరుకొనగలదు? ఇంతలో నాత్మానందు డెదురయ్యెను. ఆయన నైనాను గుఱుతించి “ఇచట గుండ్లుప్రయోగింపబడుచున్నవి. రక్షకభటాధికారి కాల్పుకుత్తరువు గావించినాడు'' అనిచెప్పెను.

నైనా ముఖనాళములందలి రక్తప్రసారము కట్టువడిపోయినట్లు వెల్లనయ్యెను.

"మీా రచటినుండియే వచ్చుచుండిరాయేమి?" యనెను.

"అగును. చావుతప్పి బ్రదికితిని. ఈసందులోనుండి వెలువడితిని. మే మూరక నిలచియుంటిమి. అంతియే, ఇంతలో కర్మచారి కాల్చుట కుత్తరువు గావించివైచెను. నీవెచటి కరుగుచుంటివి.

"నేను గంగలో స్నానముగావించి తిరిగి వచ్చుచుంటిని. జనులు పరుగిడుచుండుట గాంచి యిటు వచ్చితిని. ఇంటికెట్లు జేరుకొందు" ననెను.

"ఈసమయమున నచటికేగుట చేటు" అని కొంతసేపటికి తన పిఱికితనమునకు లజ్జించి "కాని సందులలో భయమేమియు లేదు. నడువుము. నేనింటిదాక తీసికొనిపోయెదను. ఎవ్వరైన నడిగిన లాలా సమరకాంతుని తనయనని చెప్పు"మనెను.

"ఈ మహాశయుడు సన్న్యాసి. కాని యెంతభీరువు. మున్ముందు పేదలను రెచ్చగొట్టినాడు. కొట్టుట ప్రారంభించినంతనే పలాయనము చిత్తగించుచున్నాడ"నుకొనెను తనలో తాను నైనా.

వీలు చిక్కలేదు కాని లేనిచో నాతడు నామె యెన్నడు మఱచిపోకుండునట్లు దులిపివేసి యుండెడిదే. ఆయనవెంట సందులు గొందులు తిరిగి పదిగంటలగుసరి కామె యిల్లు చేరుకొనెను. ఆత్మానందుడు వచ్చినదారినే మగుడి చనెను. నైనా వానికి ధన్యవాదమైన చేయులేదు. విశేషించి వానియం దామె కణుమాత్రము భక్తి లేకుండెను.

లోనికేగగనే సుఖద ముంగిలివాకిట నిలువబడియుండుట పరిజలు చిందరవందరగ పరుగులిడుచుండుట యామెకు గనవచ్చెను.

"నీ వెందేగితి వదినే? పోలీసులగ్ని వర్షము గురియించిరి. పాపము జనులు పాఱిపోవుచున్నా" రనెను సుఖద.

"నాకు త్రోవలోనే తెలియవచ్చినది. సందులోనుండి దాగికొని వచ్చితిని.

"ప్రజ లెంతపిఱికిపందలు! తలుపులుకూడ బిగించి వైచు కొన్నారు"

"లాలాజీ రక్షకభటుల నేలమాన్పింపరు?"

"వారి యాదేశముననే యాగ్నేయాస్త్ర ప్రయోగము జరిగినది. ఎట్లు మాన్పింతురు?"

"అగుచో నాన్నగారే గుండ్లు ప్రయోగింపించిరా?"

"అగును. వారే రక్షకభటనాయకునితో చెప్పిరి. ఇప్పుడింట నక్కినారు, అంటరానివారు దేవళము ప్రవేశించుటకు నేనుచితమని భావింపను కాని తుపాకులు ప్రేల్చుటగాంచి నారక్తముడికిపోవుచున్నది, ఏధర్మమియొక్క రక్షణయాయుధసాహాయ్యముచేతగాని కాదో ఆధర్మమున సత్యము లుప్తమని గ్రహింపుము' చూడుము! చూడుము! ఆమనుష్యుడు! పాపము గుండుతగిలినది! వక్షము నుండి రక్తము స్రవించుచున్నది!"

అని పలుకుచునే యామె సమరకాంతుని గదిలోజొచ్చి" ఏమండి! లాలాజీ! రక్తనది ప్రవహించునుగాక, దేవళద్వారము విడదా?" యని ప్రశించెను.

సమరకాంతు డవిచలితభావముతో ప్రత్యుత్తర మొసంగెను. "ఏమి వదరుచుంటివి!" మాలమాదిగలను గుడిలో దూరనిత్తునా? నీవమనికన్న రెండంజలు ముందుకు సాగుచున్నావు. ఎవరిచేతినీరైన ద్రాగరాదో వారిని దేవళములలోని కెట్లు చొఅనిచ్చుట?"యనెను.

సుఖద తర్కవితర్కములు గావింపలేదు. ఆమె యభిమానవతి యగు మహిళ! ఎయ్యది యభిమానరూపమున నామెను విలాసినిని నొనరించి యుండెనో, యేది యామె నల్పులతో గలియనీయకుండెనో, యేది యామెను పగులయాజ్ఞలను సహింపనీయకున్నదో, యట్టియామె తైజసము నేడుత్సర్గముగ పరివర్తితమై యువ్వెత్తుగ నుబికిపోయెను. ఆమె యున్మాదినియై గృహమువీడి

రక్షకభటుల దండనిలచి, పరుగువారు ప్రజల నీరెలుంగున జీరుచు "సోదరులారా! ఏల పారిపోయెదరు? ఇది పరుగెత్తుటకు సమయము కాదు. వక్షస్థలములొగ్గి నిలువవలసిన తరుణము! ధర్మముకొరకు మీరు మీప్రాణముల నెట్లుహోమము చేయగలరో చూపింపుడు! ధర్మవీరులే యీశ్వరుని పొందగలరు! పారుబోతులకెన్నడు విజయము సేకూరదు" అని యరచెను.

పరుగిడుచుండినవారి పాదములు కట్టువడిపోయెను. ఒకయువతి శతఘ్నికెదుట నిలచియుండుటగాంచి భీరుత్వమును లజ్జించినది. ఒక వృద్ధస్త్రీ యామెపజ్జకేగి "బిడ్డా! అట్లునిలువకు! నీకు గోళీ తగులగల దనెను.

సుఖద నిశ్చలచిత్తముతో "పలువురు మరణించిన యీచోట నేను మరణించినను హానిలేదు. సోదరులారా! సోదరీమణులారా! పారిపోకుడు. మీప్రాణములు బలిదానమును గ్రహించియే భగవానుడు మీయెడ ప్రసన్నుడు కాగలడు" అని తిరుగపలికెను.

భీరుత్వమువలెనే వీరత్వమును సంక్రామికము. క్షణికముక్రిందట నాకులవలె నెగిరిపోవుచున్న మనుష్యులు గోడకట్టినయట్లు నిలచిపోయిరి. అపుడు దండప్రహారములు వర్షించినను, గుండ్లవృష్టి కురిసినను వారికి భీతిలేదు.

తుపాకులనుండి ధాం డాం! అనుశబ్దము వెలువడెను. ఒకగుండు సుఖదచెవి దూసికొనిపోయెను. ముప్వురు, నలుపురు మనుష్యులు నేల వ్రాలిరి. కాని యీగోడచలింపక యున్నదియున్నటులే నిలచియుండెను.

మరల తుపాకులు మ్రోగెను. నలుపురైదుగురు భూశయ్యాగతులైరి కాని యీమానవకుడ్యము చలింపలేదు.

సుఖద యీకుడ్యమునకు స్తంభమైయుండెను. ఒక్కదీపికయింటి కంతకు వెలుగునిచ్చును. బలవత్తరమగు హృదయము నాజ్యోతిచందము ననే జనసమూహమును సాహసముచే నింపును.

అది భీభత్సదృశ్యమై యుండెను. ప్రజలు తమకనులయెదుట తమ పేమాస్పదులు గిలగిల కొట్టుకొనుచుండుట జూచుచుండిరి; కాని యొక్కరికనులలో గూడ నశ్రుబిందువులేదు. వారికింతటి సాహసమెచటి నుండి వచ్చినది? సేన కలకాలము రణరంగమున నిలచియుండునా? ఒక దినము ప్రాణములు పణముగనొడ్డు నాచమూసమూహమే, మఱునటి దిన మాగ్నేయాస్త్రముల మొదటిశబ్దము వీనుల సోకినంతమాత్రమున యుద్ధక్షేత్రమునుండి పలాయనమొనర్చును కాని, అది, సత్యము, న్యాయముల బలములేని ధనాశచేత సమకూర్చబడిన సేనయొక్క స్వభావము. దవ్యాశచేతను లేక కేవలము యుదరపోషణార్థమును యుద్ధ మొనరించు సేనస్థితియిట్టిది. కాని యీసమూహములో సత్యము, బలము సత్వ మూనవహించియున్నది. ప్రత్యేకస్త్రీయు, పురుషుడును, మనము ధర్మము; స్వత్వములకొరకు పోరాడుచున్నాము. ధర్మమునకు ప్రాణములర్పించుట ద్విజులనీతియందువలె నస్పృశ్యుల నీతియందు నత్యంతగౌరవదాయకమని గ్రహించెను.

ఇదియేమి! రక్షకభటయువకులు తమతమభారములేల దింపివై చిరి? అరే? తుపాకులేల భుజస్కంధముల బెట్టివైచుకొనిరి! ఎల్లరేటికి వెనుకకు దిరిగిరి! వారు నలువురు నలువురుగ పంక్తులుదీర్చుచున్నారే! నడువ నాజ్ఞయయ్యెనే! దేవళాభిముఖులై వారెల్లరు నడచిపోవు చుండిరే! ఒక్కభటుడును మిగులలేదే!

కేవలము సమరకాంతుడు మాత్రము రక్షకభటాధ్యక్షున కేదియో మాటచెప్పినాడు, అంత లాలానమరకాంతుడు సుఖదచెంగటి కేతెంచి "దేవాలయము తెరువబడినది. ఎవరి కభిలాషయున్న వారు దర్శనము గావించుకొనవచ్చును. ఆటంక మేరికినిలేదు" అని తెలిపెను.

జనులయందు సందడి యతిశయిల్లెను. జనులున్మత్తులై సుఖద చరణములకెరగి లేచి, దేవళాభిముఖులై పరుగిడజొచ్చిరి.

కాని పదినిముసములకు బిదప, జనులు తిరిగివచ్చి తమప్రేమాస్పదులగు వారలశవములను కవుగలించుకొని యాక్రోశింపనారంభించిరి. సేవాసదనపు విద్యార్థులు డోలికలు గొని తెచ్చి యాహతుల నెత్తుకొని పోవుచుండిరి. వీరగతి జెందినవారి యుత్తరక్రియలగూర్చి యోచనలు ప్రారంభమయ్యెను. వస్త్రవిక్రేతలనుండి వస్త్రములు, నెచటినుండియో వెదుళ్ళు, తాళ్లు, ఘృతము, ఇంధనములు వచ్చిచేరుచుండెను. విజేతలకు ధర్మముమీంద నేగాక హృదయములపైగూడ విజయప్రాప్తి సిద్ధించును. పట్టణమంతయు వారినిసమ్మానించుకొనుటకు కొందరపడుచుండెను.

సంధ్యాకాలమున నీధర్మవిజేతల శవయాత్ర బయలుదేరెను. నగరమంతట నీవార్త మోగిపోయెను. శవములు దేవాలయ సమీపమునకు దొడ్కొనిపోబడెను. దేవాలయపు తలుపులు తెఱచుకొనియుండెను. పూజారులయు బ్రహ్మచారియొక్కయు జాడలేకుండెను. సుఖద గుడిలోనుండి తులసీదళములు గొని తెచ్చి శవములపైనిడి, వారికత్తుకల చరణామృతముంచెను. ఈద్వారముల దెఱపించుటకే యీవిభీషణసంగ్రామము జరిగియుండెను. ఇప్పుడు ద్వారములు విడియున్నవి! వారిస్వాగతమునకై హస్తములు సారించుచున్నవి. కాని యీసంగర మొనరించిన యోధులు కనులైన దెరువజాలకున్నారు! ఎట్టి విచిత్రవిజయము !! ఏవస్తువుకై ప్రాణము లర్పించియుండిరో వానియెడ నింతటి విరాగము! కొంతకాలము గడచినపిదప శవములను నదియొడ్డుకు గొంపోయిరి. ఒకగంటకుపూర్వ మీయస్పృశ్యుల దిరస్కరించుచుండిన యీ హైందవసమాజ మిప్పుడీశవములపై బుష్పవృష్టి గురియించినది. త్యాగమునకెంత శక్తియున్నది.

మరిసుఖద! ఆమె విజయమున కధిదేవతయై యుండెను. అడుగడుగున నామెపేరుతో జయజయధ్వానములు చెలరేగుచుండెను. ఒకచోట పూలుగురిపించిరి. ఒకతావున ఫలప్రీతి జరిపిరి. ఒకస్థలమున నాణెముల వర్షించిరి. ఘడియకు మున్నామె నగరమున నగణ్యయైయుండెను.

ఈసమయమున నామె నగరమునకు రాణియయ్యెను. ఇట్టియశ మరుదుగనే లభించును. ఆమెకువాస్తవముగ నీసమయముననిరుదెసగల సౌధములొక్కింత నిమ్నతరములుగ, బాటకిరుగెలంకుల నున్నమనుష్యులు రవంత యల్పులుగ దోచుచుండెను. కాని యింతనమ్రత, యింత వినయము మున్నెన్నడు నామెయందు లేకుండెను. ఈయశము, నీయైశ్వర్యముల భారముచేత నామెశీర్షమొకింత యవనతమైనట్లుండెను.

ఇటు గంగానదీతీరమున చితులు బ్రజ్వలించుచుండెను. అటు దేవాలయమున దీపికామాలికలు వెలుగుచుండెను. నలుదెసల వీరుల యాత్మలు దీపించుచున్నవో యనిపించుచుండెను.

---

## —: 6వ ప్రకరణము :—

మరుసటిదినము కోవెలయందెంత సమారోహము జరిగినది, పట్టణమున నెంతగడబిడయైనది యెన్నియుత్సవములు జరిగినవి మొదలగు వానిని చర్చించుట యవసరములేదు. పవలంతయు భక్తులదళములు దేవుని దర్శన మొనరించుచునేయుండెను. బ్రహ్మచారి తిరిగి నేడు విరాజమానుడయ్యెను. వాని కానాడు లభించినదక్షిణలు వాని జీవితమందెన్నడు లభించియుండవు. అందువలన వానిమనసునందలి ప్రతికూలభావము మటుమాయమయ్యెను. కులీనులు మాత్రము దేవళములోనికి తమదేహములు సంరక్షించుకొనుచు వచ్చి ముక్కులుమూసికొని బయలుపడుచుండిరి. సుఖద మందిరద్వారమున నిలచి, యెల్లరకు స్వాగతము లొనరించుచుండెను. స్త్రీల గౌగిలించుకొనియు, బాలురననునయించియు, పురుషులకు నమస్కృతు లొనరించియు నామెయందరిని మన్నించుచుండెను.

నిన్నటిసుఖదకు నేటిసుఖదకు నెంతయంతరువున్నది! భోగ విలాసముల కసువులువిడచు రమణి నేడు దయ, సేవలమూర్తియైపోయినది.

ఈదుఃఖితుల భక్తి, శ్రద్ధ, యుత్సాహముగాంచి యామెహృదయము పులకితమై పోవుచుండెను. ఒక్కనికి నోడలినిండ గుడ్డలేదు, కనులలో తెలివిలేదు, దౌర్బల్యముకతమున నడుగులు తిన్నగపడుటలేదు కాని ప్రపంచరాజ్యము ప్రాప్తించినట్లు ప్రపంచమునందలి దుఃఖము, దార్ఢ్యము, లుప్తమైపోయినభంగి, భక్తిభావప్రమత్తులై పరుగుపరుగున వచ్చుచుండిరి. అట్టిసరళ నిష్కపట భక్తిప్రవాహమునబడి సుఖదయు తేలిపోవుచుండెను. మనస్విని, కర్మశీల, మహత్వాకాంక్షియునగు ప్రాణి కిదియె ప్రాయశః ప్రకృతిమై యుండనోవుపు. భోగులగువారే వీరు లగుదురు.

పిన్నలు, పెద్దలు నెల్లరు సుఖదపూజనీయగ భావించుచుండిరి. అవ్వారలభావన సుఖదయందొక గర్వమయసేవాభావమును ప్రదీప్త మొనరించుచుండెను. కడచిన దినమున నామెయొనరించిన నొకవిధ ప్రబలావేశమున నొనర్చియుండెను. దానికి ఫలమేమగునో యామెకణు మాత్రమైన చింతలేకుండెను. అట్టిసమయములందు హానిలాభముల విచారము హృదయములను దుర్భరములు గావించివెచును. నేడామె గావించుచున్నదానిలో గౌరవమునకనురక్తి, సద్భావము నుండెను. ఆపెకిపుడు తనశక్తి, క్షమ లజ్ఞానముకలిగెను. ఆత్మసిద్ధి నొందినవారు తమతమ స్మృతి విస్మరించి సేవారతులగుమాడ్కి సుఖదకియ్యది యొక విధమగు మైకమైపోయెను.

ఇపుడు సుఖద నగరమునకు నాయకురాలయ్యెను. పట్టణమున జాతిహితార్థమేకార్యముజరిగినను సుఖద దానికి విఘ్నేశపూజ గావించుచుండెను. ఏయుత్సవ, మేపరమార్థసంబంధమగు పని గావింపబడినను, రాష్ట్రహితమునకే యాందోళనజరిగినను సుఖదకందు ముఖ్యస్థానము లభించుచుండెను. ఆమెకిష్టమున్నను లేకున్నను జనులామెను లాగుకొని పోవుచుండిరి. ఆమె వచ్చుటయే సఫలతకు లాంఛనము. ఆశ్చర్యమేది యన సుఖద నేడుపన్యసింప నారంభించినది. ఆమె వక్తృత్వమున భాషా

చాతుర్యము లేకున్నను సత్యమగు హృదయప్రకటన యవశ్యముండెను. నగరమునగల యనేకములగు సార్వజనికసంస్థలు, కొన్ని సామాజికములు, కొన్ని ధార్మికములు, కొన్ని రాజనైతికములును నిర్జీవములైపడియుండెను. మాదకవస్తు బహిష్కారసభ వత్సరములనుండి చైతన్యవిహీనమై పడియుండెను. ప్రచారము రవంతయు జరుగుటలేదు. సంఘటన యూవంతలేదు. దానికార్యదర్శి యొక్కనాడామె నీడ్చుకొనిపోయెను. మరునాడా సభకొక భజనమండలి యేర్పాటయ్యెను. పరువురుపదేశికులు బయలువెడలిరి. మహిళలు చాలమంది యింటింట ప్రచారము సలుపుట కుద్యుక్తులైరి. పేట పేట పంచాయతులేర్పరుపబడెను.

ఇప్పుడు సుఖదకు పేదలదుర్దశయొక్క యదార్థస్థితి నవలోకించుటకు నావకాశము కలిగెను. ఇంతదనుక నావిషయముగూర్చి యామెకుగల జ్ఞానము వినికిడిమాత్రమున గలిగినదియే. కన్నులార చూచినప్పుడామెకు వినుటకు చూచుటకుగల యంతరము బోధపడజొచ్చెను. పట్టణమునందలి యిరుకుసందులందు గాలి, వెలుతురు, నెన్నడుచొరని చోటుల, తగినవైశాల్యములేనితావుల, గోడలుకూడ నెమ్ముకొనియుండు స్థలములలో దుర్వాశనచేత ముక్కులు పగులుమూలలందు, కష్టజీవులగు భారతదేశపు సంతానము; రోగదార్ఢ్యముల కాళ్ళక్రిందబడి నలిగిపోయి తమతమ జీవితములను మృత్యుముఖమునుండి దప్పించుకొనుట కుద్యమించుచు తమప్రాణము లర్పించుచున్నవి. నేటికామె అమరకాంతునకు విలాసమువెడగల విరోధము ధనముపైగల యసూయకును నెంతటి సత్యమగు హేతువున్నదో బోధపడసాగినది. ఇప్పుడామెకు యింటిలోనుండుట. మేలిదుకూలముల ధరించుట; మంచిమంచి వస్తువులు తినుటకు విముఖత్వము గలుగజొచ్చెను. సేవకులనుండి శుశ్రూషలుగొనుట యామె త్యజించెను. తనవస్త్రములు స్వయముగ నుదుకుకొనును. ఇంటిని చీపురుచేబూని తానేయూడ్చును. మున్ను పదిగంటలవరకు పరుండునామె తెల్లవారకమునుపే లేచును. గృహకృత్యము

లకు గడంగును. ఇపుడామెను నైనా పూజించుచుండును. లాలాజీ యిప్పటి తనగృహపరిస్థితిగాంచి లోలోన కుములుచుండెను. కాని యేమిచేయగలడు? సుఖదకు నేడునిత్యము కొలువుకూటమువలె జరుగుచుండెను. పెద్దపెద్దనాయకులు గొప్పగొప్ప విద్వాంసులు నరుదెంచుచుండిరి. అక్కటితమున నాతడు కోడలికి తొలగవలసి వచ్చుచుండెను. ఇంటికోడవలనిన వానికీదినములలో మొగము మొత్తిపోయెను. ఏయింట సానుభూతియుండదో యాపీట ననురాగ మెట్టులుండును? ఎచట తన యభిప్రాయముల యధికారముసాగునో యదియేస్వగృహము. ఎవరు తనవిచారములను మన్నింతురో వారేబంధువులు. ఈయిల్లు నేడాతనికి సత్రపుతుల్యమే. సుఖద నైనాల కేపని చెప్పుటకు నాతనికి జంకు పుట్టుచుండెను.

ఒకదినమున నైనాతో సుఖద "వదినే! ఇప్పుడీయింటిలో నుండుటకు నాకు మనస్కరింపకున్నది. ప్రజలు నీవు దివ్యహర్మ్యములో నివసించుచు మాకుపదేశములు గావించుచుంటివందురేమో! నెలలుగడచి పోయినవి. అన్నియు నొనరించి క్రియలసిపోతిని. కాని మద్యపానముల్పై నొక్కింతయు పనిచేయలేదు. అధికాంశము ప్రజలు తమదురవస్థలు మరచిపోవుటకే మత్తుపదార్థములు సేవింతురు. వారు మనమాట లేటికిని విందురు? మనముకూడ వారివలె నున్నప్పుడే వారికి మనపలుకులు నచ్చగలవు." అనెను.

కొన్నిదినములనుండియు చలి మిక్కుటముగనుండెను. కొంచెము వర్షముగురిసెను. పుష్యమాసపు శైత్యవాయువు లార్ద్రములై యాకసమును హాగమంచు చేగప్పివైచుచుండెను. పిల్లవాడు (వాడిప్పుడు పడుచు లేచుచు నడువగల్గెను) బయటికేగి యాడుకొనగోరుచుండెను. కాని శైత్యభీతి నైనావానినిపోనిచ్చుటలేదు. వానితల కున్నిటోపీకట్టుచు "ఇది బాగున్నది. కాని వాడివలె మనకు

నుండుట సాధ్యమగునా యని చూడవలసియున్నది. నేనేనైన నెలదిన ములలోనే చనిపోవుదు" ననెను.

సుఖద యిదివరకే మనసునిశ్చయము గావించి వైచుకొనియున్న దానివలె "నేనేదైన చిన్నయిల్లొకటి యేసంములోనో తీసుకొని కాపుర ముండ నాలోచించుచున్నాను. వానికా చలిటోపీ తీసియేలపార వేయవు? పిల్లలను రవంత వేడిగాడ్పు తగిలిన వాడిపోవు క్రోటనుమొక్కల గావిం చుట యవసరము. వారి కెండ, వాన, చలి, మంచు వేనిని లక్ష్యము సేయక సహింపశక్తిగల యాటవికవృక్షముల నొనరించుట మం చిది" అనెను.

మందస్మితముతో నైనా "ఆదినుండి యటులుంచలేదు. ఇపుడు పాపము వానిని శిక్షింపదలచుచున్నావు. ఏదైన జలుబు, రొంప పట్టిన పుచ్చుకొనుటకు బదు లీయవలసి వచ్చును." అనెను.

"సరియేనమ్మా! ఎటులుంచవలెనన్న నటులే యుంచుకొనుము నేనేమి చేయగలను."

"ఏల? మమ్ము్నను నీచిన్నియింట నుండనీయవా?"

"ఎవరి పిల్లవాడైన, వారి యిచ్చవచ్చినట్లు చేసికొనవచ్చు. నే నెవతెను?"

"అన్నకుముందు నీ విటులుంచియున్న నీకు వినతులు గావించి యుందును."

అభిమానముతో సుఖద "అప్పటిదాననే కియిప్పుడును తండ్రి గారితో తగవులాడి వేరింటికాపురము పెట్టినపుడు నేను వెంట నరుగ లేదా? ఆయన నేను విలాసినని తలచుచుండెడివారు కాని నే నెన్నడు విలాసములకు దాసినై యుండలేదు. అవును! మామగారికి కోపము గలిగించుట నాకిష్టములేదు' ఇంతమాత్రము దోసము నాయందుగలదు. ఇప్పటికైన వేరుగ కాపురముండినను వారియనుమతి గైకొనియే. చూతువుగాక? నే నేవిధముగ వారిమనస్సు నొవ్వకుండ స్వీవస్త్రావ

మును దెచ్చెదనో ఒక్కమారేగి శాంతికుమారుని చూచి రావలెను. నాకచటికరుగుట కవకాశమే చిక్కలేదు''అనెను.

నైనా దినమున కొకసారియైన శాంతికుమారుని జూచి వచ్చు చుండెను. కాని సుఖద కీసంగతి చెప్పలేదు. ఇప్పు డాతడు లేచి కూర్చుండ శక్తుడై యుండెగాని కట్టియూతలేక యడుగైన వేయజాల కుండెను. గాయములు తిన్నది యాతడు. ఆరునెలలనుండి మంచము పట్టినదియు నాతడే. యశము సుఖదకు దక్కెను. ఈవిచార మాతనిని కొంతకాలము వేధించెను. ఆతడు తనయాంతరంగికమిత్రులకైన నీ మాట చెప్పకున్నను, వానిహృదయమున నిది శల్యమై యుండెననుట వాస్తవము. సుఖద స్త్రీ గాకుండిన, నందును తనప్రియశిష్యుని పత్ని గాకుండిన, నీయవమానమున కాతడు పురముగూడ విడిచియుండెడు వాడే. అన్నిటికన్న నెక్కు డనర్థము, సుఖద రెండుమూడుపర్యాయ ములకు మించ వానినిచూచుట కేగియుండదయ్యెను. అతడుగూడ తన భర్తకు మిత్రుడు గావున నాసంబంధముచేత సుఖదకు వానియెడ విశే షము శ్రద్ధలేకుండెను.

నైనాకు సుఖద వెంట నేగుట కెట్టియిబ్బంది లేకుండెను. రేణు కాదేవి కొలదినములకిత్రమునుండి మోటారు పెట్టుకొనెను. కాని యిది సుఖదయుపయోగముననే యుండెను. వారుభయులు నందు గూరుచుండి బయలుదేరిరి. మన్నూ (లల్లూ) మాత్ర మింటనేల యుం డవలెను? నైనా వానినిగూడ వెంట నిడుకొని పోయెను.

సుఖద కొంతదవ్వేగిన పిదప "ఇది యంతయు ధనాఢ్యుల యాడంబరము. నేనే తలచుకొంటినేన్ని దినమునకు మూడణాలతో గడుపుకొనగలను" అనెను.

నైనా వినోదమునకు"ముందుచేసి చూపిన నమ్మకముకలుగును. నేనుమాత్ర మట్లు చేయలే''ననెను.

"ఎంతవఱకు నేను నీయింట నుందునో యంతవఱకు నేనును చేయలేను. అక్కఱతమునవే వేరుండవలెనన్న కోరుట"యనెను.

"తోడెవ్వరినైన నుంచుకొనవలెనా?"

"అవసరమని తోచుటలేదు. ఈపట్టణమున వేలకొలంది స్త్రీ లొంటరిగనే యుందురు. ఇక నాకు మాత్ర మేమికష్టమున్నది? నన్ను రక్షించువారు పలువు రున్నారు. నేనేస్వయముగ నాసంరక్షణగావించు కొనగలను (నవ్వుచు) ఔను! నాయంత నేనే యెవనిపైననైన నమలులు గొని మరణింతునేని యది వేఱుమాట" అనెను.

శాంతికుమారు డాపాదమస్తకము కంబళిగప్పుకొని; కుంపటి పెట్టుకొని, కుర్చీయందాసీనుడై యారోగ్యవిషయకమగు పుస్తకము చదువుకొనుచుండెను. వానికీ దినములలోని యాలోచన యెంతసాధ్య మైననంత శీఘ్రముగ తనకు బలము కలుగవలెననియే. ఉవిదలిరువురు వచ్చినసంగతి తెలియగనే పుస్తకమును ప్రక్కనిడి, కంబళీ యూడ్చి వైచి, కుంపటికూడ దొలగించి వేయవలెననుకొనెను గాని సమయము చాలదయ్యెను. వారిరువురు గదిలోనికి జొచ్చుటతోడనే ప్రణామము లొనరించి, కూర్చుండుట కాసనములు చూపించుచు "మీపై నాకీర్ష్యము గలుగుచున్న ది. ఈచలిలో హాయిగ తిరుగుచున్నారు నేను కుంపటి పెట్టుకొని కూరుచుంటిని ఏమి చేయుదును? లేవనశక్తుడను. జీవితమున నారునెలలు వృథా గడచిపోయినవి. అంతియేకాదు సగమాయుష్కాల మే జరిగిపోయిన దనవచ్చును. ఆరోగ్యము తిరిగి లభించినను సగము మనుష్యుడనే యైయుందును. స్త్రీలు గృహములువీడి బయటికేతెంచి మహత్కార్యము లొనరించుచుండ నేను గదిలో మూలకూర్చుండి యుంట యెంత సిగ్గుచేటు" అనెను.

సుఖద కన్నులొత్తుకొనుచు "ఈపట్టణమున మీరు వ్యాప్తి మొనరించిన జాగృతని గణించినచో మీయాయుష్కాలము చతుర్గుణములు ఘనతరమైనది. నేనుకూర్చుండియేయుంటినిగాని యశముచచ్చి పడినది" అనెను.

శాంతికుమారుని పాండురవదనమున నాత్మగౌరవచ్ఛవియలు ముకొనెను. సుఖద ముఖతః ఇట్టి సౌభాగ్యతాపత్రము వడయుటచే వాని జీవితము సఫలమైనట్లుత లెంచెను.

"ఇది మీ యౌదార్యము! మీరుచేసి చూపినది చేయుచున్నది మీవల్లనే కాదగ్గది అమరకాంతుడు వచ్చినచో వానికిచట స్థానమే లేదని బోధపడగలదు. ఈవత్సరకాలమున నిచటజరిగిన పనినాతడు కల యందైన భావనచేసికొని యుండజాలడు. ఇచటి సేవాశ్రమములో బాలికలసంఖ్య పెరిగిపోవుచున్నది అభివృద్ధి యగుచులేయుండిన వేరొక తావునకు మార్చవలసివచ్చును. ఉపాధ్యాయు లేడనుండివత్తురో చెప్ప జాలను. సభ్యసమాజ మింత యశ్రద్ధ చూపుటగాంచి నాకెంతయు విషా దము గలుగుచుండును. ఏదినిగాంచినను స్వార్థములో మునిగిపోయియుం దురు. ఎంత పెద్దవారైన నంత స్వార్థపరత్వమున్నది. ఐరోపాదేశము నుండి యుపాసించి యాహారము పడయగంటిమి. కాని యివియన్నియు నుండినను కూడ, మనభవిష్యత్తు ఉజ్జ్వలమైయున్నది. నాకందుకు సందే హములేదు. భాగవతీయుల యాత్మలు జీవించియున్నవి. మన సేవాత్యాగ ముల సనాతనాదర్శములు తిరిగివచ్చు నా శుభసమయము నాతిదూరము ననే యున్నదని నాకు సంపూర్ణవిశ్వాసమున్నది. అప్పుడు మనజీవిత ములకు ధనమే ధ్యేయము కాకుండును. అప్పుడు మన విలువ ధనపు తాసులలో దూచకుందురు" అనెను.

లల్లూ కుర్చీయెక్కి గూట్లపైనుండి సిరాబుడ్డితీసి యాచేతులు నోట బెట్టుకొని నలువురంగు బూసికొని సంతసించుచుండెను. నైనా వడివడి పరువిడి వానిచేతినుండి బుడ్డిలాగుకొని, వానినొక చిన్న దెబ్బవైచెను. శాంతికుమారుడు లేవ బ్రియత్నించి యటులొనర్పజాలక "ఏల కొట్టి దవు నైనా! ఎంతమహానుభావుడు? ఎవడు తననోట కాలిమబూసుకొని యు బ్రతున్నడగునో వాడుగాక మనవారా, ఎన్నంత యపకీర్తి నొదవిన ముసుగువెట్టుకొని మూలకూర్చుండువారము ఘనులము?" అనెను.

నైనా బాలకుని శాంతికుమారుని యంకతలమున గూరుచుండ బెట్టుచు "అటులైన నీమహాపురుషుని మీాకేతీసికొనుడు. వీనిమూలమున నాదమరచి కూర్చుండుటకైన వల్లకాదు" అనెను.

శాంతికుమారుడు బాలు నక్కునజేర్చికొనెను. ఆమృదులోష్ణ స్పర్శకతమున నాతనికి గలిగినతృప్తియు, మాధుర్యానుభవమును వాని జీవితమున క్రొంగ్రొత్తవి. అమరకాంతునియెడ వానికిగలస్నేహ మీా చిన్నియాకృతిలో నిమిడిపోయి, దృఢతరము నతిశయమునగుచుండెను. అమరుని స్మృతిచే వానికను లార్ద్రము లయ్యెను. అమరు డాత్మీయుల నెంతటి యనుపమానందమునుండి వంచించుచుండెనో తలచుకొని వానికి మరియొకింత విషాదము గలిగెను. నేటికాయనకు తనజీవితమునందొక విధమగు రిక్తత యభావముల జ్ఞానము కలిగెను. ఏవాంఛల నతడు తన మనసున నణచిపెట్టియుంచెనో యవి నివురుగవిసిన నిప్పుకలయట్లు తిరిగి రాజసాగెను.

బాలకుడు శాంతికుమారుని మోమున సిరా పులిమివైచి, యీా పనికే వానియొడిలోని కెక్కినట్లు క్రిందికిదిగుటకు పెనుగులాడెను. నైనా నవ్వుచు "మీాముఖ మొకింతచూచుకొనుడు ఈమహాపురుషుడు మీాతో వసంతములాడివైచినాడు. దుష్టుడ"నెను.

సుఖదకూడ నవ్వాపుకొనలేకపోయెను. శాంతికుమారు డద్దములో ముఖముచూచుకొనెను. ఆతడును విరగబడి నవ్వజొచ్చెను. ఆ కలంకమే వానికి యశోతిలకముకన్న నెక్కుడుల్లాసకరముగ నుండెను.

అంతట సుఖద "మీారు పెండిలి యేటికి చేసికొనలేదు డాక్టరు గారూ!" అని ప్రశ్నించెను.

శాంతికుమారుడు తనజీవితమున కాలంబనములుగ గావించుకొని యనుసరించుచున్న సేవయు, వ్రతము, నీశయ్యాగతుడైన దినములలో నించుక క్రింది కొరుగసాగెను. జీవితమునకేది మూలసత్యమని యాతడు భావించుచుండునో యది యీాతరుణమున నంత దిటవుగలేదు. యీా

యాపత్కాలమున వానికిని తనజీవితము భారముగదోచిన సమయములు పెక్కులుగలవు. ఉపచారములు సలుపువారికి లోటులేదు. ఎనిమిది ఝామములును వానిని నలువురైదుగురు పరివేష్టించి యుండువారు. పట్టణమందలి పెద్దపెద్దనాయకులు రాకపోకలు సలుపుచుండిరి. కాని శాంతికుమారుడు తానోరుల సహృదయత, యోగ్యతలపై భారము వైచితినని యోచించుచుండును. ఆత్మకుతుష్టిగలుగు కోమలత్వము మాధుర్యమున సేవయందు లోపించియుండెను. భిక్షుకుల కోరుల దానము నిరాకరించుట కేమియధికారముండును? దాన మేరూపమున లభ్యమైనను వానికి స్వీకరింపవలసి యుండును. ఈదినములయందాతనికి పలుమార్లు మాతృస్మృతి గలిగెను. ఆస్నేహమెంత దుర్లభమైనది! వానిస్థితి దెలిసికొనటకు నైనా యరుదెంచెడి కించిత్కాలమున వానికొకవిధమగు స్ఫూర్తియొక్క యనుభవము గలుగుచుండెడిది. ఆమె యతనిసమీపమున నున్నంతకాలము వానిబాధ యెచటనో మణగియుండెడిది. ఆమె వెడలుటయే తడవుగ నామూల్గు, నావేదనయు తిరిగి యారంభించెను. వాని యూహయందు మృత్యుముఖమునుండి దప్పించినది యీ్మానైనా యొక్క సరళానురాగమే యైయుండెను. కాని యామెస్వర్గీయ దేవత! మరియొండుకాదు! గణనాతీత?

సుఖదవైచినప్రశ్న విని చిరునవ్వునవ్వుచు "పెండ్లిచేసికొని సుఖపడువాని నెవ్వనిని గాంచకుండుట చేతనే" యనెను శాంతికుమారుడు.

సుఖద తనకిది ఘాతగభావించెను. "గోసమెల్ల స్త్రీలదిగనే యగపడుచుండునా?" యనెను.

శాంతికుమారుడు శిలాప్రహరణము తగులకుండ దప్పించుకొన్నవిధమున "నేనట్టు లనలేదు. విశేషించి దానికి ప్రతికూలమే పలికితినేమోకూడ" అనెను.

"ఇంతమాత్రమైన నొప్పుకొనుటయదృష్టము. ధన్యవాదములు. దీనిచేత పురుషులిష్టపడినచో వివాహము గావించుకొని సుఖింపవచ్చుననుట స్థిరపడినది."

"కాని యత్నించినగూడ నవరోధింపనేరని పశుత్వము పురుషులలో కొంతయుండును. ఆపశుత్వమేవారిని పురుషులుగ నొనరించును. వికాసములో నతడు స్త్రీకి వెనుకబడియేయుండును. ఎన్నడు వానికి పూర్ణవికాసముగల్గునో నాడాతడు స్త్రీయై పోవును. వాత్సల్యము; స్నేహము, కోమలత్వము, దయ వీనియాధారమున సృష్టి నిలచియున్నది. అవి స్త్రీలగుణములు. ఇంతమాత్రము స్త్రీ గ్రహించిన నిరువురి జీవితములును సుఖదములగును. స్త్రీ పశువుతోపాటు పశువై పోయినప్పు డిరువురిజీవితములు దుఃఖభాజనములగును.

సుఖద యుపహాసస్వరమున "ఈసమయమున మీరు నిక్కముగ నొక నూతనాభిప్రాయము ప్రకటించిరి. నేనింతదనుక స్త్రీ మూర్ఖురాలనియు, తాడనార్హయనియు, పురుషునిగళముకు బంధనమనియు నింక నేవేవో వినియుంటిని. సరి ఇటునుండి పురుషులకేజయము. అటునుండి పురుషులకే జయము. పురుషుడు నీచుడైన వానికి స్త్రీశాసనమేటికప్రియముగ నుండెను?" పరీక్షించిచూచిన తెలియును. మీరు దవ్వుననుండియే వెరచినారు.

శాంతికుమారు డామె నించుక శాంతింపజేయుచు "ఇపుడు వాంఛించినను ముదుసలు లేరికికావలెను?" అనెను.

"బాగు! మీరు ముసలివారై పోయితిరా? అయిన మీవంటి ముసలిదాని నెవత్తెనైన చేసికొనరాదా?"

"ఎన్నడూ మీవంటి విచారశీలయు నమరకాంతునిబోలు గంభీరుడును స్త్రీ పురుషులలో పుట్టియుండలేదో, తావత్పర్యంతము వారెట్టి పరీక్ష గావించుటకు నావశ్యకత లేకుండెను. అమరుని వోలె వినయము త్యాగము నాలోలేవు మరియు మీవంటియుదార..."

సుఖద వానిమాట కడ్డగించి "నేనుదారసీలను కాను. విచారశీలను కాను. పురుషులకు ప్రతియోగమేనా ధర్మమని తలంతును. మీరు నాకన్న పెద్దలు, మిక్కిలి బుద్ధిమంతులు, మిమ్ము నాయగ్రసోద

రునిగ దలంతును. నేడు తమస్నేహమును, సౌజన్యతనుగాంచి నాచిత్తమున కెంతయు శాంతికలిగినది. మిమ్ము నేను సిగ్గువిడచి యడుగుచున్నాను. స్త్రీయెడ తనధర్మము నెరుగని పురుషునకు స్త్రీ వ్రతధారిణియై యుండవలెనని యాశించుటకేమి యధికారమున్నది? మీరు యదార్థవాదులు. ఆవ్యవహారమునకు ప్రతీకారము నేను నావ్యవహారముతోడనే యొనరించియుండిన మీరునన్ను క్షమార్హనితలంపగలరా!" యని ప్రశ్నించెను.

శాంతికుమారుడు నిశ్శంకగ "లేను" అనెను.

"వారు క్షంతవ్యులని మీరెంచితిరా?"

"లేదు"

"ఇది యెఱిగియు మీరు వారినెద్దియు ననజాలరా? ఎన్నడు నొక్కలేఖయైన వ్రాయలేదు. ఈ యుదాసీనత కేమిహేతువని నేను ప్రశ్నించుచుంటిని. ఈసమయమున నొక్కనారి కవమానము జరిగినది కావుననేగదా! కాని యాకార్యమే నావలన జరిగియుండిన మీరప్పుడింతటి యుదాసీనులై యుండగలరా? చెప్పుడు."

శాంతికుమారుడు విషాదగ్రస్తుడయ్యెను. నారీహృదయమున సంచితమైనవ్యథ నేడీభీషణ విద్రోహరూపమున బ్రకటితమై యెంత కరుణాస్పదమై పోయినది!

ఆవేశముతోడనే సుఖద "పురుషులలక్షణము వారినెయ్యులబట్టి తెలియనగునని వచింతురు. ఎవరి సంగాతము మీరు, మహమ్మదుసలీం ఆత్మానందస్వామివంటి మహానుభావులతో నయ్యెనో, యట్టివారు తమ ధర్మము నంతగా విస్మరించుట యెట్లుసంభవించునో నాకు తెలియకున్నది. నేను నిర్దోషినని చెప్పుటలేదు. ఏస్త్రీయు నట్లు దృఢముగ చెప్పలేదు. ఏపురుషుడు నట్టి ప్రమాణము చేయజాలడు. నేను నక్షీనాను కలసికొంటిని. నాయందు లేనిగుణము లామెయందుండి యుంట సంభవమే. ఆమె మెక్కుడు మధురమయినది. ఆమె స్వభావమున కోమ

లత్వమున్నది. ఆమె యధికముగ ప్రేమింపగలిగి యుండవచ్చును కాని యీరీతిని స్త్రీపురుషు లొండొరుల తులదూచుకొనసాగినచో ప్రపంచముగతి యేమికాగలదు? అట్టులయ్యె నేని రక్తము, అశ్రులయొక్క వరదలుగాక నితరమెద్దియు గనుపింపజాలదు.''

శాంతికుమారుడు ఖిన్నుడై "నాతప్పు నేనంగీకరించు చున్నాను సుఖదా దేవి! మిమ్ము నే నెరుగను. విశేషించి మీ రేయొక్కింత మితిమీరిరని భ్రమలో నుంటిని. నేడే యమరునకు లేఖ..." అనుచునుండ సుఖదమాట కడ్డుతగిలి "వలదు. నేనిట్లు తమ్ము బ్రేరేపింపవలెనని వచ్చి యుండలేదు. మఱియు, మీరు నాపక్షమున వారినుండి దయాభిక్ష నర్థింపవలెననియు నేనుకోరను. వారు నాచెంగటనుండి దూరముగ పాఱిపోవలెనని వాంఛించుచున్నచో, నేను వారిని బంధించియుంప నిచ్చగింపను. పురుషునకే స్వాతంత్ర్యము లభించునో వానికదియే యుచితమగుగాక! అతడు సందుగొందుల దిరిగి తనతనువును, మనసును, విక్రయించుకొని బ్రదుకుగాక! నాబంధనములతోడనే నేను సంతసింతును. మఱియు నీశ్వరుడు నన్ను బంధనములలోనే గట్టివేచి యుంచుగాక! యనియు వేడుకొందును.

నేనీర్ష్య, తృష్ణలచే విచలితనుగాకమునుపే నన్ను దీసికొని పోవుగాక! యనియు ప్రార్థింతును. మిమ్ము గలిసికొనుటచే నాకు తృప్తియొదవినది. దానికిదియే ప్రమాణము, నేను నాతల్లి సన్నిధినైన ప్రసంగించి యుండని సంగతులన్నియు మీచెంగట ప్రస్తావించియుంటిని, యనుట. వదెన మిమ్ము నెంతగా ప్రశంసించుచుండునో, యంతకన్న నతిశయముగ మీసజ్జనత్వము గాంచితిని! కాని మిమ్మొంటరిగ నుండనీయను, ఈయింట మామఱదలిని కలిసికొనెడి శుభసమయము నీశ్వరుడు శీఘ్రమే ప్రసాదించుగాక!'' అని పల్కెను.

ఆరమణులిరువురు వెడలిపోవునపుడు డాక్టరు కట్టి యూతకొని వారిని ద్వారముపఱకు సాగనంపె, వీడ్కొనెను. క్రిమ్మఱి గదియందు

ప్రవేశించి, కుర్చీలో కూరుచుండుకొనినపుడాతనికి జవ్వనము తిరిగి జాగ్రత్త మైనట్లు తోచెను. సుఖద పల్కిన వేదనామయ వాక్యములాయన కర్ణ కుహరముల ప్రతిధ్వనించుచుండెను. నైనాపిల్ల వాని నెత్తుకొని తన సమ్ముఖమున నిలచియున్నట్లును భావించెను-

---

## —: 7వ ప్రకరణము :—

ఆ నాటిరాత్రియే శాంతికుమారు డమరుని పేర నొక జాబు వ్రాసెను. అన్ని పనులకు తీఱుబడియుండి లేఖలు వ్రాయుటకుమాత్రము తీఱిక యుండనివారిలో నాతడొకడు. ఎంతగాఢ సంబంధమో యంత తక్కువ యనమానమును. ఎంతయెక్కుడు ఘనిష్ఠతయో, యంతటి సందేహారాహిత్యమును, అతని మైత్రిలేఖలకన్న నెక్కుడు గంభీరమైనది. శాంతికుమారునకు సలీమువలన నమరకాంతుని సంగతు లన్నియు దెలియుచుండెను. లేఖ వ్రాయుట కేమి యావశ్యకతగలదు ? ఆతనికి సకీనాపై ప్రేముదయించెను. దానిబాధ్యత సుఖదపై నిడెను శాంతికుమారుడు. కాని నేడు సుఖదనుగలసికొనుటచే వానికి పటము నకు రెండవవైపును గానిపించెను. సుఖదనీబాధ్యతనుండి యాతడు విము క్తమునుగావించివైచెను. అతడు రచించినలేఖ కడుదీర్ఘమై యుండెను. ఒక్కొపుటయందే వత్సరమునుండి యాతడు వ్రాయనిలోటు తీఱిపోయెను. అమరకాంతుడు వెడలిపోయినదాది పట్టణమున జరిగిన సంగతులనన్నిం టిని యాతడు పూర్తిగవర్ణించెను. తన భవిష్యత్తునుగూర్చి యమరుని యభిప్రాయము నడిగెను. ఇప్పటివఱకు నాతడు తన యుద్యోగము నుండి విరమించుకొనలేదుగాని యీయాందోళనానంతరమునుండి వానికి తనయుద్యోగ పదవిలోనుండుట రుచించుటలేదు. శాంతికుమారునకు మాటిమాటికి "నీవు పేదలపక్షమున న్యాయవాదివైనప్పుడు, నీకు మా నమునకే నూరురూప్యముల వేతనము గ్రహించుట కేమియధికార

మున్నది? యను శంక గలుగుచుండెను. నీవు పేదలవలె బ్రదుకజాలని చో పేదల పక్షమున వాదించుట నుజ్జగింపుము. ఇతరులు సుఖించు నట్లు నీవును విలాసముగ తిని, త్రాగి సుఖింపుము" అనియును మనసు వేధించుచుండెను. కాని యీ సిద్ధాంతము వాని యాత్మ యొప్పుకొన లేదు. ఇక శేషించినది నిర్వాహ మెట్లు జరుగునను ప్రశ్నయే. ఏదైన పల్లెటూరికేగి పొలముదున్నుకొని బ్రదుకుటయా? కడుపు నింపుకొనుట యేయగునేని, యేపనియు జేసుకొనే జరుగగలదు. ఏలయన సేవాశ్రమ మునకు వలసినన్ని చందాలు లభించుచున్నవి. కాని దాన పరిగ్రహణ వృత్తిచే జీవించుట వాని యాత్మగౌరవమునకు ఘాతగనుండెడిది

ఉత్తరము వ్రాసి నాల్గుదినములైనను ప్రత్యుత్తరము రాలేదు. ఇది డాక్టరునకు కష్టముగ నుండెను. నిత్యము తపాలావానికై నిరీక్షించు చుండును. కాని జాబురాలేదు. హేతువేమి? అమరుడు వేరొండుతా వునకేగియుండడు గదా? సలీము చిరునామ తప్పుగ నొసగియుండలేదు కదా? ఏదైన జబ్బుచేసియుండలేదుకదా? రెండవలేఖ వ్రాయుటకు సాహసము కలుగకున్నది. పూరా పదిపుట లెవరు వ్రాయగలరు? ఆ జాబైన నిట్టిది యట్టిదికాదు. పట్టణపువత్సరపు చర్య యందు రచియింప బడియుండెను. అట్టిజాబు తిరిగి వ్రాయుట కుదురదు పూర్తిగ మూడు గంటలుపట్టినది. ఇప్పటి కెనిమిదినాళ్ళనుండి సలీము వచ్చియుండలేదు. అతడు ప్రస్తుతమున వేరొకప్రపంచముననున్నాడు. అది వాని ఐసి.యస్. గొడవ. ఇచటి కేలవచ్చును? నన్నుచూచి ముఖము చాటువేయు చుండబోలును. స్వార్థమను వస్తువేటికి భగవంతుడు సృజించినాడు? ఎక్కడి సేవకావృత్తి, ఏరన్న నసహ్యాము? ఎక్కడి ఐ. సి. యస్ వచ్చిపడినది? నవయువక సభకు సభ్యుడు కాంగ్రెసు సభ్యుడు. విశే షించి సామాన్య సభికుడుకాడు ముఖ్యపాత్రను వహించు సభ్యుడు!

మాయ, మోసములేక పరీక్షలో మాత్ర మేమి యుత్తీర్ణుడు కాగలడు? కాని నామినేషన్ కాగలదు. హాఫిజ్ గారు పూర్తిగా తన

పలుకుబడి నుపయోగించి తీరును. ఒక్కపరీక్షలోన నుత్తీర్ణుడు కాలేకుండెను. ఒకసారి ప్రశ్నపత్రము నెగురవేసెను. ఒకమారుచూచి వ్రాసెను. ఒకపరి లంచము లొసగెను. ఇక యిటువంటివాడు ఐ. సి. యస్. అగును!

ఇంతలోననే సలీము మోటారు వచ్చియుండెను. సలీము బండి దిగి కరస్పర్శ గావించుచు "మీరిప్పుడు ఆరోగ్యవంతులుగనే కనబడుచున్నారు. తిరుగను, నడువను ప్రయాసలేదుకదా?" యనెను.

ఒకింత యధిక్షేపభావముతో శాంతికుమారుడు "నాకిబ్బంది కలుగుచున్నదో లేదో నీకెందుకు? నెలగడచినవెనుక నీదర్శనభాగ్యము లభించినది. నేను బ్రదికిన, చచ్చిన, నీకేమిచింత? ఆపదయందెవడు సాయమొనర్చును? నీవును క్రొత్తపని యేదియుచేయలేదు" అనెను.

"కాదు డాక్టరుగారు! ప్రస్తుతము పరీక్ష జంజాటములోపడి యున్నాను. అదియన్న నాకసహ్యము. దేవుని కెఱుక! సేవకవృత్తి యనిన నాగుండె దడ దడలాడును. కాని యేమిచేయను? తండ్రి గంపెడాసపెట్టుకొని వెనుక నిలచియున్నారు. తిన్నగా నొక్క వాక్యమైన వ్రాయలేనని మీరెఱిగియే యున్నారు. కాని యోగ్యత చూచువారెవరు? ఇచట పట్టమొకటియే చూతురు. ఎవరు అధికారముయొక్క కాఠిన్యము నెఱిగి పనిచేయుదురో వారికి యోగ్యులగుటకు సావకాశము లేదు. నేటికాలమున నిదియే విద్య నేర్చుకొనుచున్నాను"

శాంతికుమారుడు మందస్మితమొనరించుచు "శుభము! కాని ఐ. సి. యస్ పట్టమంత సులువుగ లభింప"దనెను.

సలీము మీరీసంగతి యేమితెలియునను భావమొకింత సూచించుచు "అగునండి! కాని సలీమీ విద్యలో నాటితేరినవాడు. బి. ఏ. వఱకైనచో బాలురక్రీడ. ఐ. సి. యస్ లోనే నానేరిమియొక్క పరీక్ష కాగలదు. ఎల్లరికిని క్రిందుగనాపేరు గెజెటులు పడకున్న నాముఖము

నిక చూపింపను. తలచుకొన్నచో నందరికన్న పైనరాగల్గుదును. కాని లాభమేమి? రూప్యము లెల్లరకు నొకేవిధముగ లభించును" అనెను.

శాంతికుమారుడు "అగుచో నీవును పేదలరక్తమును పీల్తువా యేమి?"యని ప్రశ్నించెను.

సలీము సిగ్గులేకుండ "పేదలరక్తముతోనే మాపోషణ జరిగినది. ఇపుడు వేరేమిచేయగలను? ఏనాడిచట చదువున బ్రవేశించితినో యానాడే పరులధనముతో బ్రదుకుయోగ్యత ప్రారంభించినది. కాని నిజము చెప్పుచున్నాను డాక్టరుగారూ! నాబుద్ధియావంక కలుగుటలేదు. కొన్ని దినములు సేవకత్వము నెఱపినపిదప పల్లెలకు పోయెదను. బఱ్ఱెలు, గోవులు మేపెదను. కొంచెము ఫలములు, గిలములు పైరుగావింతును. చెమ్మటయూడ్చి సంపాదించిన దానినే తినెదను. నేనుకూడ మనుష్యుడనే యని తెలియగలదు. ఇప్పుడుమాత్రము నల్లిపోతువలె పరుల రక్తముతోనే జీవితము జరుగగలదు. కాని నేనెంత పతితుడనైనను, నాసానుభూతి పేదలపైననే యుండగలదు. అధికారము నడపినను ప్రజలకు సేవచేయవచ్చునని చూపించెదను. మాదికృషిక వంశము. మా తండ్రిగారు తమసామర్థ్యముచేత నీసంపదనార్జింపజాలిరి నాకు కర్షక ప్రజపై గల యంతటిప్రేమ యున్నతవంశ సంజాతులగు నగర వాసులకుండదు. ఇప్పటికిని మాగ్రామమున కేగుదునేని నాకచటి ప్రజలు ఆత్మీయులవలె దోచుచుండును. వారి నిష్కపట స్వభావము, వారి పరిశ్రమచూచిన మనసులో వారియెడ గౌరవముదయించుచుండును. వారిని జనులేల దూషింతురో తెలియదు. వారినెంత యన్యాయము చేయుదురు! నావశమైనచో దుష్టులగు నధికారులకు ద్వీపాంతరవాస శిక్ష విధింతును" అనెను.

శాంతి కుమారున కీయువకుని రక్తమున నింక నధికారవ్యాధూర్వాహుల కుచిత మగువిషము ప్రవేశించియుండలేదనియు, వినిహృదయ మింకను కళంకితము కాలేదనియు తెలియ నయ్యెను.

"ఎంతవఱకు ప్రజల చేతులయం దధికారముండదో యంతవఱకు నధికారులస్థితి యిట్టులేయుండును. నీనోటినుండి యీయభిప్రాయము వినుట నాకెంతయు సంతసముగనుండును. నాకుమంచివాడన్న వాడింత దనుక కంటబడలేదు. పేదల శవములపై శృగాలములనలెచేరి వారి పలల భక్షణగావించుచున్నారు. కాని యిది నీనశవములోని సంగతి కాదు. ఈచింతచేత మనసునకూరటగలిగించుకొనవలసి వచ్చుచున్నది. ఎన్నటికైన దైవమనుకూలించిన నీవును వారివలెనే యగుదువేమో యను శంకయు నప్పుడప్పుడు పీడించుచున్నది. ఈ హాహాకారము చల్లార్చుటకు నాలుగైగు ఘటములనీరువోసిన నదిమఱింత విజృంభించును. పరివర్తనకు పూర్ణమగుపరివర్తనకావశ్యకతగలదు. కావున తీక్ష్ణముగ నాలోచింపుము. దానమనసు పరిశుభ్రపడగలదు. దహించుటకు నావకాశములేనిచో నగ్నిదానియంతట నదియే చల్లారగలదు. అంతవఱకు మనముచేతులుకడుపుకొనుచుందుము. అంతియే. సరియేకాని అమరుని వార్త ఏమైన తెలిసినదా? నేనొకలేఖ వ్రాసితిని. ప్రత్యుత్తరమేమియు రాలేదు" అనియడిగెను.

సలీ మదరిపడి జేబులో చెయ్యివెట్టి యొక జాబును వెలికీడ్చి "దైవమా! జ్ఞాపకములేకపోయినది. నేటికి నాల్గుదినములైనది వచ్చి. జేబునందేపడియున్నది దినదినము ననుకొనుచుందును. నిత్యము మఱచి పోవుచుందును." అని దానిని శాంతికుమారున కొసగెను. డాక్టరు వడి వడి చేయిసారించి, లేఖనందు కొన్నిమృదులాగ్రహముతో వానిని రెండుమూడు మాటలని, జాబును చదువ జొచ్చెను.

"సుహృద్వరా! నేను జీవించియున్నాను మఱియు మీ యా దేశమును యథాశక్తి, పూర్తిగావించుచున్నాను. అచటి సమాచార మొక్కింతన్నె నా లేఖలవలన తెలియుచునే యుండెను. కాని మీజాబు చదివి, నేను విహ్వలుడనై పోయితిని కొద్దినాళ్లలో నచ్చట విప్లవము జరిగిపోయినని. ఈమూవగుద్బోధనకును గౌరవము నేను మీకేయొన

గుచున్నాను. సుఖద నేడు నాకారాధనీయయై పోయినది. ఆమెను గ్రహించుటలో నేనెంతటి భయంకరమగు ప్రమాదమొనరించితినో తలచుకొనిన నాకు దుఃఖము గలుగుచుండును. ఆమె యెట్టిదని నేను భావించితిని! తుదకామెయెట్టిదని తెల్లమయ్యెను! నాయూవత్తుతర్కము, వివేకము, ఉత్సర్గము లచేత నేది యొక్కింతయైన చేయనేగకపోతినో, దాని నామెయొక్క క్షణికములు చేసి చూపినది. ఒక్కొక్కప్పుడు గర్వముతో తల యెత్తుదును. ఒక్కొక్కతఱి సిగ్గుచే తలవంతును, ఎట్టి మహదజ్ఞానము! మనసన్నిహితులగూర్చి మన మెంత తెలియనివారమై యుండుచుందుమో తలచుకొనిన నాకు ఖేదముగలుగుచుండును. సుఖద జీవితమింత త్యాగమయమై పోవునని నేను కలనైన దలంచితినా? నాకీ యజ్ఞానమేల కలిగెను? సుఖదకడకేగి నాతప్పు సైరింపుమని ప్రార్థింప వలెనని తఱచు తోచుచుండును. కాని యేముఖము పెట్టుకొని రాను? నాకనులయెదుట నంధకారమున్నది! అభేద్యమగు నంధకారము! ఏమి యుతోచదు. నాయాత్మవిశ్వాసమంతయు నశించిపోయినది. ఏదియో యొక యగోచరశక్తి నన్ను తనకీలుబొమ్మగ నొనరించి, యాడించి, తునుక తునుకలుగ నొనరించి వైచుచున్నట్లు తోచుచుండును. నేను గేలమునకు దగుల్కొనిన చేప పగిది నున్నాను. గేలపుములికి నా కుత్తుకగుచ్చుకొనిపోయినది. ఎవరెట్లు లాగిన నట్లీడ్వబడుచుండును. త్రాడొక్కింత సడలిన పారిపోవ బ్రయత్నించుచుండును. మనుష్యుడు విధిచేతి కీలుబొమ్మయని నాకిపుడు బోధపడినది. ఆహేతువున విధిని నిర్దయుడని నేను నిందింపను. ఎచటినుంటినో యొక్కింత యెఱుగను. ఇక నాజీవనమునకు భవితవ్యములేదు. భవిష్యత్తుపై విశ్వాసమునులేదు. సంకల్పము లసత్యమని స్పష్టపడినది. కల్పనలు మిథ్యలని తెల్లమైనది. మీకు నిక్కవము వచించుచున్నాను. సుఖద నన్నాడించుచున్నది. ఆమాయావినిచేతి పుత్తళికనై పోయితిని. తొలుత నొకరూపము నగ పరిచి నన్ను భీతునిగానించి వైచినది. ఇక నిప్పుడు వేరొకరూపము బ్రద

ర్శించి నన్ను జితుని నొనరించివై చుచున్నది. ఆమె వాస్తవికరూప మేమో తెలియదు. ఇప్పుడు మున్ను నేనుకాంచిన సకీనారూపముకూడ యామె నిక్కమగు రూపమగునోకాదో చెప్పనేరకున్నాను. నన్ను నే నెరుగను. అతీతము సుఖదాయి. భవిష్యత్తు స్వప్నము. నాకు మిగిలినది కేవలము వర్తమాన మొకటియే.

తమ విషయమునుగూర్చి మీరడిగిన యభిప్రాయము నేమని చెప్పను? మీరు నాకన్న విశేషము బుద్ధిమంతులు. నాయభిప్రాయము సేవావ్రతధారులకు, స్వీయకాలక్షేపార్థము, కేవల నిర్వాహకమునకు ప్రజలనుండి గ్రహించుట కధికారమున్నది యని ఈస్వార్థమునుగూడ వారు తొలగించుకొనగలిగిరేని మరింతమంచిది.

శాంతికుమారుడు తృప్తిభావముతో లేఖనుబల్లపైనిడెను. ఏవిష యమునుగూర్చి యమరకాంతుని యభిప్రాయము తానడిగియుండెనో దానివిషయమాతడు రెండుముక్కలలో నెగురగొట్టివైచెను.

అతడు సలీమును 'నీకు కూడ నేమైన లేఖవచ్చినదా' యని ప్రశ్నించెను.

"అవును. దీనితోనే నాకు నొకటివచ్చెను"

"నావిషయ మేమైన వ్రాసియుండెనా?"

"అంత విశేషములేదు. రాష్ట్రమునకు నిక్కమగు నుద్బోధకుల కావశ్యకత గలదనియు నింక నేమేమో వ్రాసెను. దైవమెఱుగును తుదిదాక చదువనైనలేదు. ఈవిధమగు మాటలు పిచ్చిప్రేలాపనలని నాయూహ. పరిచారకులగుట యన్నమాట కర్థము మనబ్రదుకు పరుల దానధర్మములపై నాధారపడి గడుపుకొనుట యని నాయభిప్రాయము" అనెను.

డాక్టరుగారు గంభీరస్వరముతో "జీవితమును పరుల యీవులపై నాధారపడి గడుపుకొనుట, కఠినత్వముచేకాదు. విద్యాధికులు పేదల సణచియుంచుట కొకసంఘటన నేర్పరచిరి. దానిపేరే ప్రభుత్వము.

పేదలకు ధనికులకూ గల తారతమ్యము రూపుమాసినచో దొరతనము పేరంతరించిపోవును'' అనెను.

తమరు భావనాప్రపంచమునుగూర్చి మాటాడుచున్నారు. ప్రపంచమున దేవతలు ప్రసన్నులైనప్పుడే ప్రభుత్వమునకావశ్యకతలేకుండ పోగలదు''

"ఆదర్శమును నిరంతరము నెదుటనిడుకొనుట యవసరము''

"కాని శిక్షావిభాగము కఠిన వ్యవహారములుసల్పు విభాగము కాదు. ఎన్నడో మీరు మూరాబడిలో విశేషాంశము సేవాశ్రమము నకు వెచ్చింతురో, యప్పుడు మీరు మీవృత్తిని విసర్జించి సన్యాసులగుటకు కారణములేదు''

ఈ వివాద డాక్టరు మనసున నెలకొనెను. వానికి తన మనసును సరిపెట్టుకొనుట కొక సాధనలభించెను. మంచిది. శిక్షాశాఖకు శాసనముతో సంబంధములేదు ప్రభుత్వమెంత మంచిదైన, దానిశిక్షాక్రమమంత విస్తృతమగును. అప్పుడీ సేవాశ్రమమున కావశ్యకతయేమి యుండును? సంఘటితరూపమున, సేవాధర్మమును పాలించుచు, శిక్షాప్రచారము సాగించుట, యేయవస్థయందు నాపద గలిగించు సంగతి కాజాలదు. నెలల తఱబడి వానిమనసు కలవరపరచుచున్న సమస్య నేడు లఘువై పోయినది.

సలీమును వీడ్కొని, శాంతికుమారుడు సమరకాంతుని యింటి కేగెను. సుఖద కమరకాంతునిలేఖచూపి యామెకానందము సేకూర్ప వలెనని యాతడుద్దేశించెను. ఏసమస్య నేడాతనికి సులువై పోయెనో దానినిగూర్చి, తిరుగ వానికి సందియము జనింపజొచ్చెను. ఆసంశయ నివృత్తి గావించుటయు నవసరము. మనసువిచ్చి సమరకాంతుడు వానిని గలియలేదు. సుఖదవాని యాగమనవార్త వినుటయే తడవుగ వానిని లోనికి రావించెను. రేణుకాబాయియుపచ్చియుండెను.

శాంతికుమారుడు లోని కేగుటతోడనే యమరుని జాబుతీసి, సుఖదముందిడి, "సలీము నాల్గుదినములనుండి తన జేబులో పెట్టుకొనియుండెను. సంగతి యేమని నేను కంగారు పడుచుంటి"నని చెప్పెను.

సుఖ దయార్ద్రదృష్టితో" దీనిని గైకొని నేనేమిచేయ" నని ప్రశ్నించెను.

శాంతికుమారు డచ్చెరువడి "ఒకపర్యాయము దీనిని క్రొంచెము చదివిచూడుడు దాన, మీశంకలన్నియు సమసిపోగల"వనెను.

సుఖద యించుక కోపముతో" నామనసున నేటినిగూర్చియు నెట్టి శంకలునులేవు. ఈలేఖలో వ్రాయబడియుండగల సంగతులునే నెఱుగుదును. నాకు ప్రశంస యవసరములేదు. ఎవరికైన కోపమెట్లు వచ్చునో, యావిధముననే నాకు నాయావేశము వచ్చియైచ్చినది. అదియు క్రోధముతప్ప వేరొండుకాదు. క్రోధమును ప్రస్తుతింప జనదు"అనెను.

"అందు మిమ్ముగూర్చి స్తుతింపబడి యుండెనని మీరెట్లు గ్రహించిరి?"

"ఖేదమును ప్రకటింపబడి యుండనోపు"

"అట్లైన మీరభిలషించున దేద్ది?

"మీరెంతమాత్రము గ్రహింపజాలురేని నేనుచెప్పుటనిరర్థకము"

రేణుక యింతవఱకు మౌనముదాల్చియుండెను. సుఖద సంకోచము నవలోకించి" ఎన్నడాతడింతవఱకు తిరిగి రాలేదో, వాని మనోభావముమాఱినదని తెలియ టెట్లు? సుఖద వానిభార్యకాకుండినను గూడ నాతడామెను ప్రశంసింపగలడు. ఫలమేమి? ఎన్నడు స్త్రీపురుషులు సుఖముగనుందురో యిప్పుడే వారికి ప్రేమగలదని తెలియబడును. ప్రేమ కావలెను. హృదయములయందు ప్రేమయఱుదుగ జనించుచుండును. ధర్మము పాలించుట యభిలషనీయమే. పతివేలకొలది క్రోశములదూరమందుండియు సతిని ప్రశంసింపవచ్చును. స్త్రీయు నంతదూరముననుండియే ప్రశంసింపనగును. ఇంతమాత్రముచే నేమగును?"అనెను.

క్రోధముతో సుఖద "అమ్మా! నీవసంగతములు పల్కుచున్నావు. మనసు కనుకూలమగు వ్యక్తి లభించిననే జీవనము సుఖదము కాగలదు. వారికి నాకన్న శ్రేష్టమగు వ్యక్తి లభించినది. వారామె వియోగమున నిమగ్నులైయున్నారు. కాని వారికన్న నుత్తమ మగున దెద్దియు నాకింతవఱకు ప్రాప్తించలేదు. ఈజన్మమున గలుగదు. ఇది నాదురదృష్టము. ఇందెవరి దోసములేదు" అనెను.

రేణుక డాక్టరు నవలోకించి "వింటిరా బాబుగారు! ఇది నిత్యము నన్నిట్లు కాల్చుకొని తినుచుండును. ఎన్నిమారులు చెప్పితిని? పద. ఇరువురమునేగి వానిని పట్టుకొని వత్తము ఎట్లురాకుండునో చూతము. అని యౌవనమున కొలదిగో గొప్ప యొమార్గత్వ మెల్లరు చేయుదురు. కాని యిది తనంతతాను, నాతోరాదు. నన్నొంటిగపోనీయదు. సోదరా! ఏమువకుండ నోటికన్నము పోయెశి దినమొక్కటియైన నుండదు. మీరేటికిపోరాదు సోదరా! మీరాతనికి గురువులు, మిమ్మెంతో మన్నించుచుండును. మీపలుకు నాతడు మీఱజాలడు" అనెను.

"సుఖద నవ్వుచు, నేగును. నీవు చెప్పితివికనుక అడే వీరు బయలుదేరిపోవుదురు. వారి చాత్రివర్గములో తమ యాదేశములు పాలించువారొకరు దొఱకరని వీరికిని సుంత యానందము గలుగుచుండబోలును, వీరెల్లరు వివాహము సంఘమునకు కళంకమని తలంచుచుందురు. వీరి పంథలో వివాహమేరికిని పనికిరాదు. ఒకవేళ మనసు పట్టలేకపోయినచో నెవతెనైన నుంచుకొనుట యభిలషనీయము. వీరి రెండవశిష్యుడు సలీముగారు మనస్వామివారే) బలవంతములోపడి పెండ్లియాడికో తెలియరాదు. నేడు దానికి ప్రాయశ్చిత్తము సలుపుచున్నారు." అనెను.

శాంతికుమారుడు లజ్జించుచు "దేవీ! మీరు నాపై మిథ్యాయిపణలు గావించుచున్నారు. సేవయొక్క యాదర్శము మొదటినుండియు

నామనసు మండియుండుటచే నావిషయమున నేనుమాత్ర మవశ్యము నేకాంతజీవనము సేయసంకల్పించితిని,"అనెను.

సుఖద "వివాహిత జీవనమున సేవాధర్మపాలన యసంభవమా? లేక తనకామ్యములలోపడి, బాధగలిగింపకుండ యుండజాలనంతటి స్వార్థురాలా, స్త్రీ? గృహస్థుచేయగలిగినంతసేవ యేకాంతజీవి చేయ జాలడు. ఏలయన వానికి జీవితమునందలి కష్టముల యనుభముండ జాలదుకనుక" అనెను.

శాంతికుమారుడు వివాహమునుండి తప్పించుకొనుటకు ప్రియ త్నముచేయుచు "ఇది చర్చింపదగిన విషయము. ఈతగ విప్పుడు తీఱదు. నేనొకవిషయమునుగూర్చి మీయభిప్రాయము నెఱుగవల యును. మీతల్లిగారుకూడ నున్నారు. అది మఱియు శుభము. నేను నా సేవకావృత్తిని విరమించుకొని సేవాశ్రమకార్యమునే యేల చేయరాదని యాలోచించుచున్నాను" అనెను.

సుఖద యీప్రశ్న యడుగదగినదే కాదని సూచించు భావ ముతో "మీరొరులకడ చేయిచాచకుండ మీనిర్వాహకము జరిగించు కొనదలతురేని, తప్పకవదలివేయుడు. ఊరక పనిచేయువారి పోషణ భారము సంస్థపై బడును. కాని యింతకన్న శ్రేష్ఠమైనసంగతి, సేవా వ్రతుల సేవయందింతమాత్రము స్వార్థమునులేకుండుట" యనెను.

శాంతికుమారు డేతర్కముచేత తనయాత్మను శాంతింపజేసికొ నెనే వానికి మరల నిచటప్రత్యుత్తరము లభించినది. అతడు తిరుగ నాసందియములోనే పడిపోయెను.

అంత రేణుక "మీయాశ్రమమున కేదియైన శాశ్వతనిధి యు న్నదా?" యని పృచ్ఛించెను.

ఆశ్రమమున కెంతవఱకు నిధి యెద్దియులేకుండెను. శాంతికు మారుడు డీలేవడితన కొక్కపెద్ద కళంకముగ దలపోసి "లేదు. ఇంత వఱ

కునిధి యేర్పరుపజాలకుంటిమి. కాని నేను విశ్వవిద్యాలయమునుండి విముక్తిగాంచ జాలితినేని, దీనికై వలయు యత్నముచేయుదు'' ననెను.

రేణుక "మీయాశ్రమ మెన్నిరూప్యములుండిన సాగగల?'' దని యడిగెను.

శాంతికుమారు డాశనుచూపు ముఖముతో "ఆశ్రమ మొక విశ్వవిద్యాలయమును గావింపవచ్చును. కాని నాకుమూడునాల్గులక్షలు లభించినచో విశ్వవిద్యాలయమున నిరువది లక్షలతోఁగూడ చేయనేర నంతపని, నేను జేయగలను'' అనెను.

రేణుక చిఱునవ్వు నవ్వుచు "మీకేదిష్టమైన శాశ్వత సంఘనిర్మాణము గావింపగలరేని కొంచెము సాయముచేయగలను. ఇంతవఱకు సంచితమగుచున్న సంపద నిప్పుడనుభవింపగలవాడెవ్వడును లేడు. అమరుని స్థితిమీరుచూచియే యున్నారు. సుఖదయు నాపథమునే యనుగమించుచున్నది. కావున నేనును నాకొఱకొక దారినిచూచుకొన దలచుచున్నాను. నాజీవితము గడచుటకు నాకు నిధినుండి నెలకొక వంద రూప్యములిప్పింపుడు. నాజంతువుల పోషణభారమును నిధియే వహింపవలెను'' అని చెప్పెను.

శాంతికుమారుడు "సుఖదయు, నమరుడును సహర్షముగ నను మతించినపుడే నేను మీయాజ్ఞ స్వీకరింపనేర్తును. అదియుగాక పిల్లవానికి నధికారమున్నది'' అనెను.

సుఖద "నాపక్షమున నాకు సమ్మతమే. ఇక పిల్లవానికి పితామహుని యాస్తియేమంత చిన్నదా? తక్కినవారిమాట నేను చెప్పలేను'' అనెను.

రేణుక ఖిన్నయై "అమరునకు ధనమునకు చింతయుండిననొరుల కన్న తక్కువే. సంపత్తి ప్రకాశము వెదజల్లుటకు దీపికకాదు. ఎవనికి దాని యావశ్యకత లేదో దాని కుత్సుకకు దానినంటగట్టనేల? రూప్యము

లభార మలతిగాదు. స్వయముగ నేను నిర్వహించుకొననేరను. ఏదైన శుభకార్యమున కుపయోగించిన మంచిది. లాలా సమరకాంతుడు దేవళములకు, దేవతాకార్యములకు వ్యయించుచుండును. కాని నామనసటు వేగదు. మందిరములయం దింతమాత్రమే జరుగును. పూజయొనర్చు వారును లభింపరు. విద్యాదానము మహాదానము. అందును సంఘ బహిష్కృతులకు నేను చాలకాలమునుండి యాలోచించు చుంటిని. మిమ్ము గలిసికొననుంటిని. రెండు మూడు నెలలనుండియు నెద్దియు నిశ్చయము గావించుకొనలేకుంటిని. కాని మీరువచ్చుటచే నాయనిశ్చయభావము సమసిపోయినది. ధనమిచ్చువారలకు లోటులేదు. పుచ్చుకొనెడివారే లోటు. మనుష్యుడు తనధనము పాత్రులకే, యనగా దాత యిచ్ఛానుసారము వ్యయపఱచు వారికీయవలెనని కోరుచుండును. ఊరకే లభించిన ధనము నెగురవేయవలెననికాదు. దాత యిష్టానుసారము చూపులకుమాత్రమే కొద్దియో గొప్పయో వెచ్చించి మిగిలినది యింటిలో వైచుకొనుట కాదు.'' అని పలుకుచు మందహాసమొనరించి శాంతికుమారునితో

"మీరును మోసగింపరుకదా!''యనెను.

ఈప్రశ్న నవ్వుచు నడిగినను, శాంతికుమారునకు తప్పుగదోచెను. "నా నీతి యేమికాగలదో నేనెఱుగను. మీకు నన్నంతగా విశ్వసించుటకు తగిన కారణమునులేదు'' అనెను.

సుఖద యామాటను సవరించెను.'' అదికాదు సంగతి డాక్టరుగారు. అమ్మి మొకసక్కెమాడినది'' అని.

డాక్టరు "విసము మధువుతోనైనను సద్భావము చూపించు న''నెను.

"ఇది అంత తప్పుపట్టుకొనదగినమాట కాదు''

"నేను దోసమెంచుటలేదు. పదిపండ్రెండు వత్సరముల పాటిం

కను పరీక్షగానిండు. నేనిప్పుడే యంతటి విశ్వాసపాత్రుడను కాలేదు'' అనెను డాక్టరు.

రేణుక యోటువడి "మంచిది డాక్టరుగారు. నేను నాప్రశ్న నుపసంహారించు కొనుచున్నాను. తమరు రేపు మాయింటికి దయచేయుడు. మోటారంపెదను శాశ్వత ధర్మసంస్థ నేర్పరచుట మొదటిపని. ఇక నన్నిప్పు డెద్దియు నడుగకుడు. మీపై నాకు పూర్తిగ నమ్మక మున్నది'' అనెను.

శాంతికుమారుడు ధన్యవాదము లొనరించుచు "నేను మీవిశ్వాసము నిలువబెట్టుటకే కష్టించెద''ననెను. రేణుక "నేనీకార్యము సత్వరముచేసివేయవలెనని కోరుచున్నాను. అట్లుపైన్నైనా వివాహము వచ్చిపడును. అయినచో నెలలతఱబడి తీఱికయుండ'' దనెను.

శాంతికుమారుడు చలిచేపవలె ముడుచుకొనిపోయి'' శుభము నైనా దేవి వివాహము కానున్నది. ఇది శుభవర్తమానము. నేను రేపే మీ-మ్ముగలసికొని విషయములన్నిటిని నిశ్చితము గావించి వైచెదను. అమరునకును సూచింతునా?'' యనెను.

సుఖద కఠోరస్వరముతో "అవసరము లేదు'' అనెను. రేణుక "అట్లుకాదు. మీరాతనికి సూచన గావింపుడు. బహుశః రాగలడు. వచ్చుననియే నాకాసయున్న''దనెను.

డాక్టరు వెడలిపోవుచుండ, నైనాబాలకునెత్తుకొని, మోటారు దిగుచుండెను.

శాంతికుమారుడా హతకంఠముతో " నీవిక వెడలిపోవుదువా నైనా!''యని ప్రశ్నించెను.

నైనా తలవంచుకొనెను. కాని యామె కనుగవ యశ్రుజలార్ద్రమయ్యెను.

## —: 8వ ప్రకరణము :—

ఆరునెలలు గడచిపోయెను.

సేవాశ్రమమునకు శాశ్వతధర్మసంస్థ యేర్పాటు గావింపబడెను. ఆశ్రమమునగల ప్రముఖకార్యకర్తయు, తీవ్రసమిష్టి వాదియునగు నాత్మానందస్వామిమాత్ర మీయేర్పాటున కసంతుష్టుడై తన సంబంధమును వదలుకొనెను. ఆతడు శాశ్వతవర్గము నేర్పాటు గావింపరాదని పట్టుపట్టెను. ఆతనికి ధనికుల నాశ్రమములు బ్రవేశపెట్టుట కిష్టము లేదు. ఆశ్రమముయొక్క వ్యక్తిత్వము నమ్ముకొనుట యాశ్రమమునకు ఘాతయని యతని యూహ. ధనముయొక్క ప్రభుత్వముచేతనే హైందవజాతి యల్పులను తనబానిసలుగ నొనరించుకొనినది. ధనము కారణముగనే యుత్తమాధమ విభేదమేర్పడినది. అట్టిధనమున కాశ్రమస్వాతంత్ర్యము నేల విక్రయింపవలెను? కాని స్వామిజీ యభిప్రాయము సాగలేదు. సంస్థయేర్పాటు జరిగిపోయినది. దానికి శంకుస్థాపన సుఖద గావించెను. పెద్ద సభజరిగెను. ఉత్సవము జరిగెను. మేళతాళము లాటపాటలు జరిగెను. మఱునటిదినము శాంతికుమారుడు తనయుద్యోగ ముజ్జగించివైచెను.

సలీము పరీక్షలై పోయెను. ఆతడు భవిష్యత్సూచన మేవిధముగ నొనరించి యుండెనో, యారీతిగ వానిపేరందఱికినిక్రిందుగ నుండెను. డాక్టరు విస్మయమునకు మేరలేకుండెను. నియమానుసారము సలీమిపుడు రెండువత్సరములపాటు పశ్చిమదేశమున కేగవలసియుండెను. కాని సలీము పోవనిష్టపడకుండెను. ఒకటి రెండు నెలలైనవిలాసార్థము పోయి గడపిరాగలడు. కాని రెండేండ్లచ్చట గడుపుట కంటకముగనుండెను. నిజమునకు వానికి స్థానముదొఱకకుండవలసినదేకాని యిచట గూడ నాతడు విశేషయత్నము, హడావుడి చేయుటచే నెట్టెటోవాని నీనియమమునుండియు విముక్తునిగావించి వైచిరి. జిల్లాయందలి పెద్ద వైద్యశిఖామణి యింగ్లాండునందలి చలి వానియారోగ్యమునకు భంగ

కరమని వక్కాణించుచుండ నట్టియనవసర బాధ్యత నెవరు నెత్తినిబెట్టుకొన గలరు? హాఫిజ్ హాలీమ్ తనకుమారుని పంపుటకు సిద్ధముగనేయుండెను. రూప్యములు వెచ్చించుటకును సిద్ధుడుగనే యుండెను. కాని తనయుని యారోగ్యముచెడిపోయినచో నాతనికి పాప్రెద్ది? ఆయనయొక్క గౌరవముచేత సలీమున కిచటను విజయమే చేకూరెను. ఆతనికి వాని మిత్రుడమరకాంతుడున్న జిల్లాకే యధికారము లభించెను. వానికా జిల్లాయే నచ్చెను.

ఇట్లు సలీము ప్రవర్తనయందును విశేషము మార్పుకలిగెను. ఆతడు తొంటిరీతిని నవ్వుముఖముతోనే యుండెను. కాని పూర్వమంతటి విలాసము నంతటి రసికత్వము లేకుండెను. వివాహముగూర్చి వానికి గల మునుపటి యనిష్టము పూర్తిగ తొలగిపోవుచుండెను. ఆకస్మికముగ నీపరివర్తన మెట్లుకలిగినదో చెప్పలేము కాని యీతడు పెక్కుమార్లు సకీనాయింటికి వెడలియుండెను. విశేషించి యిరువురిమధ్య నుత్తరప్రత్యుత్తరముల వ్యవహారము సాగుచుండెను. అమరునిగూర్చి విచారము దొలగినను, సకీనా వానిపూర్వప్రణయము నెట్టు లేకాగ్రతతో నుపాసించుచుండెనో తదనురాగము గాంచిన సలీము ముగ్ధుడైపోవుచుండెను. ఈజ్యోతిచే నాతడు తనజీవితము నాలోకితము గావించుకొనుట కువ్విళ్ళూరుచుండెను. దాదివలన నాతడు సకీనాయొక్క యపారప్రేమవృత్తాంతము విని చాలవిచారించుచుండెను. భ్రమరముభంగి క్రొత్తక్రొత్త పుష్పముల మధువునాన నాశించువానిహృదయము నేడుసంయమితానురాగముచే పరిపూర్తితమై వానిజీవనమున కొక శాల సాధనయొక్క సృష్టి గల్గించుచుండెను.

నైనా వివాహము జరిగిపోయెను. లాలాధనీరాము నగరమంతటిలో ధనాఢ్యుడు. వానితనయుడు మణీరామ్ వృద్ధికి రాదగినయువకుడు నమరకాంతునకు మాత్రము వారితో సంబంధము కుదరగలదను నాస లేకుండెను. మణీరామ్ పూర్వము దేవళమున జరిగిన సందర్భము నాటి

నుండియు నీకుటుంబమువారిని హేయులుగ దలచుచుండెను. కాని సమరకాంతుని సంచులు వానిని తుదకు సఫలీకృత మనోరథుని గావింప జాలెను. పెద్దపెద్ద యేర్పాటులు గావింపబడెను. చాల వైభవముతో వివాహము జరిగెను. దూరదూరమునుండి బంధువర్గములు విచ్చేసెను. కాని యమరకాంతుడు రాలేదు. సమరకాంతుడు వాని నాహ్వానింపను లేదు. అమరకాంతు డరుదెంచినచో నుత్సవము వారిగుమ్మమునుండియే మరలిపోగలదని మణీరాముడు సూచించియుండెను. ఆసంగతి సమర కాంతుని చెవులబడెను. నైనా ప్రసన్నురాలుగలేదు. దుఃఖితగనులేకుం డెను. ఆమె యులుకక పలుకకయుండెను. తండ్రియిష్టమునకు ముం దామె యేమిపలుకగలదు? మణీరామునిగూర్చి యామె వివిధములగు వార్తలు వినుచుండెను; త్రాగుబోతనియు, వ్యభిచారియనియు, మూర్ఖు డనియు, గర్విష్టియనియు కాని తండ్రియభిమతమునకు ముందు తలవొ గ్గుట యామె కర్తవ్యమై యుండెను. తండ్రి యామె నే దేవతకైన బలి యొసంగిన నామె నోరుమెదుపదు. కేవలము పీడ్కోలుతరుణమున మాత్రమామె దుఃఖించెను. కాని యప్పుడుకూడ తండ్రికేవిధమగు చింతయు గలుగకుండవలెనను ధ్యానమామెకుండెను. సమరకాంతుని దృష్టిలో నన్నిటికన్న ధనమే విలువయగువస్తువు. నైనాకు జీవితానుభవ మేమియున్నది? అట్టివిషయమున తండ్రినిశ్చయమే యామెకు మన్నింప దగ్గది. ఆమెహృదయము శంకాకులితమై యుండెను. కాని, తానుకర్త వ్యమని తలంచు కార్యము నిర్వహించుచు నశువులు గోలుపోయిన నామెకు చింతలేదు.

ఇచట సుఖద శాంతికుమారుల సహయోగము దినదిన మధిక మగుచుండెను. ధనము లోటులేదు. పేట పేట సేవాశ్రమసంఘము యొక్క శాఖలు నెలకొల్పబడెను. మాదకవస్తుబహిష్కారమును తీవ్ర ముగ నాగుచుండెను. సుఖద జీవితమున నొక కఠోరతపస్సు సాగుచుం డెను. ఇప్పుడామె యుదయము సాయంతనమును వ్యాయామమొనరిం

చును. భోజనమున రుచికన్న పోషణ కెక్కుడు లక్ష్యము సేయుచుం డెను. సంగ్రామమును, నిగ్రహమును సుఖద జీవితచర్యలో ప్రధానాం శములు. నవలలకన్న నామెకు ధార్మికవిషయములు, ఐతిహాసికవిష యములు నెక్కుడానందము గలిగించుచుండెను. ఆమె సంభాషణ శక్తియు శ్రోతల కాశ్చర్యము గలిగించువగుటవలన నతిశయిల్లుచుండెను. దేశము, సంఘముయొక్క దశగాంచుటజేసి యామెకు వేదన యధి కముగ గల్గుచుండెను. అదియే యామె వాగ్ధోరణిని యాకర్షణీయముగ నొనరించుటకు ముఖ్యరహస్యము. ఈయదార్థ కార్యప్రణాళికలో నింకొకవిషయముగూడ బయలుదేరెను. అది పేదల నివాసగృహముల గూర్చిన సమస్య. వారి వాసగృహముల శుద్ధ సమస్య, తీరనిదే సఫలీ కృతము కాజాలదని యనుభవమువలన తెలియవచ్చెను. ఆపని చందా లవలన నగునదికాదు. ఇది పురపాలక వర్గమువారు తమచేతులలోనికి దీసికొనవలసిన సమస్య. అయిననింతటి మహాత్కార్యమును చేపట్టుట కాసంస్థ భయపడుచుండెను. దానికి హాఫిజ్ హలీమ్‌గా రధ్యక్షులు,లాలా ధనీరా ముపాధ్యక్షుడు, అట్టి మహానుభావుల మస్తిష్కములనిట్టి సమస్య యొక్క మహత్వ, దానియావశ్యకతల నెక్కించుట కష్టతరము. ముప్పురో నలుగురు సత్పురుషులు స్థలములభించినచో నాలుగైదు లక్షలు వెచ్చించుటకు సంసిద్ధులైయుండిరి. అందు లాలాసమరకాం తుడుగూడ గలడు. నూటికి నాలుగణాలు వడ్డీ గిట్టిన చాలునని యాత డూహించెను. గాని స్థలమెట్లు దొరకునని యేచింత, సుఖద, పాఠశాల లకు, క్రీడాశాలలకు, యంత్రాగారములకు నూరకే స్థలము నొసంగుపుర పాలక సంఘము పేదలకు వసతులు నిర్మించుట కేలయీయరావని వాదించుచుండెను.

సంజవేళ శాంతికుమారుడు పురపటముల కట్టయొకటిగొని తెచ్చి సుఖద కొక్కొకపటమే విప్పిచూపుచుండెను. అది నిర్మింపబడబోవు

గృహాములపటము ఒకటి యర్థరూపాయి. యొకటి రూపాయి, యొకటి రెండురూప్యములు. మాసమున కద్దెకురాగల యిండ్లపటములు. అర్థ రూప్య మిచ్చువానిలో నొకగది, యొకవంటిల్లు. నొకవసారా, యెదుట నొకవసారా, చిన్నముంగిలి యొకటియుండెను. ఒకరూపాయి బాడుగ నిచ్చుయింటిలో రెండుగదులు, రెండురూప్యములొసగువానిలో మూడు గదులు నధికముగ నుండెను. గదులకు కిటికీలు, గోడలకు రెండడుగుల యెత్తువఱకును, నేలయంతటను గచ్చు, గల యిటిక సున్నముతో కట్టిని యిండ్లు, కప్పు పెంకుటికప్పు. రెండురూపాయిల యిండ్లకు శౌచగృహామునుండెను. తక్కినవాని కై దేసి యిండ్లకొక శౌచగృహాముండెను.

సుఖద "మీరు రాబడికూడ లెక్కించినారా?" యనెను. "మఱేమి? ఊరక పటములుమాత్రము వ్రాయించితినా? ఎనిమిదణాల యిండ్లనుండి రెండువందలు రాబడియుండును. రూపాయివానికి మూడు వందలు. రెండురూపాయిలవాటికినాల్గువందలు. నాల్గణాలు వడ్డీపడును.

"మొదట నెన్నియిండ్లకు ప్రణాలిక?"

"అధమం మూడువేలు దక్షిణపు దిశకును రమారమి యిన్నియిండ్ల కేయవసరముండును. నేను లెక్కవైచితిని. కొందరు స్థలములు దొఱికిన వెనుక సొమ్మునీయగలరు. కాని యెంతలేదనినను పది లక్షలు కావలసివచ్చును."

"చంపినారు! పది లక్షలే! ఒకదిశకు?"

"ఐదు లక్షలకు పెట్టుబడిదార్లు దొఱికినచో తక్కినవి ప్రజలు స్వయముగ నిచ్చుకొందురు. కూలిలో లాభమెక్కుడుగ రాగలదు. తాపీవాండ్రు, త్రవ్వువాండ్రు, నడ్రింగులు, కమ్మర్లు సగము కూలికే పనిచేయుదురు. తోప్రుడు బండివాండ్రు, గార్ధభవాహనశాఖవారు, బండివాండ్రు, వీలయినంతవఱకు కూలిలేక నేపనిచేయుటకు సమ్మతించినారు."

"చూడుడు! బహుశః జరుగవచ్చును. మామగారు రెండు మూడు లక్షలీయవచ్చును. అమ్మయొద్దకూడ నిప్పటికిని కొంచెమో గొప్పయోయుండి యున్నది. తక్కినగూప్యముల కొఱకు తంటాలు పడవలసివచ్చును. అన్నిటికన్న స్థలముకొఱకే కష్టమెక్కువ"

"కష్టమేమున్నది? పదిబంగాళాలు పడగొట్టి వైచినచో కావలసినంత స్థలములభింపగలదు"

"బంగాళాలు పగులగొట్టించుట యంతసులభమని మీరెంచుచున్నారా?"

"చులకన యనుకొనుటలేదు. కాని యుపాయమేమున్నది? ఊరికి వెలుపల నేరునుండరు అక్కతమున పట్టణములోనే స్థలముపుట్టింపవలెను. కొన్ని భవనములు వేయిమంది సుఖముగ నివసించుటకు చాలినంత విశాలములై యున్నవి. మీగృహముమాత్రము చిన్నదా? ఇందు పదిపేదకుటుంబములు హాయిగ నివసింపనగును"

సుఖద మందస్మితముతో '‹మీరుమామీద నే సాధన చేసికోవలెనని మూహించుచున్నట్లున్నది" అనెను.

"మార్గోపదేశకులే ముందునడువవలెను"

"నేను సిద్ధమే. కాని పురపాలకవర్గము దగ్గర నేవిధైన "ఖాళీ స్థలములుండునా?

"అగును. ఏలయుండవు? నేనుసంగతి కనుగొంటిని. కానిహాపిజ్‌గాగున్న స్థలముల విషయమిదివఱకే యేర్పాటులు జరిగిపోయిన వనుచున్నారు.

ఇంతలో సలీము మోటారునుండి దిగి శాంతికుమారుని పిలచెను. ఆయనవానినిలోనికిరాబిలచి, "ఎచటినుండివచ్చుచుంటివని" ప్రశ్నించెను.

సలీము ప్రసన్నవదనుడై" రేపురాత్రి వెడలిపోయెదను. మిమ్ములను కలసికొనిపోవుదమని తలచితిని. ఈవంకను వీరిని కలసికొనుట గూడ జరిగినది" యనెను!

"అయిన నూరకే వెడలిపోయెదవా మిత్రమా! విందు, సభ, యుత్సవములేటూలేవా? వహ్వా" యనెను. శాంతికుమారుడు.

"రేపు సాయంతనము సభయున్నది. ఆహ్వానము తమ విడిచి కంపితిని. కాని మీవిషయములో సభలో కలసికొన్నంతమాత్రమున చాలదుగదా!" యనెను.

"అయినపోవుచు, పోవుచు మాకొక్కింత సాయమొనరింపుము. దక్షిణ దిశను పురపాలకవర్గమునకుగల యిండ్లస్థలము నూరక యిప్పించునట్లుచేయుము"

"సలీముసుఖముగభీరమయ్యెను. ఆస్థలముల విషయము మాటలు జరిగిపోయెను. పెక్కురు సభికులు తమభార్యలపేర, పిల్లలపేర వాటిని కొనుటకు నోళ్ళు తెఱచుకొని యున్నారు."

సుఖద యాశ్చర్య పరవశురాలై పోయెను.

"సరియే. లోలోన నీకపటనాటకముకూడ జరుగుచున్నదా?

అయిన మీసాహాయ్యావశ్యకతము నినుమడించును. ఈ మాయాజాలములను భేదించుట మీకర్తవ్యమైయున్నది"అనెను.

సలీము ముఖముతిప్పుకొని "ఈవిషయమై మాతండ్రిగారు నేను చెప్పిడిది రవంతయు వినరు. అదియుగాక విషయము నిశ్చితమై పోయినదికావున దానినిగూర్చి నిర్బంధపెట్టుటయు నుచితముకాదు."

అని పలుకుచు సుఖదా శాంతి కుమారుల కరస్పందనముగావించి, యిరువురను మరునాటి సభకు తప్పకరావలెనని చెప్పి సలీము వెడలిపోయెను. అచట కూర్చుండుట వానికి తరుణమున కుశలముకాదు.

శాంతికుమారుడు "చూచితిరా! ఇంకనుద్యోగస్థానమును స్వీకరింపలేదు. కానిచేష్టలలో నప్పుడేయధికారగంధము వచ్చి వేచినది. ఈ ప్రయత్నమున కీతడు సముడు. కాని నేడెట్లు పరిణమించినది! హాఫిజ్ గారితో గట్టిగా చెప్పనతో కొప్పుకొనకుండుట యసంభవము" అనెను

సుఖద ముఖమండలమున నాత్మగౌరవచ్ఛాయ యలముకొనెను "మనము న్యాయయుద్ధము చేయవలసియున్నది. న్యాయమే మనకు సాయపడగలదు. మనమే యితరుల సాయమునకు ముష్టియెత్త నక్కర లేదు" అనెను.

ఈసమయమున సమరకాంతుడు లోనికేతెంచెను. శాంతికుమారుడాసీనుడైయుండుట గాంచి యులికిపడెను. కాని "హాఫిజ్ గారితోనేమి సంభాషణ జరిగినదో చెప్పుడు డాక్టరుగారు" అనెను.

శాంతికుమారు డప్పటివఱకు జరిగినదంతయు వినిపించెను.

సమరకాంతు డసంతుష్టిభావము ప్రకటించుచు "మీరు విదేశములలో చదువుకొనివచ్చినవారు కాని, న్యాయము, ధర్మము, సత్యము వీటిపేరుతో స్థలము లభింపవలెనని కోరినచో నీపాటికి విరమింపుడు. ఈకార్యసాధనకు పది, యిరువదివేలు వ్యయపరచవలసియుండును? ప్రతిసభ్యుని వేరువేరుగ కలసికొనుడు, వానిస్వభావ మెట్టిదో, యభిప్రాయమెట్టిదో, వేషభాషలెట్టివో యఱయుడు? ఆయారీతుల వానిని వశము గావించుకొనుడు. సంతోషపెట్టవలసివచ్చిన సంతోషముపెట్టి, రజముతో సమాధానపరచవలసివచ్చిన రజతమునొసగి, రక్షరేకులు తాయెతులు, మంత్రములు, తంత్రములు, వేనిసాయమున కార్యసిద్ధియగునో వానివలన కార్యము సానుకూలమొనర్పుడు. హాఫిజ్‌గారితో నాకు పూర్వపరిచయముకలదు. పాతికసంచులు వంటవానిద్వారా వారి కందజేయుడు. అటుపైనచూతము స్థలమెట్లు లభింపదో సర్దారు కళ్యాణసింహునకు గృహనిర్మాణకార్యమున గుత్తకిత్తుమని వాగ్దానము గావింపుడు. అతడు వశ్యుడగును. దూబేగారికి నాలుగైదుతులముల చంద్రోదయము నొసగిన వానిని పట్టుకొనవచ్చును. ఖన్నాతో యోగాభ్యాసమునుగూర్చి ప్రసంగింపుడు. ఏయోగిపరిచయమైన గావింపుడు. ఆయోగి వానికి నాలుగైదు యోగాసనములు నేర్ప

గృహములకు నామకరణము గావింపుడు. దానిచే కొంత ద్రవ్యసాహాయ్యముకూడ లభింపగలదు. రూప్యములవిషయమై నిశ్చింతగనుండుడు. వణిజుల నిందించిన నిందింపుడు. కాని పరమార్థమువిషయమున వణిక్కే ముందంజవేయును. పదిలక్షలవఱకు నేనుబాధ్యత వహింతును. పలువురుమిత్రులనుకలిసికొనివచ్చితిని. నాకురాత్రిలు నిద్రకూడపట్టుట లేదు. ఈపని యెట్లుపూర్తి యగుననియే యాలోచించుచున్నాను. ఎంతవఱకు కార్యము సానుకూలపడదో యంతదనుక నాకు జ్వరము వచ్చినట్లుండున''నిచెప్పెను.

శాంతికుమారుడు మందస్వనమున

"ఆవిద్య నేనింకను నేర్చుకొనవలసియున్నది. శేఠ్ జీ! నాకు సొమ్ముతినుట కలవాటున్నదిగాని తినుపించుటచేతకాదు. ఎవరైనపెద్ద మనుష్యులతో నావిషయమై ప్రసంగింతునేని, నాకు సిగ్గగును. అదియుగాక నన్నెంత స్వార్థుడని తలంచునో యని యూహాయు గలుగుచుండును. ఎవరైన కసరుకొందురేమో యని భీతిలుచుందు''ననెను.

సమరకాంతుడు, శ్వాననము వదల్చినట్లు ధూ ధూ యని, "అటులైన నిక మీకు స్థలము లభించినట్లే, సేవాశ్రమములో బాలురకు పాఠములు చెప్పుట వేరుసంగతి, కార్యము సఫలముచేయుట వేరుమాట. స్వయముగ నేనే సరిచేసెదను'' అనెను.

సుఖద యూహాతీతమైనవడువున వలదు. వలదు. మాకు లంచము లిచ్చుట యిష్టములేదు. మేము న్యాయముకొఱకు నిలచియున్నాము. మాకు న్యాయంపుబలమున్నది. మేమాశక్తిచేతనే జయముగాంతుము'' అని పలికెను.

సమరకాంతుడు నిరాశుడై "అగుచో మీకార్యక్రమములు నడచినట్లే.'' అనెను.

సుఖద "కార్యక్రమము నడచుటయా? అగును. ఆలశ్యముగ

కొనసాగగలదు; లేక నెమ్మది నెమ్మదిగ జరుగగలదు. చెప్పలేను. కాని నిలచిపోజాలదు. అన్యాయమునకు దినములు నిండిపోయినవి'' అనెను.

"మంచిమాట. నేనును చూతును'' అని సమరకాంతుడు రోసముతో నెడలిపోయెను. వాని సర్వజ్ఞత్వము నెవ్వరంగీకరింపగో యాతడు వారినుండిదవుదవ్వుల కేగుచుండును.

శాంతికుమారుడు సంతోషపడుచు "శ్వేత్గజీ కూడ విచిత్రజీవి. ఆయన దృష్టిలోనున్నవన్నియు రూప్యములే, మానవత్వముకూడ పదార్థమేయని వారొప్పుకొననే యొప్పుకొనరేమో'' యనెను.

సుఖద కన్నులుగర్వముతో ప్రజ్వాలించెను.

వారిమాటలనుబట్టి యిట్లు తలంపకుడు, డాక్టరుగారు! వారిహృదయముల నెంతటిదయ, యెంతసేవయున్నదో, యిది మనయిరువురియందును కలిపియుండజాలదు. వానిస్వభావమున నెంతమార్పు కలిగినదో మీరు చూడలేదా? అర్థసంవత్సరమునకు పూర్వము తనయు డీ ప్రస్తావన గావించియుండెనేని వారు మండిపడెడువారు. తమ సర్వస్వము దోపిడి చేయించుకొనుటకు సంసిద్ధులగుట సాధారణమగుసంగతి కాదు. అందు ముఖ్యముగ నొక్కొక్కగవ్వనుకూడ కఱచి పట్టుకొను వారికి మఱంతకష్టము. పుత్రస్నేహామే యీమార్పు గాంచివైచినది. ఇదియే నిక్కవమగు వైరాగ్యమందును. ఇక మీరు మొదట పుర పాలకవర్గ సభికులను గలసికొనుడు అవరసము కలిగిన నన్ను వెంట గొనిపొండు. మనకు పురస్కారము లభించునని యాస నాకున్నది. వలదు! తమ రొంటరిగ వెడలవలదు. రేపుపొద్దున వచ్చిన మనమిరు పురము కలసిపోవుదము పదిగంటలకు తిరిగివత్తము. ఇప్పుడు నేనొక్కింత సకీనాను చూడవలసియున్నది? నెలలనుండి యస్వస్థురాలుగనుండెనని తెలిసినది. నాకామెపై భక్తియుదయించినది. వీరైన నైనాను కూడ చూచి వత్తును''అనెను,

డాక్టరు కుర్చీలోనుండి లేచుచు "ఆమె వెడలి రెండునెలలు కావచ్చినది, ఎప్పుడువచ్చును?" అని ప్రశ్నించెను-

ఇచ్చటినుండి పలుతడవలు పిలుపులు వెళ్లినవి, కాని శేఠ్ ధనీ రామ్ వదలిపెట్టడు"

"నైనా కుశలముగనున్నదా?"

"నేను పెక్కుమార్లు కలసికొంటిని, కాని తనసంగతి నాతో నేదియు చెప్పలేదు? అడిగిన బాగుగనే యుంటినని చెప్పినది- కాని నాకామె ప్రసన్నయై యున్నట్లు కనబడలేదు- ఆమె పరులపై నిందలు చెప్పుస్వభావముకలదికాదు- వారామెను తన్ని వెడలనడచి నను సరియే యొరులతో చెప్పుకొనునది కాదు-"

శాంతికుమారుని నయనము లార్ద్రములయ్యెను- "ఆమెపై నేరికైనను కోపము గలుగునని నేను స్వప్నమందయిన నూహింపజాల కున్నా"" న నెను.

"అమెపై నేరికైనను కోపముగలుగునని నేను స్వప్నమందయి ననూ పొందజాలకున్నా"న నెను.

"సుఖద నవ్వుచు "ఆపె యన్నగారో! చెడునడతకలవారు ఆకారణము చాలదా వారి యప్రసన్నతకు?" అని ప్రశ్నించెను.

"మణీరామ్ మంచి పోకిరియని వింటిని."

"నైనా ముందు మీరీమాట యనిన మీతో తప్పకతగవు లాడును.

"నేను నొకసారి తప్పక వానిని కలసికొనవలెను.

"వలదు. మీకు దండమిడెదను. మీరు వాని నేమైనయన్నచో నైనా తల యూడిపోవును."

"నే నాతనితో పోట్లాడుటకు పోవను. ఇంచుక ప్రసన్నుని గావింపపోయెదను. ఆకళ నీకంత చేతకాదుగాని, నైనాకొఱ కాత్మ హత్య గావించుకొనుటకును పుయిలోడను. ఆమె దుఃఖించుచుండ నేను

చూచుచుండజాలను. నిస్వార్థ దేవతయగు నామె నాయెదుట దుఃఖము పడుట సహింతునేని, నాబ్రిదుకుజ పర్థము"

శాంతికుమారుడు కడువడి బయటకు వెడలిపోయెను. వాని కన్నీటిధారల కెఱటములకు చెలియలికట్ట తెగిపోయెను.



## 9 వ ప్ర క ర ణ ము.

సుఖద మోటారుదిగి సందుకొచ్చి, సకీనా యిల్లు వెదుక సాగెను. కాని యిటునుండి యటు, నటునుండి యిటు నాలుగైదు పర్యాయములు తిరిగినను గృహమును గుఱుతింపజాలకపోయెను. పూర్వ మొక పురాతనగృహముండినతావున వెల్లవైచిన క్రొత్తడాబాయొకటి గానవచ్చెను. మునిపటి ముఱికిగోనిపట్టా తెఱ యెచటను గానరా కుండెను. తుదకొక పథికునివలన నామెకు తాను గాంచిన డాబాయే సకీనా యిల్లని తెలియనయ్యెను. ఆమె పిల్చినవెంటనే తలుపు తెఱువ బడెను. సుఖద యొకపరిసుభ్రమగు గది, యిందు మూడున్న తాసన ములు గాంచెను. సుఖద నొకయాసనముపై గూరుచుండజేసి, సకీనా "మీరిల్లు వెదకుకొనుచు వచ్చినారుకాబోలు. ఈక్రొత్తడాబా కట్టిం చుటచే తెలియుటలే" దనెను.

సుఖద పాలిపోయి శుష్కించియున్న యీామెవదనముగాంచి "అగును. రెండుమూడుసార్లు తిరిగితిని ఇపుడిది యిల్లనిపించుకొనుటకు యోగ్యముగనున్నది. కాని నీస్థితి యిట్లున్నదేమి? ఆనవాలు పట్టుటకు గూడ వీలులేకున్నావు" అనెను.

సకీనా నవ్వుబోయి "నేనెన్నడును బలమైన దాననుకా" ననెను.

"ఇప్పుడు మునుపటికన్న నీరసించియున్నావు" అనుచుండగనే పఠానిని ప్రవేశించి "నెలలనుంచి జ్వరమువచ్చుచున్నది బిడ్డా! కాని

మందుపుచ్చుకొనదు ఎవరుచెప్పను? నాతోమాటాడుట మానివైచి నది. దైవమెఱుఁగును. నీసంగతి నిరంతరము జ్ఞాపకము వచ్చుచునే యుండును, కాని, యేముఖముపెట్టుకొని వత్తును? లాలాజీకూడ వచ్చి వెళ్ళి యెంతోసేపుకాలేదు. యుగయుగములు బ్రదుకవలె. ప్రపంచ మున నటువంటి భగవద్భక్తులింకనున్నారు. మఱియొక్కరైన నాముఖము చూడనే చూడరు. వారి పంటవంటియిల్లు నాయట్టి దురదృష్టవంతు రాలి కారణమున పాడుపడినది. కాని లాలామనసు మునుపటివలెనే యున్నది. అదియే ఆదరము. అదియే పోషించుదృష్టి ఆ యమాయ కపుపిల్ల వానిపై నపవాదు గల్పించుటకు నాకన్నుల కేల మసకగ్రమ్మి నదో చెప్పలేను. చచ్చిన నాకు భూస్థాపనలేకుండ జేయునుగాక దైవము నేను సంగతినంతను కనుగొంటిని. ఎల్లరు నన్నే నిందించుచున్నారు. ఈ పిల్ల నాతోమాటాడుటయే మానివైచినది. నిలచియున్నది. అడుగుము. మనసున శూలములవలె గ్రుచ్చుకొనునట్టువంటి మాట లనుచుండును. దేవుఁడు విననలెనని లిఖించిన వినెదను. నేనట్టి పనియేచేయకున్న నీ మాట లేటికి విననలసివచ్చును? వాని నీచీకటియింటిలో చూచుటచేత నాకు శంక కలిగినది. పాపమీ పేదరాలికి, స్త్రీకి, దుర్వ్యసనముగలుగు చున్నదనిచూచి, నాధర్మమని తలచి, యీమె ప్రతిష్ఠ నిలువబెట్టవలె నని నాయాత్మ ప్రేరేచినది. ఈదుష్టురాలికా కోపములో తన కేకళంక ము దగులుకొనునని యూహయైనను లేకపోయినది."

సరే నాతీవ్రస్వనముతో "అరే! అయినదేదియో అయిపోయి నది. ఇప్పుడెంతవఱకు నీచింత దెలుపుకొని యేడ్చెదవు? కొంచెమేది యైన మాటలాడుకొననిత్తువా లేదా?" యనెను.

పఠాని "ఈరీతిగనే నన్నువిడిలించివైచుచుండును. బిడ్డా! మా టాడ నివ్వదు. నీకడచెప్పుకొని యేడ్వకున్న నెవ్వరితో చెప్పికొని యేడ్వనో యెఱుఁగను" అని విన్నపముచేసెను.

సుఖద సకీనాను "సరియే. నీవు మాసికభృతి పుచ్చుకొనుట కేల నిరాకరించితివి? అది చాలకాలమునుండియు నొసగబడుచున్నదే కదా?" యని ప్రశ్నించెను.

సకీనా యెద్దియో ప్రత్యుత్తర మొసగబోవుచుండ పఠానిని తిరుగ" దానికిప్పిగా నాతో జగడములాడుచుండును బిడ్డా! ఇతరుల దానము పరిగ్రహింపనేల? యనుచుండును. కాని దీనిచేతనే మాపోషణ జరుగుచున్నదని యాలోచింపదు. సరి. నేడుకుట్టుపనియావేశము వండెనిండుగంటలరేయి దనుకన్నులో కన్నుపెట్టుకొని కూర్చుండును. దానివాలకము చూడుము. అందుచేతనే జ్వరము రాసాగినది. కాని మందుమాట యెత్తనీయదు. ఏమంత పదిమంది పడియేడ్చుచున్నారు తినుటకు? ప్రాణములుండ జూచుకొని మఱియు పనిచేయుమని చెప్పుచుండును. కాని యిల్లు మంచిది కట్టింపవలెనని, సామగ్రి మంచిది చేయింపవలెనని, యిదియే చింత. ఇచట పనిబాగుగ దొఱుకుచున్నది. కూలియు బాగుగ లభించుచున్నది. కాని యీయాడంబరముల కే యంతయు నెగిరిపోవుచున్నవి. ఇచటికి కొలదిదూరములో నొకక్రైస్తవ స్త్రీయున్నది. ఆమె ప్రతియుదయము చదువు నేర్పింప వచ్చుచుండును. బిడ్డా! మా ప్రపంచములో దైవప్రార్థన మొదలగునవియే యలవాటు. చాలతావులనుండి వివాహసంబంధములును వచ్చినవి కాని..."

సకీనా కఠినముగ "అరే! ఇక నూరకొనెదవా లేదా? అయిపోయినది. నీకేమి సత్కారము సేతును సోదరీ? ఇన్నిదినముల వెనుక నీకీ యభాగ్యురాలు జ్ఞాపకమువచ్చినది" అనెను.

సుఖద యుదారహృదయముతో "జ్ఞాపక మెప్పుడునుండియే యున్నది. రావలెనని బుద్ధియునుండెడిది. కాని, నీవేమియనుకొనెదవో యని భయపడుచుండెడిదానను. నేడు సలీమువలన నీయొంటిలో బాగుండలేదని తెలిసినది. నీశుశ్రూష గావించుటకు మేమెల్లరము నిరంత

రము సిద్ధముగనుండ నీవు వృథాప్రాణములేల యర్పింపనున్నావు?" యనెను.

సకీనా సిగ్గుపడి, తలవంచుకొని, "సోదరీ! నేను చనిపోయినను సరియే, కాని యీదారిద్ర్యమును రూపుమాపి వెచెదను. నే నీస్థితిలో నుండకపోయిన బాబూజీకి నాపై నేలదయగల్గును? వారుమాయింటి కేలవత్తురు? వారికేల చెడుపేరువచ్చి పారిపోవుట తటస్థించును? అంతటి యభాగ్యమునకును మూలము పేదరికము. దీనినంతము గావించియే వదలెదను" అనెను.

ఒకక్షణమునకు బిదప నాకుం పఠానినితో "నీవుపోయి కొంచె ము తమలపాకులు తీసికొనిరమ్ము. అంతకన్న మీకు వేరేమి సత్కా రము చేయను?"అనెను సుఖదతో.

వృద్ధురాలి నీమిస్సుపై నావలికనిప్పివెచి, సన్నని గొంతుకతో "ఇది మహమ్మద్ సలీము లేఖ. మీరునాపై నంతగా ననుగ్రహాము చూపించుచుండ, మీదగ్గర నేమి దాచను? కావలసినదేదియో జరిగి పోయినది. బాబూజీ యిచటికి చాలసార్లువచ్చెను. ఆయననాపై వంక కన్నెత్తి చూడ నైనలేదు. దైవమెఱుగును. ఆయనను నేను మన్నిం చుచుండెడిదానను. ఆయన సజ్జనత్వముయొక్క ప్రభావ మవశ్యము. నాహృదయముపైబడెననుట నిక్కువము. ఆకస్మికముగా నాపెండ్లి మాటవిని, బాబూజీ యున్మాదవస్థలోపడిపోయి, నాపైన ప్రేమ ప్రక టించెను. సోదరీ! నేనొక్క యక్కరమైన నసత్యము చెప్పుటలేదని దైవమెరుగును. ఆయన ప్రేమోదంతమువిని నా తెలివితేటలు నశించి పోయెను. మనఃస్వాస్థ్యములేకపోయెను. నావంటి పేదరాలిని, వారి వంటి యుత్తముడు ప్రేమించెనని యెఱుగుట నన్ను మింటకెగయ జేసెను. నేనాపెన్నిధినిగాంచి పిచ్చిదాననైపోయితిని. ఆయన సర్వ స్వము నాకొఱకునమార్పణచేయనుండినపుడు నేను కట్టుబొమ్మను కాను. వారు నాయందంత విశేషమేమిగాంచియుండిరో నేనెఱుగజాలను. వారి

ప్రసంగమువల్ల మీకువారికిని సామరస్యములేకుండెనని మాత్రమే తెలిసెను. సోదరీ! నేను మీతో నున్నది యున్నట్లుగ మాటలాడుచున్నాను. క్షమింపుము. వారికి మీవిషయమునగూడ కొంచెము విచారముండెను. మఱియు నుపవాసమొనరించినపిదప మృష్టాన్నముల మాట మఱచిపోయి వేలపిండిపై కుఱుకినట్లు, నిరాశచేసికొని వారి మనసు నాపైకి గమించినది. ఆయన ప్రేమక్షుధార్తుడు. ప్రేమకొఱకు వారియాత్మ యాక్రోశించుచుండెను. కాని రుచిరపదార్థము వారికెన్నడు నిక్కముగ లభించియుండలేదేమో. నాది నటనమాత్రముచే తృప్తిపడు మానసికాదు. మనసా, కర్మణా, తానొరుల మనుష్యుడైపోవలెనని వారెట్లు కోరుచుందురో, యటులనే పరులును బుద్ధిపూర్వకముగ, మనసార, తనకు వశులుగావలెనని వారు వాంఛించుచుందురు. వారివెంట నేనేలపోకపోయితినని నాకిప్పుడు చింతకల్గుచుండును. పాపము వేలపిండిపై కఱికెన, వదియులాగికొని వేయబడినది. మీరిప్పుడుకూడ వారిమనసును వశపరచుకొనగలరు. ప్రేమతో ముంచెత్తి యొకలేఖ వారికివ్రాయుడు. వారు మఱునటిదినమే పరుగెత్తికొని రాగలరు. నాకొక రత్నము లభించెను. దానిని పరులెంతవఱకు నాచేతులనుండి బలిమిని లాగివేచుకొనజాలరో, నేను దానినంతదనుక వదలజాలను. నాయొద్ద రత్నమున్నదనిన యాతలంపే నాయాత్మకు నిత్యము దృఢత్వము, బలము, నానందము గలిగింపగలదు.'' అని చెప్పి తటాలున లోనికేగి యొక సీనారేకుపెట్టిలో దాచియుంచిన లేఖను గొనితెచ్చి, సుఖదచేతియందుంచుచు ''ఇది సలీమునలేఖ. మీరు చదువవచ్చును. నిశ్శేషమెద్దియులేదు. దానికి నాపైనాస జనించినది. ప్రప్రథమమున తన సేవకునికిచ్చి నాకు పెండ్లిచేయదలచినాడు. కాని యానీచత్వము నేడులేదు. ఆతనిధాత్రి వారిస్థితి వర్ణించుచుండును. దానికామెవలననే నాపైవైవాహికపుచింతగూర్చి తెలిసియుండును. రెండుమూడు పర్యాయములు మూడ్వాగమువంక నాతడు చూచుచుండుట,

తటపటాయించుచుండుట నేను చూచియుంటిని. ఏదియో పెద్ద పదవి లభించినదనియు వింటిని. నాయదృష్టమిట్లు వికసించినది. కాని, యే ప్రేమరజ్జువులు నన్ను బంధించినవో వానిని నేనెంత యత్నించినను త్రెంచివైచుకొనుటకు శక్తిలేకయున్నది. బాబూజీ తమహృదయము నుండి నన్ను తొలగించుకొనిరని నాకెంతవఱకు తెలియరాదో తానత్పర్యంతము నేను వారిదాననే పైపెచ్చు, వారునన్ను తమహృదయమునుండి దూరీకృతమొనరించుకొన్నను, వారిప్రేమను నిత్యము జ్ఞప్తియందుంచుకొనియే యుండెదను. అట్టిప్రేమ, యొక్క ముహూర్తకాలమైనను, జీవితాంతమువఱకు మనుష్యు నున్మత్తుని చేసియుంచుటకు జాలియుండును. నేను దీనికి ప్రత్యుత్తరము వ్రాసితిని. అది యందెనేని దినము నిన్న. నాలేఖచూచి దుఃఖింపసాగెను. సలీముగా నన్ను పెండ్లి గావించుకొందుననియు, లేనియెడ, వివాహితుడుగనే యుందుననియు శపథము వహించెనట. ఆలాగ్లాయందే బాబూజీయున్నారు. మిత్రులిరువురి మధ్యమున నది తేలగలదు. అందుకనియే యింతతొందరగ నాయన పరుగెత్తిపోవుచున్నాడు" అని సకీనా చెప్పెను.

ఇంతలో పఠానినియొకతమలపాకులబీడా తీసికొనివచ్చెను. తమ్మలపుబీడా తీసికొని నిష్కృతితో నమలుచు సుఖద విచారమున మునిగిపోయెను. ఈదరిద్రురాలు నేడు తన్నుపూర్తిగ పరాజితము గావించివైచినది. తాను కులీనవంశము, విశాలమగు సంపత్తియు గలిగియుండిన, నీమె సమీపమున భిక్షురాలివలె గూర్చుండియున్నది. ఆమె మనసునకు నేటికి తన యపరాధమును తాను స్వీకరించుచున్నట్లు తోచెను. నేటివరకు పురుషుడు నీచుడు, దుష్టవర్తనుడునగుననియు, తన యువతీసహజ హావభావములు, హాసవిలాసములు వానిని ముగ్ధునిగ నొనరింపజాలుననియు చెప్పుకొని సరిపెట్టుకొనుచుండెను. కాని హావభావములు, హాసవిలాసములు, వశీకరణమొనరించుట కనువగు చూపులు తనకులేవని యామెగ్రహింపగల్గెను. ఇచట నొకశాంతి, కరుణ

సంగీతము, హృదయముగలవాడుమాత్రమే యనుభవింప దగినది యున్నది. లంపటులకు విలాసశీలురకు నానందము గలిగింపజాలునట్టి యుత్తేజకరమగు గానమిచటలేదు. ద్వేషాగ్ని సమసిపోయినవెనుక, నిశ్చలమగు చిత్తముతో సుఖగ సకీనా మెడపై చేయివైచి "సోదరీ! నేడు నీవాక్యములచే నాహృదయభారమును దొలగించి వైచితివి. నీవు నాపయి నారోపించిన యారోపణయే సత్యముకానచ్చును. నీయెడ నా హృదయము నేడు శుద్ధమైపోయినది. బాబూజీకి నాపయిన నేదియేని తగవుండినయెడల వారు నాతోచెప్పియుండవలసినది. ఈశ్వరుని సమ క్షమున నేను చెప్పుచున్నాను. తెలిసివారికెన్నడు నేనసంతుష్టి గల్గించి యుండలేదు. అగును. ఆయననన్ను కఠినురాలని తలంపదగిన సందర్భ ములు కొన్నినాకిపుడు జ్ఞప్తికివచ్చుచున్నవి. కాని నాకు వారొనరిం చిన యవమానమిప్పటికిని నేను క్షమింపజాలను. వారు నాదగ్గరనుండి యేది వాంఛించుచుండిరో వారినుండి నేను నద్దియే యభిలషించు చుంటిని. వారు నాకేది యొసగజాలకుండిరో, తాము నావలన దానిని పొందనేరకున్నచో నేటికి క్రుద్ధులుకావలెను? వారు పురుషులగుట జేసియు, పురుషుడు తలచినస్త్రీని తనపాదరక్షలుగ దలంపవచ్చునని యెకదా? కాని స్త్రీపురుషునికాళ్ళకు చెప్పులవలె నంటిపెట్టుకొని యుండుటే ధర్మముగనుకనా? నాయొద్ద నీవు సుంతయు దాచక యెట్లు సంభాషించియుంటివో, యట్టులే నేనును, నిష్కపట భావముతో నీకు చెప్పుచున్నాను. ఒకక్షణికకాలముపాటు నిన్ను నాయవస్థలో పెట్టు కొనుము. అప్పుడు నాభావములు నీకు బోధపడగలవు. నాది తప్పగు నేని వారిదికూడ తప్పే. నాయదృష్టమును నిందించుకొనుచు నేనెట్లు కూర్చుండియుంటినో, వారునట్లే కూరుచుండకపోయిరా? అప్పుడు బహుశః వ్యవహారము చక్కబడెడిదేమో కాని, వారెంతవరకు చేయి జాచరో, యిపుడు నేను నంతవఱకు చేయిజాపజాలను. యావజ్జీవిత మిట్టులేపడియుండవలసివచ్చినను సరియే. స్త్రీబలవిహీన, అశక్తమున

మానాభిమానముల దుఃఖమామెకు మెండు. సోదరీ! ఇంక నాకు సెల విమ్ము. నైనా నొకించుక కలసికొనవలసియున్నది. నీకునేను సవారి నంపెదను. దయయుంచి యప్పుడప్పుడు మాయింటికి విచ్చేయు చుండుము'' అనెను.

ఆమె గదివీడి వెలుపలి కేతెంచినవెనుక సకీనా రోదువసాగెను. తెలియదేటికో !

—: 10వ ప్రకరణము :—

సుఖద శేఠ్ మనీరామ్ వీడుచేరునప్పటికి తొమ్మిది కొట్టెను. అది బహువిశాలమును, గగనముతో ముచ్చటించునంతటి యున్నతమునగు భవనము దానిద్వారామున తేజోనంతమగు విద్యుద్దీపిక వెలుగు చుండెను. ఇరుగెలకుల నిరువురు ద్వారపాలకులు నిలచియుండిరి. సుఖదను గాంచుటతోడనే వెలుపల, లోపల, సంచలముకలుగ సాగెను. లాలామనీరామ్‌లోనుండి బయటికేతెంచి, యీామెను లోనికిగొనిపోయెను. రెండవ శ్రేణిలోపరిచితులను గలసికొనుటకొకసుసజ్జితమైనగది యుండెను.

సుఖద యందాసీనగావింపబడెను. ఇంటిలోని స్త్రీలిచట నచట తెఱలచాటుననుండి యామెనంక తొంగితొంగి చూచుచుండిరి. గదిలోనికి వచ్చుటకు సాహసింపనొల్లకుండిరి.

సుఖదయొక సోఫాపైగూరుచుండి,

"ఎల్లరికి కుశలమేకదా?'' యని ప్రశ్నించెను.

మణీరామ్ చుట్టనువెలిగించి పొగనదలుచు-

"మీరు వార్తాపత్రికనుచూచియుండలేదుకాబోలు. నాన్నగారికి 2దినములనుండిజ్వరముతగులుచున్నది.కలకత్తానుండిడాక్టరులాంసెంట్‌ను రావించితిని.ఇచ్చటివారెవరియందునునాకువిశ్వాసంలేదు.నేనుపత్రికలలో ప్రచురింపించితిని. వృద్ధులైనారు.మీారొక్కింతశాంతముగకూర్చుండుడని

చెప్పుదును. వారికి నదియేకోరిక కాని యెవరైన వారిని కూగుచుండ నిత్తురా? గనర్నరు పత్రియూగవచ్చెను. వారిదగ్గరనుండి, వారి యాంతరంగికకార్యదర్శినుండి స్వయముగ నాహ్వానమువచ్చెను. వెడలుటతప్పని సరియైనది. ఈపట్టణమున నింకెవ్వరికి నాహ్వానములువచ్చియుండలేదు. ఇట్టి గొప్పసమ్మానము నెట్లు దోసిపుచ్చుట? అచటనే జలుబు చేసినది. మనుష్యునకు జీవితమున సమ్మానమే యొకగొప్పవస్తువు. ఊరకయెల్లరు తమ తమ పొట్టలు నింపుకొందురు. ఉదయమునుండి సాయింకాలమువఱకు కడతెరపిలేక ధనికులతండములు వచ్చుచునేయున్నవనుకొనుడు. పొద్దువనే డిప్యూటీకమీషనరును, వారిదొరసానియువచ్చిరి. కమీషనరుకూడ సానుభూతి తెలుపుచు తంతివార్త నంపెను. రెండు మూడునాళ్ళ యస్వస్థత యొకవిషయముకాదు. కాని సమ్మానము ప్రాప్తించినది. పొద్దంతయు నధికారులను గౌరవించుటలో సరిపోవుచున్నది'' అని చెప్పెను.

సేవకుడు తాంబూలపళ్ళెమును, హుక్కానుదెచ్చి యచట నుంచి వెడలిపోయెను. సుఖద యెదుట మనీరాము పళ్ళెమునుంచెను. పిదప "మాయింట సంఘపుమర్యాదలు, సభ్యతలు నెఱిగినదియు, దొరసానులకు స్వాగతసత్కారము లొనరింప జాలినదియు నగు స్త్రీ యావశ్యకతయున్నది. ఈపెండ్లివలన నాలోటులుపూర్తిగాలేదు. నేను విధిలేక రెండవవివాహము చేసికొనవలసియుండును. పురాతనపు పద్ధతులుగల స్త్రీలలోటు మాయింటనెన్నడు లేకుండెను. కాని వారు దొరసానులకు సేవాసత్కారములు సేయజాలరు. దొరసానుల యెదుటికి వారిని తీసికొనివచ్చుటకు వీలులేదు. అట్టి మూర్ఖులను, పల్లెటూరి పడుచులను వారియెదుటికిగొనిపోయి యెవరుఅమర్యాదపాలుకాగలరు?' అనెను.

సుఖద మందస్మితమొనరించి "అట్లులైన తెల్లదొరసాని నెవతెనైన పెండ్లియేలచేసికొనలేకపోయినా?'' యనెను.

మణీరాము నిస్సంకోచముగ "మోసముజరిగినది. కాక యేమి? శిక్షిత పరివారములోని స్త్రీ వట్టిమూర్ఖురాలు కాగలదని మాకేమి తెలిసునా? తల్లి, అక్క-చెల్లెండ్రు, ఇంటిలోని తక్కిన స్త్రీలును క్రొత్తకోడలినిచూచి సంతసించుచున్నారు. పనిచేయును. సిందూరతిలకము దిద్దును. అని కాని, నాకు ప్రపంచమున సుంతపని, యొక్కింత పేరు, తెచ్చుకొనుట యవసరము. పూజాపురస్కారములుచేయుస్త్రీ నాకవసరములేదు. ఇపుడు వివాహము జరిగిపోయినది. అది త్రెంపుకొనుటకు వీలులేదు. ఇచటి కనుదినము నలువురైదుగురు దొరసానులు రాగోరుదురు. వారిని సత్కరింపకపోయిన పనిజరుగదు. వారెల్లరు నీస్త్రీ లెంతమూర్ఖులో యనుకొనుచుందురు కాబోలు" అనెను.

సుఖదకీ యిరువదిరెండేండ్లప్రాయమునుగల యువకునకుగల సంకోచరహితమగు లౌకికజ్ఞానముగాంచి యసూయగలుగజొచ్చెను. వాని స్వార్థము కోమలస్వభావముల నన్నిటిని ధ్వంసముగావించివైచి, వానిని హాస్యాస్పదునిగ నొనరించుచుండెను.

"ఈపనికిమాత్రమేయగుచో మీకు స్వల్పవేతనముపై స్త్రీలు దొరుకుదురు. వారు దొరసానులతోపాటు దొరలకును సత్కారము చేయగలరు" అనెను సుఖద.

"మీకీవ్యాపారసంబంధములగు సమస్యలు తెలియవు. పెద్దపెద్ద మిల్లుల ఏజంట్లువత్తురు. నాభార్యవారితో సంభాషింపగలదేని యేదో యొక్కింత కమీషనుకేటు వృద్ధికాగలదు. ఆపని స్త్రీయే చేయతగినది.

"వ్యాపారమంతయు గంగలోగలసినను నేనుమాత్రి మాపని చేయను"

"నాకు తెలిసినంతవట్టుకు వివాహమున కర్థము స్త్రీ, "పురుషుని సహగామిని"యని ఆంగ్లేయులలో స్త్రీలే పురుషులకు సహయోగ మొనరింతురు"

"తమకు సహచరి" శబ్దమున కర్థము తెలియులేదు.

మనీరాము భయరహితుడు, అతని సహచరులు వానియదార్థవాదియనుచుందురు. అతని సంభాషణ తిట్లతో ప్రారంభించి తిట్లతోనే ముగియుచుండును. అతడు "అధమమీవిషయమును నాకుపదేశించుటకు మీకెట్టి యధికారమునులేదు. ఆశబ్దమున కర్థము మీరుగ్రహించియేయున్న మీపతినుండి మీరువిడిపోవరు. ఆతడును సందుగొందుల దిమ్మరి దుర్గంధసేవనచేయడు" అనెను.

సుఖద ముఖము లజ్జాక్రోధములచే జేవురించెను. ఆమె తనయాసనమునుండి లేచుచు కఠినస్వనమున "నావిషయముగూర్చి విమర్శించుటకు మీకెట్టి యధికారములేదు. మీరు పాశ్చాత్యసభ్యతకు గొప్ప వ్యక్తులైపోయినారు. ఆంగ్లేయులవలె దుస్తులుధరించుట, చుట్టలుత్రాగుటయు నేసభ్యతాలక్షణములుగ దలచుచున్నారుకాబోలు. వారి సభ్యతకు ప్రధానాంగము మహిళల నాదరించుట గౌరవించుటయును అదియెల్ల మీరు నేర్చుకొనుట తరవాయిగనున్నది. ఏకులీనస్త్రీయు నిట్టులాత్మసమ్మానము గోలుపోవుట కంగీకరింప దనెను.

"ఆమెగర్జనవిని యిల్లంతయు గడగడలాడిపోయెను. మనీరాముని వాక్కు స్థంభించిపోయెను. నైనా లోనగూరుచుండి వదినెరాకను నిరీక్షించుచుండెను. ఆమె యీగడబిడ నాలించి యేదో గొడవ జరిగెనని గ్రహించెను. పరుగిడివచ్చి పెద్దయింటివాకిట నిలువబడెను.

"నీరాకకై వేచియున్నానువదినే. ఇచటికివచ్చి యెట్లుకూర్చుంటివి" అనెను.

సుఖద యామెనంక చూడనైనచూడక మునుపటిరీతినే తీవ్రముగ "ధనముసంపాదించుట ఘనకార్యమే. కాని మర్యాదనమ్ముకొన్నచో కాదు. అదియుగాక వివాహమున కర్థము మీరుగ్రహించినట్టిదికాదు. స్వార్థములో పడిపోయినవారికెంతటి పతనము కలుగునో నేటికి నాకుబోధపడినది" అనెను.

నైనావచ్చి యామెచేతినిపట్టుకొని యామెను లాగుచు "అరే! అయిన నిచటినుండి కదలెదనాలేదా? యనెను.

సుఖద యింకకొంతయుత్తేజితయై "నేనేటికి నాభర్తతోనే నేగలేదా? వారెంతత్యాగులు నేనంత త్యాగము చేయజాలకపోవుటచేతనే. మీకు మీవ్యవసాయములు, మీధనమును మీపత్నిగౌరవముకన్న ప్రియతరములు. వారు రెంటినితన్నివైచిరి మీరాసందులు గొందులను దిరుగుటగూర్చి చేసిన ప్రసంగమునకు నేను తలచినదే యర్థమగునేని, యది మిథ్యాకళంకము. మీరుయూష్యములాఘ్రించుకొనుచునే యుండుడు. మీరామహాత్మునిపై తుంపురులు గుటీయించుట పెట్టకొంచెము కూతఘనమన్నట్టులుండును" అని చెప్పెను

సుఖద యొకకమ్మరి, నూర్గురగ సాలులకుతులయని చూపుటకు వ్యర్థప్రియత్నముచేయుచున్నది. కాని వానిహృదయము నొవ్వజేయగల యామొక్కమాట యామెపలుకజాలకుండెను.

నైనా "వదినే! నీవెవరినిదూషించుచున్నా"వనెను.

మనీరామ్ పిడికిలిబిగించి "నాయింటనే నాకిట్టి యవమానము జరుగుట సహింపజాల"ననెను.

నైనా తనవదినె సమక్షమున చేతులుజోడించి "వదినే! కరుణింపుము. దైవముఖముచూచియైన నిచటినుండి వెడలిపొమ్ము"అని విన్నవించెను.

సుఖద "శేఠ్‌జీ యెచటనున్నారు? నేను వారితో రెండుమాటలు మాటాడవలసియున్నది"అనెను.

మనీరామ్ "మీరు వారిప్పుడు కలసికొనజాలరు. వారియారోగ్యస్థితి బాగుండలేదు. ఇట్టిపలుకులువినుటకు వారిష్టపడరు" అనెను.

"మంచిది. వెళ్లను. నైనాదేవీ! నీకుశీఘ్రమేయొక యాంగ్లేయ సవతివచ్చునని తెలియుచున్నది"యనెను.

"బాగున్నది. ఇంటిలోనికి మనుష్యులువచ్చుట యెవ్వరికిష్ట ముగాకుండును? ఒకరు, ఇద్దరు, ఎంతమంది కావలసిననందరినిరానిమ్ము. నాకు చెడిపోయెడిదేమున్నది?" అనెను నైనా.

ఈపరిహాసవాక్యములచే మణీరాముని యొడలు మండిపోయెను. సుఖదనైనాతోగూడ పోవుచుండగా వారికెదురుగావచ్చి నిలచి "మీరు నాయింటిలోనికి రావీలులే"దనెను.

సుఖద రూక్షముగ" సరియే. పోవుచున్నాను. కానియీ యవమానమునకు ఫలితముమీకు కుశలముగనుండదనిమాత్రము గ్రహింపుడు" అని నైనా కాళ్ళబడుచుండినను లెక్కసేయక, కుపితయై వెడలి పోయెను.

ఒకక్షణికములో నింటిలోనిస్త్రీలు, పిల్లలునందఱును గుమికూడిరి. సుఖదగూర్చి ముచ్చటింపసాగిరి. ఒకతె" ఆమె కన్నులనీరు పెట్టుకొనె"ననెను. ఇంకొకతె "అట్లుకానిచో నోట్లుపెచుకొని యేలపోవు" ననెను. నైనా తలవంచుకొని వినుచుండెను. ఆమెయాత్మయాపెను ధిరస్కరించుచుండెను "నీయెదుటనే యిట్టి యనర్థము జరుగుచున్నది. నీవూరక చూచుచు కూర్చుంటివి" అని కాని యీసమయమున నోరు విప్పుటచే నాపద ఘటిల్లెను. ఆమెలాలా సమరకాంతుని పుత్రిక. ఈ యపరాధము నామె తన నిష్కపటసేవ చేతనైన నశింపజేయజాలకున్నది. రామాయణకథాసమయమున సమరకాంతుడు లాలాధనీరాముని తలయెత్తనీయకుండచేసి, యీవైమనస్యమునకు విత్తనము నాటెను. అంతకుపూర్వమిరువురకును మైత్రియుండెడిది. ఆనాటినుండియే ద్వేషముత్పన్నమైనది. సమరకాంతుని తలవంగజేయుటకే ధనీరామీ వివాహమునకు సమ్మతించెను. వివాహమునకు పిదప వాని ద్వేషజ్వాల చల్లబడజొచ్చెను.

మణీరాము బల్లపై కాళ్ళిడుకొని, సుఖద కేదియు తెలియద నట్లు [illegible] స్త్రీ కేమి [illegible]తున్నాను?

పురుషుడైన, వానికి చెప్పియుండును. సమరకాంతుడు జూదములాడించి ధనమార్జించెను. ఆపాపమునకు ఫలమనుభవించుచున్నాడు. ఈమె నాతో నేమేమో మాటలాడబోయినది. ఇక నీమెతల్లియున్నది. ఆమె నామె సహచరుడు శాంతికుమారుడు మూర్ఖురాలిని గావించి, యావదాస్తిని వ్రాయించి పుచ్చుకున్నాడు. ఇప్పుడు దమ్మిడీ దమ్మిడీకిని చిక్కుపడవలసివచ్చుచున్నది. సమరకాంతునకునిజమే గతి పట్టవలసినదే. ఇంక నీదేవి దేశోపకారముచేయ బయలుదేరినది. ఆమె భర్త యూరూర దిరుగుచున్నాడు. ఈమె దేశోద్ధారణ గావించుచున్నది. అస్పృశ్యులకు దేవాలయప్రవేశమేటికి కలుగజేసినదో యింతవఱకు నెవరికి నర్థమగుటలేదు. ఇపుడు పురపాలకవర్గముతో స్థలముసకై జగడముచేయుచున్నది. జీవితాంతముదనుక మఱువజాలని దెబ్బతినగలదు. నేనిరెండేండ్లలో నెంతవ్యాపార మభివృద్ధిచేసితినో యంత సమరకాంతు డేడుజన్మలెత్తినను చేయనేరడు''అని పలుకుచుండెను.

మనీరామున కింటనెల్లరి పైనాధిపత్యముండెను. అతడు ధనార్జన యొనరింపగలడు. కావున వానియాచారవ్యవహారాదులు తమకంగీకారముగాకున్నను గృహామునందెల్లరు వానికి సేవకులైయుండిరి. ఆతడే కాగితములు, పంచదారల యేజన్సీలు తెఱచెను. లాలాధనీరాము నేతి వ్యాపారముచేయుచుండెను. నేతివర్తకులు పెక్కురుండిరి. లాభము తక్కువగనుండెను. కాగితములు, పంచదారలకాతడొక్కడే ఏజంటు. ఇక లాభమునకు గొఱతయేమి? ఈసఫలతచే మనీరాము తల తిరిగి పోయెను. ఏరిని సరకుగొనకుండెను. ఒకవేళ యెవరినైన నించుక లక్ష్యపెట్టిన లాలాధనీరామునిమాత్రమే. వానిమాటకొక్కింత యడగి యుండుటయు కలదు.

ఇంతలో లాలాధనీరాము దగ్గుకొనుచు, చేతికఱ్ఱ టక్కు టక్కునకొట్టుచు, వచ్చికూర్చుండెను.

మనీరాము వేవేగ విస్మృగ్గిజనమునాపివైచి, "మీరేటికి కష్టపడి నారు నాన్నగారు? నన్ను పిలిపింపకపోయిరా? డాక్టరుగారు మీరు నడచుట, లేచుట పనికిరాదని చెప్పినారు"అనెను.

లాలాధనీరాము" నేడు లాలాసమరకాంతుని కోడలువచ్చియుం డెనా?"యని ప్రశ్నించెను.

మనీరామించుక వెఱగుపడెను. "అవును. వచ్చెను. ఇప్పుడిప్పుడే వెడలిపోయిన"దనెను.

ధనీరామాతనివంక చూచుచు "అగుచో నేనిప్పుడే చనిపోయి తినని యెంచితివా? నాకు సమాచారమైన తెలుపలేదే"అనెను.

"నేనాపుచునేయుంటిని. కాని యామెకోపించి వెడలిపోయినది"

"నీవు నీపసంగముచే నామెని ప్రసన్నురాలిని గావించితివి కాబోలు. లేనిచో నన్నుకలసికొనకయే వెడలిపోదు"

"ఇంతమాత్రమే చెప్పితిని; తమయారోగ్యము బాగుండలే"దని

"ఎవరికస్వస్థతగనుండునో వారేకాంతమునపడి చావవలెన నియా నీయూహ. ఒంటరిగ చచ్చుట మనుష్యుడభిలషింపడు. తనకె ద్దియైన సంకటమువచ్చినప్పుడు తనబంధుమిత్రులు తనచుట్టు చేరవలె ననియే వానిహార్ధికేచ్ఛయైయుండును"

లాలాధనీరాముకు దగ్గువచ్చెను. కొంచెముతాళి మరలనతడు "నీవేమైననించుక పిచ్చివాడవైపోతివా యనుచున్నాను. వర్తకమున సఫలతగాంచిన మాత్రమున నెవ్వరిజీవితమును సఫలముకాజాలదు. పరులవలన తన పనులు సానుకూలమొనర్చుకొనగలవాడు, వారియెడ కృతజ్ఞుడైయుండువాడునే సఫలుడు. బడాయిలుకొట్టుట సఫలతకు యుక్తికాదు. అది నీచత్వమున కుదాహరణ. ఆమెనాయొద్దకు వచ్చిన సంతసించి వెడలిపోయెడిది. ఆమె సాయమును పట్టణమున చాలా యుపయుక్తమగు వస్తువు. బహుశః పట్టణమున నామెకెంత గౌరవ మున్నదో నీకు సుంతైన తెలియదు' ఆమె నీకు హానిచేయువలెనని

తలంచెనేని, యొక్క దినములో ధ్వంసముచేసివేయగలదు. ఆమె నిన్ను ధ్వంసముచేసియే వదలును. నాపలుకు బాగుగ జ్ఞాపకముంచుకొనుము. ఆమె యొక్క చేపట్టుదలగలమానిసి, ఎవతె తన పతినే లక్ష్యముసేయ లేదో, యామె తనప్రాణములను లెక్కసేయదు. నీకుబుద్ధి యెన్నటికి వచ్చునో తెలియదు" అనిపలికెను.

లాలాధనీరామునకు దగ్గుచే నాయాసమువచ్చెను. మనీరాము పరుగెత్తి, వానినిపట్టుకొని, వీపునిమురుచు, శుశ్రూషగావింపజొచ్చెను. ఒకనిముసమునకు పిదప లాలాజీకి శ్వాసలాడెను.

మనీరాము చింతాకులితస్వనముతో,

"ఈడాక్టరుమందువలన మీకు గుణమేదియు నగపించుటలేదు. కవిరాజు నేటికి పిలిపింపరాదు? నేనాయనకు తంతివార్త నిచ్చివైచెద" ననెను.

ధనీరాము పెద్దయూర్పుతో "బిడ్డా! నేనే సాధువొనగెదు చిటికెడు భస్మముతోనైన బాగుపడగలను. అగును! ఆ "తమాషా" కూడ కావలెనన్న చేయుము. అదియు దోసముకాదు. కొన్నిరూప్యములిట్టి వింతలకై వ్యయపఱచిన నేను వలదనను. కాని ఇప్పటికిది చాలును. రేపు డాక్టరుగారితో నాకు చాల లబ్ధిగాన్పించినది. తమరు సెలవు గైకొను"డని చెప్పెదను.

మనీరాము భయపడుచు "మీరాజ్ఞాపించిన సుఖదాదేవికడ కేగెదన" నెను.

ధనీరాము గర్వముతో వలదు. నీకవమానము గలిగించుట నేను సహింపను. ఆమెయాత్మ యెంతయౌదార్యముగలదో నేనునొక్కింత చూడవలసియున్నది. నేనెన్నిసారులైన హానియొనరించితిని కాని, యేరి సమక్షమున నీచుడనుకాలేదు. సమరకాంతును నేను చూచితిని. ఆతడు లక్ష చెడ్డవాడైనను వాని మనసుమంచిది. దయాధర్మములెన్నటికిని వీడడు. ఇప్పుడు వానికోడలి పరీక్ష గావలసియున్నది" అని పలు

కుచు నాతడు కన్నుమూతగాగొని మెలమెల్ల తన గదివంకకు వెడపో యెను. మనీరాము వానిని రెండుచేతులతోను పట్టుకొని బాసటయై వెంట జనెను.



## —♦ 11 వ ప్రకరణము ♦—

శ్రావణమాసమున నైనా మాతృగృహమునకు వచ్చెను. అత్తిల్లు నాల్గుదినములలోనున్నను నైనా కీయారు నెలలలోనువచ్చుటకు సావకాశము కలుగలేదు. మణీరామువశమేయైన నిప్పటికిని రానీయకుండెడు వాడే. కాని యింటిలోనివారెల్లరు నామెపక్షముననుండిరి. శ్రావణిలో కోడండ్రు పుట్టినింటికి వెడలుదురు. కావున నైనావిషయమున నిట్టియుత్త్యాచారమొనరింపరాదని వారెల్లరు పట్టుపట్టిరి.

ఆమాసమున వాన యెడతెగక కురియుచుండెను. ఒక్కొక్క యిల్లు పడిపోవుచుండును. ఒకానొక గోడకూలిపోవుచుండును. సుఖద యంగణమున నధివశించి, యచటనెగురుచుండెడు బులుబులు పక్షుల క్రీడల నాలోకించుచుండెను. అంగణ మింకను కలోతుగ నుండుటచే నీరు నిలచుచుండును. గాలివలె పక్షులు కొంచెముదూరమెగురుటయు నంతలోనే క్రిందికి వచ్చుటయు నామెకు మనోల్లాసకరముగ నుండెను. ఒక్కొక్కమారు రెండుపక్షులు దారసిలును. మార్గమధ్యమున నెన్నడైన మనల సింకొకరు సమీపించిన, మనమెట్లు తప్పించుకొనిపోన బ్రియత్నింతుమో, కాని వారు మనముమరలిన దిక్కునకే వచ్చు చుందురో, యారీతినే యచటగూడ నట్టియాటసాగుచుండెను. సుఖదకు వాటికికూడ జ్ఞానముగలయట్లును, చిన్నచిన్ని బాలురు గుండ్రని టోపీలు పెట్టుకొని క్రీడించుచున్నట్లును వానిచేష్టలుశోభింపజేయుచుండెను.

ఈ తరుణమునకై నైనా యామెను కేకవెట్టెను. "వదినా! రమ్మ పడవ, పడవ, పందెము వైతము. నేను పడవలు కట్టుచున్నాను" అని.

సుఖద బలుబులు పులుగులవంక చూచుచు "నీవాడుకొనుము. నాకు మనసు పోవుటలే"దనెను.

నైనా యూరకొనలేను. రెండు పడవలు చేతబట్టుకొనివచ్చి సుఖదను బలిమిని లేవదీయసాగెను. "ఎవని పడవ యొద్దుదాక చేరునో వారికి జయము అయిదురూప్యముల పందెము" అనుచు.

సుఖద యనిష్టముతో "నాపక్షమునకూడ నొకపడవ విడువుము. గెలిచితివేని రూప్యములు తీసికొనుము. కానియిదే చెప్పివైచుచున్నాను. వాటికి మిఠాయిరాదు" అనెను.

"లేకున్న మందులువచ్చునా?"

"ఆహా! అంతకన్న మంచిమాట యేమున్నది? నగరమున వేల కొలది జనులు దగ్గు జ్వరములతో పడియున్నారు. వారికి కొంచె ముప కారము జరుగును."

ఇంతలో పిల్లవాడువచ్చి పడవలు రెంటిని లాగివైచి, నీటిలోవిడచి పెట్టి కరతాళధ్వనులు సేయసాగెను.

నైనా బాలకుని ముద్దుగొని "అచట నిత్యము నొకటి రెండు మార్లు వీని జ్ఞాపకమువచ్చి యేడ్చెడిదానను. మాటిమాటికి వీనిజ్ఞప్తి యేల వచ్చెడిదో తెలియదు" అనెను.

"మంచిది. నామాట యెన్నడైన స్మరించెడిదానవా?"

"ఎన్నడు లేదు. అగును. అన్నమాట జ్ఞాపకము వచ్చెడిది. వాడెంత నిష్ఠురుడు. ఆరుమాసముల కొక్కలేఖయైన వ్రాసినాడు కాడు. ఆతడు వ్రాసిననేగాని నేనును వ్రాయనని నిశ్చయించుకొన్నాను."

"అయిన నిజముగ నామాట యెన్నడు జ్ఞాపకము రాకుండె డిదా? చివరకు నీవు నీసోదరుని చెల్లెలివే యగుదువు. కనుచాటగుట తోడనే మఱువమాయుము."

"నాకు నీపై కోపమువచ్చెడిది. ఈ యారునెలలలో మూడు పర్యాయములు మాత్రమే వచ్చితిని. అదియు బాలకుని తీసికొని రాకుండగనే."

"పిడచటికేగిన తిరిగివచ్చుమాట యెత్తకు"

"అయిన నేను వానికి పగతురాలనా?"

"వారనిన నాకు విశ్వాసములేదు. నేనేమి చేయను? నీవచ్చుట నెటులనుంటివో నాకు బోధపడుటలేదు."

"కాని నేనేమిచేతును? పారిపోవుదునా? అప్పుడును ప్రపంచము నన్నే యధిక్షేపించును"

"మంచిది నిజముచెప్పవలెను నీభర్తగారునిన్ను ప్రేమించినారా?"

"అది నీవే యెఱుగుదువు"

"నేనేనైతినేని యట్టిమానిసితో నొక్కమాటయైన నాడను."

"నేను నెన్నడును పలుకలేదు"

"నిజమా? చాలకోపగించెనుకాబోలు. సంగతినంతటిని చెప్పుము. శోభనమునాటిరేయి యేమిజరిగినది? చూడు. ఒట్టు. ఒక్కశబ్దమయిన నసృత మాడరాదు."

నైనా తలవంచుకొని "వదినే! నన్నుగతాళి చేయుచున్నావు. పై పెచ్చు ఒట్లువెట్టితివి పొమ్ము. నేనెద్దియు చెప్పను" అనెను.

"సరియే చెప్పకుము బలవంతమా యేమి" అనుచులేచి సుఖద పైకి వెడలిపోవ నుంకించెను.

నైనా యామె చెయ్యిపట్టుకొని "ఒట్టుపెట్టి యింకనెట్లు పారిపోవుదువు? కూరుచుండుము. విను. నేటివరకు వారికి నాకు నొక్కమాటయైన జరుగలేదు"

సుఖద చకితయై "అరే! నిజముచెప్పు" మనెను.

నైనావ్యథిత చిత్తముతో "అగును. అంతయు నిజమే వదినే! ఏనాడు నేను వెడలితినో, నాటిరాత్రి వారు కంఠమున నొకహారము

వైచుకొని, మైకమున కన్నులు జేవురింప, మస్తకమును పగిది, కింకరుడు త్తమర్లుని ఘనము వసూలుగాదింప వచ్చుచుండగమున, నన్ను సమీపించిరి. తదుపరి నామేల్ముసుగు తొలగించుచు "నేనునీ మేలిముసుగు నూచుటకు రాలేదు. నాకీ కపటవ్యవహారము లిష్టము లేదు వచ్చి యీకుర్చీలో కూర్చుండుము. నేను పురాతనపు మనుష్యులవంటి వాడను కాను. బొమ్మలాటాపటము. నవ్యాచు నీవు నాకు స్వాగత మొసగవలసి యున్నది. విశేషించి ముసుగు తొలగించి నాముఖమున కునసూచుట కిష్టము లేనిదాని వలెనిలచియుంటివి." అనిరి నాగిహాస్తస్పర్శతగులుటమాత్రముచే నాదేహమున నెద్దియో సర్పము కాటువైచినట్లయ్యెను. నేనా పాదమస్తకము ముడుచుకొని పోయితిని. వారికి నా దేహము స్పృశించుట కేమి హక్కున్నది? ఆప్రశ్న జ్వాలవలె నామనసున నుదయించెను. నాకనులనుండి యశ్రులు రాలజొచ్చెను. నేను పెక్కుదినములనుండియు గాంచుచుండిన యాసమస్తసర్ణస్వప్నములు నెగిరిపోయెను. నేనిన్నినాళ్లనుండియు నుపాశించుచుండిన యా దేవత యిదియేనా? వీరియందు దేవత్వమును లేదు. మానవత్వమును లేదు. కేవలము మదాంధత యుండెను. అధికార గర్వముండెను. హృదయశూన్యముగు నిర్లజ్జత యుండెను. నేను శ్రద్ధయను పళ్ళెరమున, నాయాత్మకుగల యావగనుగాగమును, యావదానందమును, యావత్ప్రేమయు నాస్వామి చరణసామీప్యమున నివేదింప నుద్యుక్తురాలనై యుంటిని. ఈ యాకృతి గాంచినంతనే యప్రయత్నముగ నాచేతిపళ్ళెరము క్రింద బడిపోయెను. ధూపదీప నైవేద్యము లెల్ల పుడమిపాలాయెను. నాయొడలియందలి ప్రత్యేకరోమము నీయధికార గర్వమును ప్రతిఘటింపజొచ్చెను. నాయణువణువునందు వ్యాప్తమగుచుండిన యయ్యాత్మసమర్పణభావ మేమయ్యెనో? నాకు వారితో చెప్పివేయవలెనని బుద్ధిపుట్టినది. "మీతో వివాహము జరుగుట కాదర్శము మీదాసినగుట కాదు. మీరు నాస్వామియగుదురో నేను మీ స్వామినిని. పతి శాసనము విని వేదశాసనము నంగీకరింపను.

తమరు సంగీకరింపవలెనని కోరను.'' అనికాని నామనసుదహించుకొని పోవుచుండుటచే నింతమాత్రమును నానోటినుండి బయలువెడలినది కాదు. వెంటనే యచటినుండి లేచి బయటివసారాలోనికివచ్చి నిలచితిని. వారు నారాకకై కొంతవరకు నిరీక్షించుచుండిరిగాని, చివరకు క్రోధ విహ్వలులై లేచి, నాచేయిపట్టుకొని గదిలోనికి కీడ్చుకొనిపోవ నుద్య మించిరి. ఒక్కజాడింపుతో నేను నాచెయ్యిపట్టు వదలించుకొని కఠిన స్వనముతో "నే నీయవమానము సహింపనోల్ల''నని కెప్పివైచితిని.

వారు "ఓహూం ఈయందమున కింతయభిమానమా?'' యనిరి. నాయొడలు మండిపోయెను. ప్రత్యుత్తర మొసగలేదు. నేను గదిలోని కేగి తలుపులు బిగించుకొంటిని. ఆనాటినుండి తిరిగి యన్నము పలుకాడ లేదు. వారు తిరిగి వివాహముచేసికొని నన్ను విడిచిపెట్టుదురుగాక! యని యీశ్వరునకు వినతు లర్పించుచుందును. ఎవడు స్త్రీయందమునే కామించునో, ఎవ్వడు హావభావములకు కృత్రిమ విలాసములకు దాసుడో, ఎవనికి స్త్రీ కేవలము స్వార్థసిద్ధికి సాధనమాత్రమే యగునో యట్టివానిని నేను భర్తగ నంగీకరింప జాలను.''

సుఖద వినోదార్థము "కాని నీవుమాత్ర మాతనికి నీప్రేమపరి చయ మేమిగావించితివి? వివాహపు పేరులోనే యింతటి యభ్యుదయ మున్నదా? పతి దైవము వచ్చివచ్చుట తోడనే చరణములవ్రాలవలె నని యున్నదా?'' యని ప్రశ్నించెను.

నైనా గంభీరమై "అగును. నేను వివాహమనుటలోనే యాశీ ర్వాద మున్నదని భావింతును. వివాహము ధర్మబంధనమని గ్రహింపక వాసనాతృప్తికి సాధనగా భావించువాడు పశువు'' అనెను.

ఇంతలో శాంతికుమారుడు వర్షమున దడిసివచ్చి యెదుట నిలచెను.

సుఖద "ఎచ్చటతడిసినారు? గొడుగులేదా?'' యనిప్రశ్నించెను. శాంతికుమారుడు తడిసిన బూటుయుకుపులు విడిచి దండెమునవైచి,

"నేడు సంఘపుసభ జరిగెను. తిరిగివచ్చునపుడు వాహనమెద్దియు లభింప లే"దనెను.

"సభయందేమి జరిగినది? మనవిషయము చర్చకువచ్చెనా?"

"దేనికై భయపడితిమో యదియే జరిగినది?"

"ఎన్నివోట్లతో నోడిపోయినది?"

"కేవల మైనుతో మాత్రమే, అయిదుగురే మోసముగావించిరి లాలాధనీరా మేమాటయు నెత్తలేదు."

"ఉత్సాహముగ సుఖద "అయిన నికముందు?" అని ప్రశ్నించెను.

"ఇప్పుడు వార్తాపత్రికలు, నుపన్యాసముల మూలకముగ ఆందోళన జరుపవలెను."

సుఖదయుత్తేజితయై "అట్లుకాదు నేనంత సహనశీలనుకాను. లాలాధనీరాముడు నాని మిత్రులను సుఖముగ నింద్రింపనీయను. ఎల్లరకు ముఖస్తుతులొనరించి యిన్నినాళ్ళు చూచితిమి. ఇక మన శక్తి ప్రదర్శింపవలసియున్నది మరల నాలుగైదుసార్లైనను లాఠాహుతి గావింపవలెను. అప్పుడే లోకులకన్నులు విచ్చును. వీరికెల్లరకు పట్టణమున నుండుటకూడ కష్టముగావించివైతును"అనెను.

శాంతికుమారుడు లాలాధనీరామన్న మండిపడుచుండెను. "ఇది శేఠ్ ధనీరాముగావించిన దౌష్ట్యమే"యనెను.

సుఖద ద్వేషభావముతో "ఏరాముని దౌష్ట్యమైనగావిండు, నాకు భయములేదు. సంఘమంతయు నొక విధముగా నిశ్చయించినప్పుడు దానిబాధ్యత యేయొక్కమానవుని శిరముననుండదు. సంఘమంతటిపై నుండును. ఆభవనములనివసించువారికి ప్రజల హస్తములయందుగూడ శక్తియున్నదని చూపించెదను లాలాధనీరామ్ ఆస్థలములలో అడుగు పెట్టజాలడు"అనెను.

శాంతికుమారుడు విషాదముతో "ఈసమయమున ప్రచారము గావించుటయే చాలునని నాయభిప్రాయము. లేనిచో నీ వ్యాపారమిప్పుడే పెద్దదెపోవును" అనెను.

శాశ్వతసధి నిర్మాణానంతరమునంగీయు శాంతికుమారు డెట్టి యుపద్రవకరములగు కార్యములయందును పాల్గొనుటకు వెనుకంజవేయు చుండెను. వానిపై నేడొక సంఘముయొక్క బాధ్యతపడినది. నేడు వానికి మాటిమాటికి చెడ్డపేరు, తనసంస్థకు నష్టముగలుగునను భీతి యుదయించుచుండ జొచ్చెను.

సుఖద వాసని తిరస్కరించుచు "ఏమి మీరిట్టి వాక్యములాడు చుండిరి డాక్టరుగారు? ఈవిద్యాధికులగు స్వార్థపరులను చూచినైచితిని. మాటలయందుమాత్రమే వారు పులులనిబోధపడినది. ఏపేదలనింత వఱకు నలిపివేయుచుండిరో నాకేసర్పములైవారి పాదములకు జుట్టు కొందురని యాగపఱచెదను. ఇంతవఱకు వారాదరముమాత్రమేయభిల షించుచుండిరి. ఇపుడు వారు తమస్వత్వములను కోరెదను. దయచూపకుండుటకు వారికి దార్శ్యమున్నది కాని హక్కుల నెవడువంచింపగలడు? దయకై ప్రాణములెవ్వడును సమర్పింపడు. కాని స్వత్వముల కశువుల నాహుతిగావించుట యెల్లరికిని తెలియును. చూచెదను. లాలాధనీరాము వానిమిత్రులు నెంతలోతులో నున్నారో చూతును" అనుచు సుఖద యావర్షములోనే తడియుచు బయటికిజనెను.

ఒక్కనిమేషముగడిచినపిదప శాంతికుమారుడు నైనాతో "ఎచటికేగినది? ఇంతలోనే కుపితయగుచుండు" ననెను.

నైనాయిందునందు నఱసి, సేవకుని ప్రశ్నించెను సుఖద బయటికి వెడలిపోయెనని తెలిసెను. నైనావచ్చి యావార్త శాంతికుమారుని కెఱింగించెను.

శాంతికుమారుడు విస్మితుడై "ఈవర్షమున నెచ్చటికో వెడలిపోయినది కాబోలు. ఏదియేని హరతాళము గిరితాళము చేయించునే

మోయని శంకించుచున్నాను. నీవచ్చటికేగిన వెనుక నన్ను మఱచిపో యితిని నైనా! ఒక్కలేఖయైన వ్రాయనైతివి" అనుటయు, తటాలున వానికి తనముఖమునుండి యొక యనుచితభాషణ వెలువడెనన్న జ్ఞానము కలిగెను. అతడు నైనా నిట్టిపశ్న నైచియుండరాదు. ఆమె తన మన సున దీనికర్థమేమిగా భావించెనో? వానికొరులెవరో తన కుత్తికబట్టి నొక్కుచున్నట్లు లయ్యెను. అచటినుండి పారిపోవుటకు మార్గము నన్వే షించుచుండెను. ఒక్కక్షణికమైన నతడచటకూర్చుండజాలకు. నైనా కోపించి, యేదైన నవిచేయునేమోయని వానిహృదయము తల్లడిల్ల సాగెను. ఇట్టిమూర్ఖపుపని తానెట్లుచేసినైచెను? ఇప్పుడాతని గౌరవము దేవునిహస్తములయందున్నది.

నైనాముఖము జేవురించెను. ఆమె ప్రత్యుత్తరమొసంగక, తన మేనయల్లుని బిలుచుచు లోనికివెడలిపోయెను. శాంతికుమారుడు చేతనా రహితుడై విగ్రహామువలె కూర్చుండిపోయెను. తుదకతడు లేచి, తలవం చుకొని, పాదరక్షలు తనపైన వర్షించుచున్నవోయన, వెడలిపోసాగెను. నైనా యారక్తముఖమండలదీప్తిజ్వాలవలె భాతివానియంతఃపటమును దహించివైచుచుండెను.

సహృదయముగల నైనా, "యెచటికిపోయెదరు డాక్టరుగారు! వర్షమించుక వెలువనిండ" నెను.

శాంతికుమారుడేదియో కొంచెము చెప్పదలచెను. కానిశబ్దము వెలువడలేదు. అతడు బయటికి వెడలిపోయెను. లోలోన పశ్చాత్తాప పడుచుండెను" పతనము! పతనము!!" అనుకొనుచు, కనులయందశ్రు జలసాగరముపొంగి పొఱలుచుండెను.

---

## —( 12 వ ప్రకరణము )—

ఇప్పటికిని తొండములావు ధార పడుచుండెను. వర్షముచే సాయంతనమునకు ముందే చీకటిపడిపోయెను. సుఖదదేవళమున నాసీ

నయయి, పురపాలకవర్గము నకును, దానికర్ణధారుల్కును సిరసులువిగంత రమవసతములగు నట్టిదియు, వారునీచులుగా నెవరినిభావించుచుండిరో వారిదయానేవలపైననే తమ జీవితములాధారపడియుండెనని దెలియ జాలునట్టిదియు,గట్టిపాఠము గఱుపజాలునట్టిదియు నొక బ్రహ్మాండమగు హరతాళము గావింపించుటకు జతనములు సల్పుచుంచెను. పురమం దెల్లెడ నొకపిధమగునలసంచలము గల్గెను. ఎద్దియో శత్రుసైన్యము ముట్టడి గావించునట్లు, ఒక్కచోట రజకులు పోగువడిరి. ఒక్కచోట మాదిగలు, వేరొకచోట చక్చర్లు సమావేశమగుచుండిరి. మంగళ్ళు, శూద్రులు నొకచో పంచాయితి గావించుచుండిరి. సుఖద దేవి యానతి నెవ్వరుల్లంఘింపగలరు? నమ్మటకు వీలులేనంత శీఘ్రముగ పట్టణమం దెల్లడ నీవార్తపొక్కిపోయెను. అట్టియవసరములందెట్లు పరుగిడువారు దొఱకుదురో, గాలిలోకూడ చలనము కలుగునో తెలియదు కొన్ని నెలలనుండి ప్రజలు క్రొత్తక్రొత్త యిండ్లలో నివసింతుమనియు, పరి శుభ్రమగు గాలి వెలుతురు జొఱగల్గు గీములయందు వసింతుమనియు నాసించుచుండిరి. ఒక నవ్యజీవనపు స్వప్నములు కనుచుండిరి. నేడు పురపాలకవర్గమువారు తమయాసలన్నిటిని మంటిపాలు గావించివైచిరి.

ప్రజలెట్టి యన్యాయము జరిగినను సహించియూరకుండుస్థితిలో లేరు. వారికి తమస్వత్వముల జ్ఞానముకలుగుచుండెను. తమకును ధని కుల రీతిని సుఖముగబ్రదుకు హక్కుకలదని వారికిని తెలిసిపోయెను. బహుకష్టముమీద తెలియగలది, ప్రజకు ప్రత్యక్షరూపమున నగపడ జాలనిదియునగు రాజనైతిక సమరముకాదిది. ఇయ్యాందోళనకు తాత్కాలిక ఫలితమువారి కట్టెదుటనేయున్నది. భావనకుగాని, కల్ప నల యుత్తేజనమునకుగాని యావసరములేని యుద్యమమిది. చీకటిప డుచు పడుచునుండగనే దేవాలయమున నొకపెద్దసంతకువలె ప్రజలు పోగైరి.

రజకకులసుడు, కులమునకు పెద్దయునగు మైకూమద్యపానమున నెఱ్ఱవారిన కన్నులతో, మేకగడ్డమువంటి తనగడ్డము నాడించుచు, "బట్టలు బాగుచేయుచుండగా వర్తమానము తెలిసినది. పరుగుపరుగున వచ్చినాను. ఇంటిబట్టలన్నిటిని పెట్టుకొనుటకైన తావులేదు. తడిబట్టు లెచ్చట నారగట్టను అనెను.

అందుపై జగన్నాధమెహాగా "అబద్ధములాడకు మైకూ ఇప్పుడు నీవు బట్టలుబాగుచేయుచుంటివా? తిన్నగా కల్లంగడినుండి వచ్చుచు న్నావు. ఎంతచెప్పినను నీయలవాటు నీవుమానవు"అనెను.

మైకూ కోపముతో "చాలు. ఊరకుండుము చౌదరీ! లేకున్న నీసంగతి బయటపెట్టెదను. ఇంటిలోగూర్చుండి సీసాలకు సీసాలె గుర గొట్టెదవు. ఇచటికివచ్చి పెద్దమాటలు చెప్పుచున్నావు"అనెను.

పాకీవాండ్రయధ్యక్షుడు మతియీ నిలువబడి తన జమాందారీ శివి చూపించుచు "పంచాయితీదారులారా! గాలిపలుకు లాడవల సిన విషయముగాదిది. ఏపనికై సుఖదాదేవి మనలను రావించినదో, దాని విషయము మనమేమిచేయవలెను నిర్ణయింపుడు. ఈలోటారము లలోనేపడి కుళ్లుదమా, లేకున్న నేగి ధనికులతో కయ్యములాడు దమా? అనెను.

సుఖద విప్లవపోత్సాహకరములగు వాక్యములతో "అధికారు లకు చెప్పవలసినది, వినవలసినది, జరిగిపోయినది. ఏరును గవంతమైన వినలేదు. ఆరుమాసములనుండి చెప్పుట వినుట జరుగుచునేయున్నది. ఇప్పటివఱకు నేవిధమగు ఫలితమును గలుగకున్న నిపుడుమాత్ర మేమి వెలువడగలదు? సక్రమపద్ధతులతో పనిసాగించుకొన యత్నించితిమి. మంచిమాటలతో పనిజరుగదని తెలిసినది. మనమెంతగా నడగియుం దుమో పెద్దవారు మనలనంతగా నణగద్రొక్క ప్రయత్నింతురు. మీరు మీమీస్వత్వములకొఱకు పోరాడుదురులేదోనేడే నిశ్చయము గావింప వలసియున్నది"అనెను.

మాదిగవాండ్ర ముఖ్యుడు సుమేరు తనచేతికఱ్ఱ నాడించుచు, దళసరిముక్కుద్దములతో చూచుచు తనబోసినోటితో "వినతులు, విజ్ఞప్తులుకాక మనము చేయగలిగినదేమున్నది? మనవల నేమియగును?" అనెను.

మురళీఖటిక్ తనపెద్దపెద్ద మీసముల దువ్వుకొనుచు "వల నేల కాదు? మనము మనుష్యులముకామా? మనకాలు బిడ్డలులేరా? కొందరికి మంచిమంచి భవనములు కావలసివచ్చిన, మనకుచితములగు నిండ్లయిన నుండకూడదా? నాయింట నేవురు మనుష్యులున్నారు- అందు నలువురు నెలల తఱబడిరోగులు. ఆకటికి చీకటికి చీకటికొట్టులో జబ్బు చేయక నేమగును? ఎపుట ముఱికికాలువ ప్రవహించుచుండును. ఊపిరి పీల్చుకొందమనిన ముక్కు పగులుచుండును"యనెను.

ఈదూకుంజడా, జారిపోవుచున్న నడికట్టుబిగించుకొనుచు మన భాగ్యమున సుఖజీవనమే వ్రాయబడియుండిన మనముకూడ నేదైన నున్నతకుటుంబముననే జన్మింపకపోతిమా? హాఫిజ్‌హాలీమ్ నేడు పెద్దవాడైపోయెను. ఇపుడు ధనికుల యాడంబరము! యెదుటకేగిన నిప్పుడు గుర్తింపనే గుర్తింపడు. లేనిచో పూర్వముకాసికి, ఏగానికి దుంపలు, కూరగాయలు, అప్పుడపుడు పట్టుకుపోవుచుండెడివాడు. దైవము కడు కార్యసాధకుడు. ఇపుడు కుమారుడుగూడ పెద్దయధికారియైపోయినాడు. ఏమిచెప్పుదును?" యనెను.

జంగలీ ఘూసీ పూర్తిగ నల్లనివిగ్రహము. పట్టణమంతటికిని ప్రసిద్ధుడగుమల్లు.

"నాకుమొదటనే తెలియును. కొంచెమును జరిగెడిది పెట్టెడిది లేదని, అధికారులముందు మనజోలి యేరికికావలె"ననె నాతడు.

ఆమీార్‌బేగు తనకొంగమెడను పైకెత్తి "సంఘమువారి తీర్పుపైన అప్పీలుండును కాబోలు. హైకోర్టులో అప్పీలు చేయవలెను. హైకోర్టు నిరాకరించిన రాజుగారికి విన్నవించుకోవచ్చు" ననెను.

సుఖద సవ్వుచు "సంఘమువారితీర్పుపై నభియోగమిప్పుడు మీ సమక్షమున నున్నదియే. మీరే హైకోర్టు. మీరే న్యాయాధిపతులు. సంఘమువా రధికారుల ముఖము చూచును. అధికారుల భవనములు నిర్మించుటకొరకు పేటలు త్రవ్వివేయుదురు. పేదల కైదో పదియో రూప్యముల నష్టపరిహార మొసగి, యాస్థలములకే వేలకొలది రూప్యములు గైకొందురు. ఆ సొమ్ముతో నధికారులకు పెద్దపెద్ద వేతనము లొసగుదురు. ఏస్థలముకొరకు మనము తగవులాడు చుంటిమో యది లాలాధనీరాముస కిచ్చివేయబడినది. అచట వారిభవనము నిర్మింప బడును. బోర్డుకు రూప్యములనిన ప్రీతి. బోర్డుదృష్టిలో మీప్రాణముల కెంతమాత్రము విలువలేదు. ఈస్వార్థులనుండి న్యాయముల నభిలషించుట వర్జింపుడు. మీకెంత శక్తికలదో వారికి దెలియదు. ఈపేదలు మనలను చేసెడిదిమాత్రి మేమికలదని వారుతలంతురు. నేను చెప్పెడి దేమనిన సమస్తము మీచేతులలోనే యున్నది. మనము యుద్ధము చేయనక్కరలేదు. ఉపద్రవము సేయ నవసరములేదు. బోర్డుతీర్పు మీ కంగీకారము కాదని చూపించుటకు మీరు హరతాళముమాత్రము చేయువలసియున్నది. ఇది యొకటి రెండుదినముల హరతాళము కాదు. బోర్డువారు తమ నిర్ణయమును రద్దుపఱచుకొని, యాస్థలములను మన కిచ్చువరకు నది సాగుచునే యుండును. అట్టి హరతాళము జరుపుట సులభము కాదని నేను మీకు తెలియచెప్పుచున్నాను. మీలో చాల మంది యొక్కనాటికైన సరిపడు భోజనము లేనివారున్నారు. కాని కష్ట పడనిదే సుఖము కలుగజాలదని మాత్రము మీరు తెలిసికొనుడు." అనెను.

సుమేరుకు జోళ్ళదుకాణ మున్నది. ముప్వురు నలుగురు మాదిగ నౌకర్లుండిరి. ఆతడు సొంతముగ చెప్పులు కత్తిరించును. కూలీలువానిని నాయకుని గావించిరి. పచ్చగడ్డి నమ్ముకొను వారికి, నశ్వపాలకులకు నాతడు పెట్టుబడులు పెట్టుచుండును. అతడు తన ముక్కుద్దములలోనుండి

అమీరుబేగు తనకొంగ మెడకు పైకెత్తి "దేవీ! నేను చట్టముల రీతు లెఱుగను. కాని తప్పక రాజు ప్రజలకు న్యాయము చేయునని మాత్ర మెఱుగుదును రాత్రులు వేషములు మార్చుకొని ప్రజల కష్ట నిష్టురము లెరుగుటకు బయలు వెడలుచుండునట మనమెల్లరము సంతకములుచేసి యొకపెద్ద విన్నపమును పైకి పంపితిమేని దానిని తప్పక మన్నింతురు" అనెను.

సుఖద జగన్నాథునివంక నాశామయములగు దృష్టులుబఱపుచు "నీ వేమనెదవు జగన్నాథ్! వీరెల్లరు ప్రత్యుత్తరము నిచ్చివైచినారా?" యని ప్రశ్నించెను.

జగన్నాథుడు ప్రక్కచూపులు చూచుచు "దేవీ! ఒంటరిగ నేను శనగలు గుండకొట్టగలనా? అందఱు సాయపడినచో నేను సిద్ధము. మాకెల్లరకు జీవనాధారము నౌకరి కొందరు పల్లకులు మోయుదురు. కొందఱు బిచ్చమెత్తుదురు. కాని విశేషసంఖ్య పెద్దపెద్దవారికడ సేవకులుగ నుందురు. రెండుమూడు దినములలో కలవారి యింటిస్త్రీలుకూడ యింటి పనిపాటలు చేసికొన నలవడుదురు. మాకు వినాశము తప్పదు" అనెను.

సుఖద వానినుండికూడ ముఖము మఱల్చుకొని మతయీతో "నీ వేమనెదవు? నీవుకూడ సాహసము కోలుపోయితివా?" అనెను.

మతయీ వక్షస్థలము చఱచుకొనుచు "మాటయిచ్చి తప్పిపోవుట పనికిరానివారిపని దేవీ? మీయాజ్ఞ యెట్లిదైనను నడుగుదాటను. ప్రాణము లుండిననుసరియే పోయినను సరియే. దేవునిదయవలన మావాండ్రలో నాకింతమాత్రము గౌరవమున్నది. ఏదిచెప్పినను వారు కాదనిమాత్రము నిరాకరింపరు" అనెను.

సుఖద నిశ్చయభావముతో "మంచిది. రేపటినుండి మీసంఘము వారి నెల్లరను హరతాళము గావింపజేయుము. నేను స్వయముగనిల్లిల్లు తిరిగెదను. ప్రతిగుమ్మము నెక్కి దిగెదను. ఒకొక్కరికాళ్ళు పట్టు

కొనెదను. హరతాళము చేయించి వదలి పెట్టెదను. హరతాళమే జరుగనిచో నవమానముతో మునిగి చత్తును. నాకు మీయెల్లరిపై నెంతో యాశయుండెడిది. మీతీవ్రత యెక్కువగ నుండెడిది. అభిమానముండెడిది. మీరు నాయభిమానమంతయుఁబీటికిచ్చివైచినారు" అనిపల్కుచు వర్షములో తడియుచు, నామె విసవిస నడచి వెడలిపోయెను. చౌదవర్గమువారు సాపరాధులగుటచే తమముఖములను వ్రేలవైచుకొని కూర్చుండిరి

ఒక క్షణికానంతరము జగన్నాథ్ "ఈమెకు పులివంటిధైర్యమున్నది" అనెను.

సుమేరు తన బోటినోటిని తాటించుచు "లచ్చిమి అవతారము కాని అన్నా! వృత్తి వదలిపెట్టలేము. అధికారుల నెవ్వడు ధిక్కరింపగలడు? పది పదునైదు దినములవరకు సాగినచో నిచట చావు మూడును." అనెను.

దూర మాలోచించి యీదూ పలికెను. "చావుమూడదు. పేదలను చెరలో పారవేయుదురు. ఏమనుకొనుచున్నారో? అధికారులతో పోట్లాట వేళాకోళముకాదు" అనెను.

జంగలీ "మనమేమితిని ధనికులతో పోట్లాడగలము? ఆమెకైనధనమున్నది. విద్యయున్నది. అధికారులతో రెండుముక్కలు మాటాడగలదు. అన్నివిధముల నష్టములు భరింపగలదు. మనకైనచో నెద్దు పండుకొనును" అనెను.

కాని యెల్లరును రణక్షేత్రమునుండి వెన్నిచ్చి పాటివచ్చిన యోధులవలె మనసులో లజ్జించుచుండిరి. యోధునకు ప్రాణము లమ్ముకొనుట యెంత మోదావహముగ నుండునో, రణరంగమునుండి పాటివచ్చుట కంత సిగ్గగుచుండును. అతడు మాటలతో తాను పాటిపోయివచ్చినందుల కెంతసమర్థించుకొన బ్రయత్నించినను మనసునకుమాత్రము రియగు సమాధానము చెప్పుకొనజాలడు.

కొంతవడికి వర్షము వెలిసెను. ప్రజయు నచటినుండి వెడలి పోయెను- కాని వారి విచారయుక్తములగు విలాపములు, వారి మంద గమనము, వారినతమస్తకములు, వారిచింతామయవదనము, వారి హృదయావస్థను సూచించుచునే యుండెను.

---

## 13వ ప్రకరణము.

సుఖద యిల్లుచేరునరికి నిశ్శేషవిషాదగ్రస్థయై యుండెను. సార్వ జనికకార్యముల యందామె కపజయము కల్గుటకిదియే తొలియనుభవము. ఆమె కొఱడా దెబ్బలుతినిన యశిక్షితాశ్వకిశోరము, కట్టుత్రాళ్ళు త్రెంచుకొని మొండైన పాటిపోవలెనని యత్నించువడువున నారడిపడు చుండెను. విహ్వలిత యగుచుండెను. ఇట్టి కార్యశూరులవలన నామె యేమి యాసింపగలదు? ఎవరుస్థాయీ లబ్ధికొఱకు కొద్దిమాత్రపు కష్ట ములను సహింపజాలరో వారికొఱకు ప్రపంచమున నవమానము, దుఃఖము సహించుటకన్న వేరెద్దియుండును?

నైనా యీయోటమికి చాల సంతసించుచుండెను. ఇంట నామె నడిగెడువారు పెట్టెడువారు లేరు. ఆమె కింతవరకు నవమానమేగాని వేరొండు లభింపలేదు. కాని యామె భవిష్యత్తుకూడ ఈకుటుంబ ముతో బంధింబజడి యున్నది. తనకన్ను బాధించినను దానిని పెకలించి పారవైచుకొన జాలదు, శేఠ్ ధనీరామ్ తాను వేలువెచ్చించి విలిచిన స్థలము లక్షలకు విక్రయింపవలెనని యాసించుచుండెను. నైనాసుఖదతో నెద్దియు చెప్పజాలకుండినను, ఈయాందోళన మాత్రమామెకు తప్పుగా దోచుచుండెను. సుఖదపై నామెకు పూర్వమంతటి భక్తిలేకుండెను. సుఖద తనద్వేషతృష్ణ నుపశమింప జేసికొనుటకే నగరమున నిప్పువెట్టు చుండెను. ఈతుచ్ఛభావములచే నతిమైన సుఖద నైనాదృష్టియందు రవంత నీచస్వభావము గలదిగ దోచుచుండెను.

ఆలోచించుచు నైనా "ఇచటిజనుల నెల్లరిని కట్టుకట్టించుట సులువేమైనచో, నేడిట్టి దుర్దశ యేలకలుగును?'' అనెను.

ఆవేశముతో సుఖద "చౌదరీవర్గము కలియ్యకొన్నను లేకున్నను, హరతాళము జరిగితీరును. చౌదరీ మోటువానిషి. అట్టివాడు స్వార్థి గానే యుండును అనుటయు, నైనా "భయము మనుజునకు స్వాభావిక లక్షణము. ఎవనికిపౌరుషము, జ్ఞానము, బలము నుండునో వాడు బాధలను దృణీకరింపజాలును, భక్ష్యములపట్లెవనికి మెననియుండునో వాడు ఒక్క కొంకమునకు పాల్పడ జాలును. ఎవనికొక్కతునుకమాత్రమే కలదో వాడు దానిని కఱచిపట్టుకొని కూర్చుండును.'' అనెను.

ఈమాట సుఖద వినలేదు. "ఈ దేవాలయపు విషయమైన జగడములో నెల్లరకు సాహసమెట్లువచ్చినదో తెలియదు. మరల నా కాండయే యొకసారి చూపింపవలెనని కోరుచున్నాను'' అనెను.

నైనా కంపించుచు "వలదు వదినే! అంతభారము నీనెత్తిని బెట్టుకొనకు. తరుణమాసన్నమైనపుడు సర్వము తనంతతానే జరుగును. చూడలేదా మనకండ్లయెదుటనే బాల్యవివాహములు అంటుదోషపు పద్ధతులు నెంతతగ్గిపోయినవో? శిక్షయొక్క ప్రచార మెంత విస్తృతమై పోయినది! కాలము ప్రాప్తించినచో పేదలకు నట్టిలే గృహములును నిర్మితములు కాగలవు'' అనెను.

"అది భీరువులనీతి! సమయమును తమకనుకూలవర్తిగ నొనర్చుకొనుటయే పురుషార్థము''

"దీనికి ప్రచార మొనరించుట యావశ్యకము''

"అది ఆరునెలలక్రింది పద్ధతి''

"కాని, అనిష్టము లేదు''

"ప్రజకు నాయెడల విశ్వాసములేదు.'' అని మరల నొకక్షణి కాసంతరము "వారికి నాపై నంతవిశ్వాసము కలుగుటకు నేనిప్పు జే

మంతఘనమగు సేవచేసితిని? రెండుమూడుగంటలు సందులు గొందుల వెంట తిరుగుట యొకపెద్దసేవకాదు.'' అనెను.

"ఇప్పుడు హరతాళము గావింపించుటచే ప్రజలపైగల రవంత సానుభూతియు దొలగిపోవు ననుకొందు'' ననెను నైనా.

సుఖద నడుమున చెయ్యివెట్టుకొని "సానుభూతిచే పనిజరిగినచో ఏడ్చుటయెందుకు? ప్రజ తమంతతామే యిష్టపడి ఋజుమార్గవర్తులై సంచరించిన శిక్షాశాసనములేల? ఈయింటనేయుండి, ధనికుల యాడంబరములన్నిటిని గీగియుంటినేని, నేను జనులను వశపరచుకొనజాలను. త్యాగమొనరింపవలెను. ఇన్నినాళ్లనుండి యాలోచనతోనే గడిపివైచితిని అనెను.

మఱునాడు నగరమున ప్రబలమైన హరతాళము ప్రారంభమయ్యెను. పాకీవాడొక్కడును కంటబడుటలేదు. బండితోలువారు పని కట్టివైచిరి. కూరగాయలయంగళ్ళు సగమునకుపైగా మూసివేయబడెను. పెక్కురగృహములనుండి పాలుకయి హాహాకారములు బయలువెడలెను. రక్షకభటులు లంగళ్లను బలిమిని తెఱిపించుచుండిరి. పాకీవాండ్రను పనిలోజొప్పింప ప్రయత్నములు గావించుచుండిరి. అచట మండలాధికారవర్గమున నీయవస్థను దొలగించుటకు వలయునాలోచనలు గావింపబడుచుండెను. నగరమందలి యధికారులు, ధనికులు గూడ ఆసమావేశమున పాల్గొనుచుండిరి.

మధ్యాహ్నము ఆకసమున పసుపలందినట్లు మేఘ మలముకొనుచుండెను. తోటలయందు, సందులందు నీరు నిలచియుండెను. ఆరాంపిలోనే ప్రజలటునిటు పరువులెత్తుచుండిరి. సుఖగ విడిగియుందొక పెద్దగుంపుచేరెను. ఇంతలో శాంతికుమారుడు మోకాలివరకు బురదతోవచ్చి వసారాలో నిలుచబడెను. కడచిన నాటిప్రసంగమునకుబిగప, నేడిచటికి వచ్చుటలోడనే వానికి సంకోచము గలుగజొచ్చెను. నైనా యాతనిని చూచినది. కాని లోనికి బిలువలేదు. సుఖద తనతల్లితో

మాటలాడుచుండెను. శాంతికుమారుడు ముహూర్తకాలము నిలిచి, హతాశుడై, వెనుకకు దిరిగిపోనుద్యుక్తుడయ్యెను.

సుఖద విచారగ్రస్తమగు వానివదనము నవలోకించెను. కాని వ్యంగ్యప్రహారణము లొనరింపక విడువలేదు. "మీరిచటికి వచ్చుచుంట నెవరును చూచియుండలేదుగదా డాక్టరుగారు?" అని.

శాంతికుమారుడీవ్యంగ్యప్రహారమును పరిహాసముతో వారించుకొనుచు "జాగ్రత్తగ చూచుకొనుచునే వచ్చితిని. ఒకవేళ ఎవ్వరైన చూచినప్పటికి, నించుక యప్పుడిసికొనిపో వచ్చితినని చెప్పెదను." అనెను.

రేణుక డాక్టరుతో సల్లునిసంబంధమును జోడించెను. నిన్నటి సంగతి తల్లికిచెప్పి సుఖద డాక్టరును వ్యంగోక్తిచే సిగ్గిలజేయదగిన సామగ్రి సమకూర్చి యుంచినది. కాని డాక్టరు నీమమును భేదించుటకు రేణుకయే కారణమై యుండెను. వానికి శాశ్వతసంస్థాభారమును దగిలించి, యొకింత యాలోచనలో పడవైచుట కామెయే హేతువు.

డాక్టరును చేయిపట్టుకొని కుర్చీలో కూర్చుండబెట్టుచు, రేణుక "గాజులు తగిలించుకొని, కూర్చుండరాదా? ఇంతగా నీమీసలు పెంచుటేటికి!" అని యెగతాళి మొదలిడెను.

నవ్వుచు శాంతికుమారుడు "నేను సిద్ధమే. కాని నన్ను పెండ్లి చేసికొనుటకు మీరుమాత్రము తయారుగా నుండుడు" మిమ్ములను పురుషునిగా మార్చవలసివచ్చును" అనెను.

రేణుక చప్పటులు చఱచుచు "ముసలిదాని నైపోయితిని. కాని రాణివాసమున నునిచి, చీవాట్లతో ప్రసంగము ప్రారంభించెడి పతినే వెదకి తెచ్చెదను. మోమున కుంకుమతిలకముదిద్ది, మేల్ముసుగు దాల్పవలెను. ముందుగా పతిభుజించును. వానియుచ్ఛిష్టము మీకు లభించును. అదియే దేవతాప్రసాదముగ నారగింపవలెను. ఆపంత భూము[?]లు, నా[?], చి ంచిన చో నవలక్షణముగ భావింపబడును.

వాని పదసంవాహనము గావింపవలెను. మడుగుధోవతు లుదకవలెను. ఎచటనుండియైన లోనడుగిడునేని, పాదప్రక్షాళనగావించి శిరమున జల్లుకొనవలెను. విశేషించి, శిశువులను కనవలెను. పిల్లలు పుట్టకున్న నతడు మారుపెండ్లి చేసికొనగలడు. అపుడు సవతికి సేవకురాలై బ్రతుక వలసి వచ్చును.'' అని యెడతెగని మొగతాళి మొదలిడెను.

శాంతికుమారు డీపరిహారణములతో నవ్వుటాలమాట మఱచి పోయెను. వానికి సుంతదుఃఖము వచ్చెను. ముఖమున ప్రేతకళ యావ హిల్లినట్లులయ్యెను. వాక్కు కట్టువడిపోయెను పెదవులు కదల్తు మన్నను మెదలలేదు. రేణుక పలుతడవలు వాని నెగతాళియొనరించి యుండెను. గాని నేడు వానినేడ్పించి విడిచిపెట్టెను. పరిహాసమునస్త్రీ, అందుముఖ్యముగ, వృద్ధస్త్రీ యగునేని అజేయయగును.

డాక్టరెట్టకేలకు గడియారమువంక చూచుచు "ఒంటిగంటయగు చున్నది. నేను సమ్మెకట్టు బాగుగా జరుగుచున్న'' దనెను.

రేణుక మరల దెబ్బతీసెను, "మీరింటిలో శయనించియుండ, మీకెట్లు తెలియు''నని.

శాంతికుమారుడు తనకార్యపరత్వమును దెలుపుచు అట్లు "విశ్రమిం చువారిలో నొకడనుకాను. ప్రతియాందోళనయందును గుప్తరూపము సాయ మొనర్చువార యావశ్యకత యుండును. నేను నానీతిని మార్చు కొంటిని. ఈరీతిచే నెంతమాత్రము తక్కువసేవ జరుగదని నాకుబోధ పడినది. నేడు నవయువకసభలో పదిమందిని సిద్ధముగావించి వచ్చితిని లేకున్నచో నింతలో నాల్గవనంతు హరతాళమైనను జరిగియుండెడిది కాదు.'' అనెను.

రేణుక తకుచూర్తెవీపును చఱచుచు "అట్లయిన వీరికి నీవేటికిపయశ ముగలిగించుచుంటివి? పాపము! ఇంతప్రాణము కష్టపెట్టుకొన్నను చెడ్డపేరు వచ్చినది. ఈరీతి నాకును నచ్చినది. ఎల్లరును నగ్నిలో దూకుట నుంచిదికాదు.'' అనెను.

శాంతికమూరుకు మఱునాటకార్యక్రమమును ముచ్చటించి, సుఖదకు తనపైగల యావిశ్వాసమును ఆలింగించుకొని వెడలిపోయెను.

సాయంతనమయ్యెను. మబ్బువిడెగా బాలచంద్రుని స్వర్ణజ్యోత్స్నలు, వర్షబిందువులచే నార్ద్రమైయున్న వృక్షముఖమండలములపై మాతృస్నేహముగూర్చి, వర్షించుచుండెను. "సుఖద సంధ్యావార్చుకొన నాసీనయై యుండెను. గభీరముగా నాత్మచింతలో నామెయొక్క మనోదౌర్బల్యము, శంకించిన బాలకునికిది నేర్పుచుండినట్లామెకు దోచుచుండెను. మణీరామే తన్నవమానించియుండనిచో తానీవిధమగు తీవ్రపరిహారతాళమును ప్రోత్సహించి యుండెడిదా?

అనె యభిమానము చెప్పసాగినది; "ఔను! తప్పక చేయుదువు. ఈయాలోచన చాలకాలముక్రితమే నీమనసులో నుండియున్నది." అని.

ధనీరామునకు హానికలిగిన గలుగుగాక! ఆభీతిచేత నామె తన కర్తవ్యము నెట్లుల్లంఘింపగలదు? ఎన్నడు తనసర్వస్వము నీయుద్యమము కొఱకాహుతిసేయ సంసిద్ధయై యున్నదో, అట్టితరుణమున పరుల హానిలాభములచింత తానెట్లు పెట్టుకొనగలదు.

ఇట్లు మనసు సరిపెట్టుకొని, సంధ్యపూర్తి గావించుకొని సుఖద మేడదిగెను. ఇంతలో లాలాసమరకాంతు డెదుటనిలచెను. వానిముఖమున విషాదచ్ఛాయ అలముకొనెను. అతనిభావములు వెలువరించుటకు విహ్వలుడగుచుండెను, ప్రబలప్రయత్నము గావించి నిరోధించుకొనుచున్నట్లు పెదవులు గట్టిగ కఱచిపెట్టుకొనియుండెను. సుఖద...

"మీరేదో భయవిహ్వలులుగ నున్నట్లున్నది. సంగతియేమి మామగారు!" అనియడిగెను.

సమరకాంతుని తనువు కంపించుచుండెను. అశ్రుధారనతికష్టవిశ్వప్రయత్నము గావించుచు "పోలీసు కర్మచారియొకడు సూచన గావించినాడు. ఏమిచెప్పను? ......"

అని పలుకుచుండగనే వానికంఠస్వరము లోతునీటిలో మునకలు వేయుచున్నట్లైపోయెను.

సంశయించుచు సుఖద "ఏమనెదో చెప్పరాదా? హరిద్వారమున నెల్లరకు కుశలమేకదా?" అనెను.

సమరకాంతు డామెసందియము లు వేరొకపక్కకు ప్రవహించుచుండుటగాంచి వడివడి "కాదు ... కాదు! అచట నేరిసంగతియు కాదు. నీవిషయమే. నిన్ను చెఱబెట్ట నుత్తరువైనది" అనెను.

నవ్వుచు సుఖద "మేలు. నన్ను నిర్బంధింప నాజ్ఞయైనదా? దానికి మీరింతగా కంగారుపడనేల? కాని తుదకు నాయపరాధమేమి?" అని ప్రశ్నించెను.

సమరకాంతుడు హృదయమును కుదుటబఱచుకొని "ఈసమ్మె కట్టే అధికారులు మంతనమున్డిరి. చౌదరీలను నిన్నును పట్టుకొని నిశ్చయించిరి. దమనమొక్కటియే శరణ్యమని వారికి తోచినది. అసంతృప్తి హేతువును వారు నిర్మూలింపజాలరు. కావున పట్టుకొనియో, గిట్టుకొనియో కార్యము సానుకూలము గావించుకొన నూహించుచున్నారు. ఆకలిగొని యేడ్చుశిశువును వీపుచరుచుచు నూరడింపజూచు తల్లివడువున" అనుటయు సుఖద ప్రశాంతచిత్తముతో

"ఏసంఘమునకు అన్యాయమే యాధారమో దానికిదండన గాక వేరేమి సాధనయుండును? కాని, ఈయాందోళన యింతమాత్రముచే నణగిపోవునని మాత్రము తలంపకుడు. కందుకము నెంతగట్టిగతన్నిన నంతటివేగముతో తిరిగివచ్చునట్లు ఎంతయొత్తిడి గలిగింతురో అంతతీవ్రతతో నీయుద్యమము ప్రబలము కాగలదు" అనెను.

ఒకక్షణమువెనుక నామెయుద్విగ్నయై "నన్ను చెఱగావింతురు గాక! కాని ఆకసమున కెగయునట్లార్తనాదము గావించు నాలక్షల కొలంది దరిద్రుల నెచటికి గొనిపోగలరు? ఆయార్తియే యొకనాడగ్నిపర్వతముమాడ్కి ప్రేలి, యావత్సంఘము ను ప్రభుత్వమును నాశము

గావింపగలదు. ఎవరికికన్నులు విశీనను, విడకున్నను నాకర్తవ్యము నేను నెఱవేర్చితిని. నేటిదేవతలు కంకఱరాళ్ళవగిది సందుగొందులలో విసరి వేయబడుటయు, కాళ్ళతో ద్రొక్కబడుటయు, తన్నబడుటయు జరుగు దినము తప్పక రాగలదు. నన్ను బంధించివేయుటచే కొంతకాలమువఱకు నధికారుల కర్ణకుహరములలో ప్రజల హాహాకారములు ప్రతిధ్వనింపక పోవచ్చును. కాని యీయశ్రుబిందువులే నిప్పుకలై యన్యాయమును భస్మీపటలము గావించి, యాకసమునంటు మహోజ్జ్వల జ్వాలామాలికలై' గడగడ లాడింపజేయునట్టియాదినమువిశేషముదూరమునగలేదు', అనెను.

సమరకాంతునిపై నీప్రలాపముయొక్క ప్రభావము పనిచేయ లేదు. ఆతడీసంకటమును దప్పించుకొను నుపాయమాలోచించుచుండెను. భయపడుచు "నీవు తప్పుపట్టుకొనకున్న నొకమాట చెప్పుదునా? జామీను..." అనబోవుచుండ, సుఖద మోము నావలకుద్రిప్పుకొని "వలదు. ఎన్నటికిని వలదు. నేను ధరావతునేల ఇచ్చెదను? ఇకముందు నానోరు విప్పకుండుటకు, నాకనులకు గంతలుకట్టుకొనుటకు, నావాయికి చిక్కము తగిలించుకొనుటకునా? అంతకన్న నాకన్ను లూడబెఱికించు కొనుట నానాలుక తెగగోసివైచుకొనుటయు మేలు." అనెను.

సమరకాంతుని సహిష్ణుత మేరదాటజొచ్చినది. అతడుగర్జించుచు "నీనాల్క నీవశములో లేకున్నచో తఱిగివైచుకొనుము. నేనుబ్రతికి యుండగా నాకోడలు చెఱగావింపబడుచుండ చూచుచుండుట నావల్ల గాదు. నీవు హరతాళము గావింపించుటకు ముందు నన్నేటికడుగలేదు? నీకుపేరు పెద్దఱికమునుగూర్చి లజ్జలేకపోవచ్చును. కాని నాకున్నది. ఏగౌరవసంరక్షణార్థమై నేను నాతనయుని త్యాగి మొనరించివైచితినో ఆమర్యాద నీచేతులలో నాశనము కానీయజాలను" అనెను.

వీధిలో మోటారుహారను ధ్వని వినవచ్చెను. సుఖద చెవులు, నిక్కబడెను. ఆమె యావేశముతో గుమ్మమువంక కేగెను. తిరిగివచ్చి నైనా చంకలోనుండి బాలకునెత్తుకొని యక్కునజేర్చికొని తనగదిజొచ్చి

తనభూషణముల నొలిచివైవజొచ్చెను. సమరకాంతుని కోపమంతయు నీళ్ళుపడుటతోడనే వెలిసిపోవు పచ్చరంగువిధమున నెగిరిపోయెను. ఒక్క పరుగున బయటికేగి తిరుగ లోనికేతెంచి కళవళపడుచు "కోడలా! డిప్యూటీ వచ్చివేసినాడు. నేను ధరావతునిచ్చుటకు పోవుచున్నాను. నాయీ ప్రార్థన మంగీకరింపుము. నన్ను మరణింపనీ;ఆపిదప నీయిచ్చ వచ్చినట్లు చేతువుగాక" అనెను.

సుఖద గదిగుమ్మములో నిలిచి దృఢముగ "నేనేజామీనీయను. నేనీకేసు వాదింపను. నేనే యపరాధమును చేయలేదు" అనెను.

సమరకాంతుడు తన జీవితమున నింతవరకు నేయోటమిని లక్ష్య పెట్టలేదు. కాని నేడీయభిమానవతి యగు రమణిచే నాతడుజితుడై పోయెను. ఆమెపలుకు లాతనినోటికి చిక్కములయ్యెను. అతడు "ప్రపంచము స్త్రీల నబలలనుచుండును. అది యెంతచూర్ఖ్యము! మనుష్యుడు ప్రాణములకన్న నెద్దిప్రియముగ భావించుచుండునో అదిస్త్రీల పిడికిలిలో నున్నది" అని తలచెను. సవినయముగ నతడు "కాని నీవింకను భోజన మైన చేయలేదు. నైనా! నిలువబడి ఏమిచూచుచున్నావు. తెల్లబోయి భంగుతాగితివా? పొమ్ము. కోడలికిభోజనముపెట్టుము. ఓరీ! ఓమహారా ఈభడవా ఎచట చచ్చినాడో తెలియదు. సమయమున కొక్కడును కనబడడు. నీవు వదినెను వెంటయింటిలోనికి తీసికొనిపొమ్ము నైనా. నేను పరుగుపరుగునపోయి మిఠాయితెచ్చెదను. ఆమె వెంటనే పైన తినుబండములు తీసికొని పోవలసియుండును." అనుచుండ మేడపైన పక్కవేయుచుండిన సేవకుడు పరుగెత్తుకొనివచ్చి యెదుటనిలచెను. సమర కాంతుడు వానినూచిపుచ్చుకొని యొకలెంపకాయవైచి "ఎచటనుంటి విరా? ఇంతసేపటినుండి పిలుచుచుండ వినబడలేదా? ఎవరికి వేయుచుం టివిరా పక్కలు భడవా? కోడలు వెళ్లిపోవుచున్నది. పో. బజారు నుండి మంచిమిఠాయి పట్టుకొనిరా. నీవుపెద్దబజారులో మొగదలనున్న అంగడిలో తెమ్ము" అని యాజ్ఞాపించెను.

సుఖద యనురోధపూర్వకముగ "నాకు మిఠాయి బొత్తిగ నక్కరలేదు. తినుటకు హితవులేదు. కొన్ని బట్టలుమాత్రము పట్టుకు పోయెదను. అవియేచాలు" అనెను.

వెలుపటినుండి పిలుపు వినవచ్చెను. "సేఠ్ జీ! దేవిగారిని త్వరగా పంపుడు. ఆలస్యమగుచున్న"దని.

సమరకాంతుడు బయటికేగి, నేరమొనరించినవానివలె నిలువ బడెను.

"డిప్టీ" రెండుమడతలుగలగడ్డము, తేజోయుక్తములగు కను గవ నవ్వుముఖముగల యాజానుబాహువు. ఇతరశాఖలయందే యుద్యోగమును లభింపమి, రక్షకభటశాఖజొచ్చెను. అనవసరమగు నసభ్యవర్తన నాతని కసహ్యము. సాధ్యమైనంతవరకు లంచములు తీసికొనడు. అతడు సమరకాంతుని "చెప్పుడు. ఏమినిశ్చయమైనది?" అని ప్రశ్నించెను.

చేతులు కట్టుకొని సమరకాంతుడు "ఎంతమాత్రము వినుటలేదు స్వామీ! చెప్పి, చెప్పి విఫలుడనైతిని. ఆమెకు నేనేమి బోధింప గలను? ఆమెనాకేల చెప్పును ఇక మీదయయే ఆధారము. మీరెట్టిసేవ యాజ్ఞాపించినను సిద్ధముగ నున్నాను. జైలరుగారికికూడ దయయుంచి యొకింత చెప్పుడు. మీకును వారికిని పరిచయము, గిరిచయము నుండ వచ్చును. కష్టపెట్టరాదు. నేను తమకు పరాయివాడనుకాను. పాపము. నాజూకుపిల్ల!" అనెను.

శేఠ్ జీని 'డిప్టీ' కుర్చీలో కూర్చుండబెట్టుచు "శేఠ్ జీ! ఏదైన దురాచరణవలన గలిగిన నేరములలో ఈమాటలు వర్తించును. దేవీజీ తనకొఱకేద్దియు చేయుచుండలేదు. ఆమెసంకల్పము సత్యమైనది. పేదలయధికారముకొఱ కామె పోరాడుచున్నది. ఆమె కేవిధమగు కష్టము గలుగదు. సేవావృత్తిచేత నేనశక్తుడను, కాని ఈమె పదముల

కడ మోకరిల్లవలసినయంత మహానుభావురాలు! భగవంతు డఖిల ప్రపంచమునకును నీమములు ఘటించినాడు. కాని వానినన్నిటిని తృణీకరించివైచి, యీమె సత్వములకొఱకు, సర్వము సహింప సంసిద్ధయై యున్నది! అందుకు సాహసము కావలెను. అది సామాన్యసంగతి కాదు'' అనెను.

శేర్ జీ తనచందువానుండి పది మొహిరీలుతీసి సవ్వడికాకుండ డిప్టీజేబులో పడవైచుచు "ఇవి తమపిల్లలకు మిఠాయి కొనిపెట్టుట'' కనెను.

డిప్టీ మొహిరీలు జేబునుండి వెలికిదీసి, బల్లపైనిడి "తాము! రక్షకభటులు కేవలము పశుప్రాయులుగా భావించుచుండిరా శేర్ జీ, ఎట్టిపాగా నెత్తిబెట్టినంతమాత్రమున మనుషత్వము జంపుకొనుటయేనా? దేవీజీకిసుమంతయు కష్టముకలుగదని నేను మీకు నమ్మకము గలిగించుచున్నాను. ఒరులను కష్టపెట్టువారికే కష్టములొదవుచుండును. నిరుపేదల హక్కులకై సర్వస్వమును త్యాగమొనరించు నామెను హింసించువాడు మనుష్యుడుకాడు. పశువునుకాడు. కేవలము సైతాను. మావృత్తిలో నట్టివారు నున్నారు. కాని వారు దౌర్భాగ్యముచేత నున్నారు. నేనును దేవతనుకాను. గాని, ఇట్టిసందర్భములో తమలపాకు తొడిమనైన స్వీకరించుట మహాపాతకముగ దలతును. దేవిజీ దేవాలయ సందర్భములో నెంతటిసాహసముతో క్షేత్రమున బ్రవేశించి తుపాకుల గుండ్లకు వక్షఃస్థలమునొడ్డి, నిలచెనో, అది యీమెకే చెల్లును!

ఇంటియెదుట ప్రజాసమూహము క్షణక్షణ మభివృద్ధి యగుచుండెను. మాటిమాటికి జయజయధ్వనులు మిన్నుముట్టుచుండెను. స్త్రీలు, పురుషులును దేవిజీని సందర్శించుటకు పఱువులెత్తుకొనివచ్చి వ్రాలుచుండిరి.

ఇంట, సుఖద నైనాలమధ్య ద్వంద్వయుద్ధము జరుగుచుండెను

ఎదుటి పళ్ళెరమును త్రోసివైచుచు సుఖద నే చెప్పివైచినాను. నేను తిననని'' అనెను.

ఆమె చేయిపట్టుకొని నైనా "రెండు మూడు కబళములు తిను వదినే! నీకాళ్ళపై బడుదును. మరల నిట్టియదన్న నెన్నటికివచ్చునో'' అనెను.

ఆమె కనులనీరు చిప్పిలుచుండెను. సుఖద నిష్ఠురముగ "నీవు నన్నూరక ధిక్కరించుచుంటివి వదినే. నేనింకను చాలయేర్పాటు గావించుకొనవలసి యున్నది. అటు డిప్టీ తొందరచేయుచున్నాడు? కన బడుటలేదా? గుమ్మములో డోలీ సిద్ధముగనున్నది. ఈసమయములో తినుటకెవ్వరికి హితవుండును?'' అనెను.

ప్రేమవిహ్వాలిత కంఠస్వరమున నైనా "నీపని నీవు చేసికొను చుండుము. నేను ముద్దలుచేసి నీకు తినిపించుచుందును'' అనెను.

ఆటలాడుకొనుచున్న బిడ్డకు వెనుక వెనుకనే పరుగిడుచు తిని పించు తల్లిచందమున వదినెకు నైనా ముద్దలు నోటికందించుచుండెను. ఒకపరి ఈబీరువాదగ్గరకు ఒకసారి ఆయలమారుకడకు సుఖద పోవు చుండును! ఒక పెట్టెనుండి కుంకుమబరిణెతీయును వేరొకపెట్టెనుండి చీఱవెలికీడ్చును. నైనాచేత నొకముద్దబెట్టుకొని, నోటికందించి, మఱల పళ్ళెము సమీపించు చుండును, మఱల ముద్దచేసివదినవెంట పరుగెత్తును.

సుఖద రైదారుకబళములు మ్రింగి, "చాలు! ఇక మంచినీరు పట్టించు''మనెను.

నైనా యామెనోటికడకు ముద్దనందించుచు "సరి. ఈ యొక్క ముద్దతినుము. నాబంగారువదినెవుకావు?'' అనెను. సుఖద నోరు తెఱచి, కన్నీటిబిందువులతోగూడ లోనికి జొప్పించుకొనెను.

"ఇంకొక్కటిమాత్రమే'' అనెను నైనా.

"ఇక నొక్కటికూడ వలదు''

"నాసంతోషముకొఱకొక్కటి''

సుఖద యాకవళముకూడ నారగించెను.

"మంచిసీళ్ళిత్తువా, లేక నోట గ్రుక్కుచునే యుందువా?"

"అట్టులే. ఇక నొక్కకబలము మాఅన్న పేర తినవలెను."

"ఉహుం ఎవరిపేరునను వలదు"

నైనా కండ్లు తడిసిపోయి, యశ్రులు ప్రత్యక్షమైనవి. సుఖద కనులలోను జలబిందువులున్నవి కాని గుప్తరూపమున నైనాశోకవిహ్వలమై యున్నవి. సుఖద యాత్మబలముచే దానినణచిపెట్టియుంచినది. ఆమె నిష్ఠురతదాల్చి, ఒక్కసారిగ నైనాయొక్క మోహపాశముల దుంచివేయదలచుచున్నది. ములుకులవంటి పాషణములతో తన హృదయము చుట్టుకందకముద్రవ్వికంచెవైవ యత్నించుచున్నది. మోహమును, శోకము, వియోగవ్యధల యాక్రమణమునుచే రక్షించుకొనగోరుచున్నది. అగడ్త నిర్మించుకొనగోరుచున్నది. కాని నైనాయొక్క సమ్మోహనకరములగు దృష్టులు, ఆవినయవినమితదైన్యముఖశ్రీయు ఆమెను నిశ్శస్త్రగా నొనరించి వైచుచున్నవి.

వడివడి తమ్మలపుటాకు చిలుకలు చుట్టి నైనా కోటికందించుచుండెను. అశ్రులు వఱదవలె నుప్పొంగసాగెను. ముఖము చేతులతో కప్పుకొని యేడువజొచ్చెను. లోలోని సన్నసన్నని దుఃఖము ఘనతరమై కంఠ పూర్తియయ్యెను.

ఆమె నక్కున జేర్చికొని, సుఖద సజలకంఠస్వనమున "ఏల యేడ్తువు? ఛీ! ఛీ! మధ్య మధ్య కలసికొనుచుండవచ్చును. చెఱసాలకు నన్ను చూడవచ్చినపుడెల్ల మంచిమంచి వస్తువులుచేసితీసికొనిరావలెనుసుమా! రెండుమూడు మాసములలో తిరిగి వచ్చివేయుదును" అనెను.

నైనా మునిగిపోవుచున్న నావపైనుండి పలుకుచున్నదానివలె "నేను సర్వాగ్నురాలను, నేను మునిగియే యున్నాను. నిన్నుకూడ ముంచివేయుచున్నా ...నేను.

సుఖద చెఱగొనిపోబడునని వినినప్పటినుండియు, విశేషముగ నామె వేదన యతిశయిల్లుచు, పుండువలె నామెహృదయమును గాఱించుచుండెను.

ఆశ్చర్యముతో సుఖద యామెను దిలకించుచు నీవేమనుచుంటివి నైనా? పోలీసువారిని నీవు రావించితివా యేమి?'' అని ప్రశ్నించెను.

గ్లానిభరితకంఠముతో నైనా ''ఇది యాపాషాణభవనమువారి కుచ్చితము. (శేఠ్ ధనీరామును పట్టణములో నీపరికారము వారొనర్చుచుందురు.) నే నెవరిని దూషించుటలేదు. కాని వారొనర్చినది వారికే యనుభవనీయము కాగలదు. ఎవరినోటినుండియైన నాశీర్వచన శబ్దము వెలువడదో వారిజీవితము వృధా! అనెను.

ఉదాసీనముతో సుఖద ''ఇందు వారిదోష మేమున్నది వదినే! ఇది మనసంఘముయొక్క దోషము, మన యెల్లరిదోషమును మంచిది రమ్ము ఇక మనము విడిపోవలెను. నేను వెడలిపోయినవెనుక దుఃఖింపనని బాసచేయుము'' అనెను

ఆమెను గౌగలించుకొని నైనా, సజలారుణలోచనములతో ఏడువను వదినే'' అనెను.

''నీవేడ్చుచుంటివని వింటినేని, నాశిక్షాకాలము వృద్ధిగావించుకొనెద'' ననెను సుఖద.

''అన్నకీసమాచారము దెలుపుదునా?''

''నీ యిచ్చవచ్చినట్లు చేయుము. అమ్మ నారడించుము''

ఆమెయొద్ద కెవరినయిన పంపిరా లేదా?

''ఆమెను పిలిపించిన మఱింత యాలస్యమగును. గంటలకొలది వదిలిపెట్టదు.''

''వినిన పరుగెత్తుకొని వచ్చును''

''అగుచు వచ్చును'' కాని, విచారించకు. ఆమె ప్రేమ కనులలోనేయుండును హృదయమునఱుగ దానిప్రేళ్ళు పాఱవు.

ఇరువురును ద్వారము సమీపించిరి. నైనా బాలకుని మాతృ హస్తములనుండి తీసికొని, లాలింపబోయెను. కాని పిల్లవాడు చంక దిగ నొల్లడయ్యెను. వానికి నైనాకడ నెక్కుడు చనవే. కాని నేడువాడు తనయబోధనయనములతో నవలోకించుచు "అమ్మ యెచటికో పోవు చున్నది. ఆమె చంకనుండి యెట్లుదిగను?" అని తెలుపుచుండెను. అత నిని వదలి యామె యెచటికైన పోయినచో పాపము వాడేమి చేయ గలడు?

నైనా వానిని ముద్దుపెట్టుకొని "పిల్లలు కడు నిర్దయులు" అనెను,

"సుఖద నవ్వుచు "ఎవరికొఱకు?" అనెను.

ద్వారము సమీపించినంతనే యిరువురును మఱల కౌగలించు కొనిరి. సమరకాంతుడును ముంగిట నిలచియుండెను. సుఖద యాతని చరణముల కెఱగెను. ఆతడు కంపితహస్తుడ్వాయి నామెను లేవనెత్తి యాశీర్వదించెను. తదుపరి బాలుని నక్కున జేర్చుకొని, వెక్కి వెక్కి యేడువసాగెను. అది యింటిలో నెల్లరకు నేడ్చుటకు సూచనయయ్యెను. కన్నీరు మొదటినుండియు రాలుచునే యున్నది. ఆమూగరోదనము కట్లు దెంచుకొని బయటపడెను. శీతల, ధీర, గభీరవృద్ధాప్యమెన్నడు విహ్వలితమగునో, యపుడు పంజరద్వారము విడిపోయి, పక్షుల నడ్డ గించుట యసంభవమైపోవును. డెబ్బదియేండ్లవఱకు సాంసారికసంగర మున సాహసముతో పోరాడిన వృద్ధయోద్ధు,అస్త్రసన్యాసము గావించి నపుడు నూత్నసైనికుల నెవ్వ డాపుచేయగలడు?

సుఖద మోటారుకారులో గూర్చుండెను. జయజయధ్వనులు మిన్నవియ మ్రోసెను. పుష్పవృష్టి గురిసెను.

మోటారు వెడలిపోయెను.

వేలకొలది జనులు శకటమువెనుక బరువిడుచుండిరి. సుఖదహస్త ములనుసారించి, వారికి ప్రణామము లొనర్చుచు పోవుచుండెను.

ఈశ్రద్ధ, ఈప్రేమ, ఈసమ్మానమును ధనముచే చేకూరగల్గునా? లేక విద్యచేత? దీనికొక్కటే సాధనగలదు. అది సేవ! మరి సుఖదయాక్షేత్రమున బ్రవేశించిమాత్ర మెన్నిదినములైనది?

బాట కిరుగెలకుల స్త్రీ, పురుషులు కుడ్యము నిర్మించిన వడువున నిలువబడి యుండిరి. మోటారు వారిహృదయములను జయగగొట్టుచు, పిండిచేయుచు బోవుచున్నట్లుపయనించెను.

కొంతదూరమునకు పిదప, బాటనిశ్శబ్దముగ నుండెను. శ్రావణ మందలి నిద్రాదేవివంటి కాళరాత్రి సంసారమును నిజ చేలాంచలమున విసరి నిదురబుచ్చుచుండెను. అనంతమున నాయయోమయశకటము స్వప్నముబాతి నెగిరిపోవుచుండెను. దేహమునకు కేవల శీతలవాయు స్పర్శమాత్రమున గమనవేగజ్ఞానము గలుగుచుండెను. ఈయంధకార మున సుఖద యంతఃస్థలమున నొక ప్రకాశమువంటిది యుదయ మయ్యెను. అది మనజీవితపు టంతిమపు గడియలలో నుదయించు వెలుగువంటిది. ఆప్రకాశమున మనసుయొక్క కాలుష్యములు, గ్రంధులు, వైషమ్యములును, యధార్ధరూపమున ప్రత్యక్షమగును. అపుడు మనమెద్దానిని కాళసర్పమని భావించితిమో యది రజ్జువు మాత్రమేయనియు, దేనిని కాళవిగ్రహమని భ్రమించితిమో యది తృణరాసి యనియు తెలియబడగలదు.

సుఖదకు నేడు తనపరాజయముయొక్క జ్ఞానముకలిగెను. ఆ యపజయము అన్యాయసమక్షమునకాదు; అసత్యము నెదుటకాదు, కేవలము సేవయెదుట త్యాగముసమక్షమున ... సేవ, త్యాగముల విషయముననే సుఖదకు పతితోడ మతభేదము కలిగెను. అదియే వారి వియోగమునకు హేతువయ్యెను. యీసిద్ధాంతములయెడ భక్తిలేకుం డియు, నామె యీవంక కీడ్వబడి, నేటికి పతిపథానుగామి యయ్యెను. అమరుగు రచించి శాంతికుమారుగున కనిపిన యీలేఖ సుఖదకు జ్ఞాపకము

వచ్చెను. తొలిసారి పతియెడ క్షమయొక్క భావ మామెహృదయమున స్ఫురించెను యీ క్రమయందు దయలేదు. సహానుభూతి కలదు. సహయోగము కలదు. ఇప్పుడిరువురు నేకపథమున చనుచున్న పథికులు. ఏకాదర్శోపాసకులు. వారియందెట్టిభేదమును లేదు. వైషమ్యములేదు. నేడామెకుభర్తతో మానసికమగు సామరస్యము సిద్ధించినది. ఏదైవమును పూర్వమమంగళకారియని యామె భావించుచుండెనో నేడు వానిని పూజాపురస్కారము లొనర్చి యామె యారాధింపజొచ్చినది.

ఇంతలో మోటారాగిపోయెను. డిప్యూటీ సూపరింటెండెంటు దిగి సుఖదతో "దేవీజీ! జైలువచ్చినది. నన్ను క్షమింతురుగాక!" అనెను.

సుఖదాదేవి తనజీవధనముతో గలసికొనివచ్చినట్లు సుప్రసన్నయై యుండెను.

మూడవభాగము—సంపూర్ణము.



శ్రీనికేతన్ ప్రెస్, రాజమండ్రి.